317వ సంచిక

# చతుర

జూన్ 2004

రూ. 7/-



సూరేపల్లి విజయ

## ఈ వేకువ మీకోసం

13. 6. 04 (ఆది)

# చతుర కతలు

## నోరు లేనివాడు

వీరవెంకట వరాహ సత్యనారాయణమూర్తికి ఒళ్లు మండిపోయింది.

పోదామరి?

ఆఫ్టరాల్ ఓ కూరగాయలమ్మేవాడు తనని పట్టుకుని అంత మాటంటాడా?

ఎంత పొగరు?

మాట? !

అంత వ్యంగ్యమా? ఎంత తల పొగ్గరైతే మాత్రం మరీ అంత నిస్సాకారమా?

అసలు తనని పట్టుకుని 'నువ్వు' అనడం ఏంటి?

తానంత పనికిమాలినవాడిలా కనిపిస్తున్నాడా వాడి కళ్లకి?

మనసు కుతకుతా ఉడికిపోతుండగా వాడికేసి రుసరుసా చూశాడు వీరవెంకట వరాహ



ఎంత కండకావరం.

వాడు కూరగాయలమ్ముకునేవాడే కావచ్చు

కూరగాయల ధరలు ఆకాశాన్నంటుతున్న మాట నిజమే కావచ్చు

అయితే మాత్రం?

వాడడిగినంతా ఇచ్చి తీసేస్కోవాలన్న రూలేవన్నా ఉందా?

బేరమాడ్డం కష్టమర్ల జన్మహక్కు.

నచ్చితే ఇవ్వాలి. లేదంటే 'ఆ ధరకి రావు సార్' అని మర్యాదగా చెప్పాలి.

అంతేగాని- "నువ్వెప్పుడన్నా వంకాయలు కొన్నావా నాయనా?" అంటే అదేవన్న

సత్యనారాయణమూర్తి.

"ఏంటోయ్ నీ ఉద్దేశం? అంటే నీ కళ్లకి నేను వంకాయ మొహమెరగని ఏబ్రాసి వెధవలా కనిపిస్తున్నానా?" అన్నాడు రుసరుసా చూడ్డం అయ్యాక రోషంగా.

"అధిక ప్రసంగాలనవసరం నాయనా! కిలో పది హేన్రూపాయలు. ఒక్క పైసా కూడా తగ్గను. కొంటేకొను లేకపోతే పో. నీతో వాదిస్తూ కూర్చోవడానికి నాకు టైమ్‌లేదు" అన్నాడు వంకాయలవాడు.

అసలు వాడి మొహమే ఒక పుచ్చొంకాయలా ఉంది. దానికితోడు గారపళ్ళూ గీర

కవర్ ఫొటోగ్రాఫర్: మధు ❖ మోడల్: శివాని

మాటలూను.

వి.వి.వి.యస్.యన్. మూర్తికి కోపం న షాళానికంటింది వాడలా అనేసరికి.

"హోల్డ్ యువర్ టంగ్! నీగ్గాక నోరుందని ఇష్టానుసారంగా వాక్కు. అసలు నీ అంతర వేంటి, నా అంతరవేంటి? నన్ను పట్టుకుని 'నువ్వు' అంటావా? " అన్నాడాగ్రహంతో ఊగి పోతూ.

"నువ్వంటే తప్పేంటి? ఏం నువ్ నన్ను నువ్వనట్లేదా? "

వంకాయలవాడు మరింత గీరగా అలా అనేసరికి వాడి వంకరమూతిమీద ఫెడేల్మని గుద్దాలనిపించింది మూర్తికి.

అయినా ఎలాగో తమాయించుకుని "నీకూ నాకూ తేడా లేదా? " అన్నాడెర్రగా చూస్తూ.

"ఏంటా చూపు? నువ్ కోపంగా చూస్తే గజగజలాడిపోవడాన్కి ఇక్కడెవరూ గాజులు తొడుక్కుని లేరు! ఏంటయ్యా నీకూ నాకూ తేడా? నువ్వూ మనిషివే- నేనూ మనిషినే. నువ్ నన్ను 'నువ్వు' అంటున్నప్పుడు నేన్నిన్ను 'నువ్వు' అని ఎందుకనగూడదు? " 'కమాన్ టెల్ మీ' అనైతే అన్లేదుగానీ అన్నట్టుగానే చూశాడు వంకాయలవాడు.

"నువ్ కూరగాయలమ్ముకునేవోడివి. నేనొక గవర్నమెంట్ ఎంప్లాయ్‌ని. నీకూ నాకూ డిఫ రెన్స్ లేదా? "

"ఏంటయ్యా బోడి ఢిపరెన్సు? నువ్ గవ ర్మెంట్లో ఉజ్యోగం చేస్తుంటే ఎవడికెక్కువి క్కడ? నీ జీతంలో సగం నాకేవన్నా ఇస్తు న్నావా? బోడి మూడువేలో నాలుగువేలో జీతమొస్తాదేమో నీకు. కానీ కాయగూరలమ్ము టంవల్ల నాకెంతొస్తాదో తెలుసా? రోజుకి మూడొందలు. అంటే నెలకి తొమ్మిదివేలు"

వంకాయల వాడలా అంటుంటే 'అమ్మ బాబోయ్' అనిపించింది మూర్తికి.

అయినా ముఖంలో ఆ ఆశ్చర్యం కనపడ కుండా జాగ్రత్తపడుతూ, "ఎందుక రావూ అయిదు రూపాయల వంకాయల్ని పదిహే నూపాయల కమ్ముతుంటే? " అన్నాడు కోపంగా.

"అయిదు రూపాయిల్కి కిలో వంకా యలా? చాల్చాల్లే మూస్కోవయ్యా! కిలో వంకాయలు కాదుగదా, రెండుల్లిపాయలు కూడా రావు. అయినా ఈ వాదనంతా దేని కయ్యా? నా సరుకు నా ఇష్టం. నా ఇష్టమొ చ్చిన రేటుకి అమ్ముకుంటాను. నచ్చితే కొను లేకపోతే దొబ్బేయ్! నన్నింక విసిగించమాకు" మరింత ఈసడింపుగా అన్నాడు వంకాయల వాడు.

'ఓరి దేవుడోయ్! కూరగాయలమ్ముకునే వాడికింత పొగరా? ఇలాంటి మర్యాద తెలి యని ముండాకొడుకుల్ని ఎలా పుట్టిస్తావ్‌రా భగవంతుడా? ' అని మనసులో అనుకుని.

"మాటలు తిన్నగా రానియ్యవోయ్! దొబ్బేయ్ ఏంటి దొబ్బేయ్? " అన్నాడు మూర్తి వాడి దిక్కు మింగేసేలా చూస్తూ.

"దొబ్బేయ్ అంటే అదేం 'బూతుమాట' కాదు. వెళ్ళిపొమ్మని అర్థం" అన్నాడు వంకా యలవాడు వ్యంగ్యంగా.

"అలాగా నాయనా? అలాగని ఏం నిఘం టువులో రాసుందేంటి? " తను కూడా వ్యంగ్యంగానే ఎదురుప్రశ్న వేశాడు మూర్తి.

అంతలో "పోనీలెండి మాష్టారూ! అతన్తో మీకెందుకూ? పదిహేనుకి తగ్గనంటున్నా డుగా. మీకు నచ్చకపోతే ఇంకోచోట కొను క్కోండి" అన్నాడు అంతసేపూ వాళ్ళ పోట్లా టని గమనిస్తూ ఆ పక్కనే మౌనంగా నిల బడ్డ ఓ పెద్దమనిషి. అంటే తలపండిపోయిన వాడని కాదు. గౌరవనీయుడికిమల్లే కనిపి స్తున్న ఓ వ్యక్తని అర్థం.

మూర్తి చటుక్కున ఆ పెద్దమనిషివైపు తిరి గాడు. "అది కాదుసార్! రేటెంతన్నది కాదిక్కడ ప్రశ్న. మంచీమర్యాదా లేకుండా ఎలా మాట్లా డుతున్నాడో చూడండి! ఇప్పుడు మీరున్నారు. నాకన్నా వయసులో కాస్త పెద్దవారే అయ్యుండి కూడా, మాష్టారూ మీరూ అంటూ ఎందుకు మన్నించారు? సంస్కారం అనేది ఉండబట్టేగదా? కానీ అతను చూడండి

సంస్కారం లేకుండా 'నువ్వు', 'నువ్వు' అని ఎలా మాట్లాడుతున్నాడో? "

ఫిర్యాదు చేస్తున్న ధోరణిలో మూర్తి అలా అంటుంటే వంకాయలవాడికి తిక్కరేగిపోయినట్టుంది. "చప్ ముయ్యేసే నోరు" అంటూ తన చేతిలో వున్న తక్కెణ్ణి విసురుగా నేలకేసి కొట్టాడు.

"చూశారా... చూశారా ఎంత పొగరో..." అంటూ పక్కనే వున్న పెద్ద మనిషితో ఇంకా ఏదో అనబోయాడు మూర్తి.

కానీ ఈలోగా వంకాయలవాడు "చంపేస్తానారేయ్ ఇంకొక్కమాటగాని మాట్లాడేవంటే! నా బేరం నన్ను చేస్కోనివ్వకుండా ఏంట్రా నీ గోల? అసలెందుకురా నేన్నీకు మర్యాది వ్వాల? నువ్వేమన్నా దొరవా? " అంటూ దిగ్గున లేచాడు.

తలకున్న తుండుగుడ్డని తీసి వాడు నడుంకి చుట్టుకుంటుంటే సీన్ అర్థమైపోయింది మూర్తికి.

అంటే వాడు తనని తన్నడానికి సిద్ధపడిపోతున్నాడని తెలిసిపోయిందన్నమాట!

దాంతో ఎందుకొచ్చిన గొడవలెమ్మని చల్లగా జారిపోయాడక్కణ్ణుంచి.

అంటే 'కూలై' వెళ్ళిపోయాడని కాదు. మన సుడుకు తగ్గిపోయిందని కాదు "ఇలాంటి కంగాళీ వెధవల్ని ఎందుకు పుట్టిస్తావ్‌రా భగవంతుడా" అని మనసులో తిట్టుకుంటూనే జారుకున్నాడక్కణ్ణుంచి.

అతనలా తిట్టుకుంటుంటే...

ఒళ్ళు మండిపోయింది భగవంతుడికి.

పోదామరి?

ఆఫ్టరాల్ ఒక అల్పమానవుడు సకల చరాచర సృష్టికీ మూలకారకుడైన తనని పట్టుకుని మంచీ మర్యాదా లేకుండా 'ఒరేయ్ గిరేయ్' అంటుంటే ఎంత భగవంతుడైతే మాత్రం బాధ కలక్కుండా ఎలా ఉంటుంది? ఒళ్ళు మండకుండా ఎలా ఉంటుంది?

అయినప్పటికీ పాపం ఆయన నోరు లేనివాడు కాబట్టి వీరవెంకట వరాహ సత్యనారాయణమూర్తినేమీ అనలేకపోయాడు.

'ప్చ్ ఏమిటో ఈ భగవంతుడి జన్మ' అని మనసులో మాత్రం చాలా బాధగా అనుకున్నాడు.

– కొలపల్లి ఈశ్వర్

---

## బంగారు కొండలు

వంట్లో బావోలేదని మా తోడల్లుడు సుబ్బారావ్ ఆసుపత్రికెళుతుంటే తోడెళ్లా. బైట బోలెడంత క్యూ. గంటన్నరకైనా లోపలికి పోవటం డౌటే. ఆఫీసు టైమవుతుందని నేనొకటే కంగారు పడుతుంటే వరండాలో గుర్నాధం కనిపించి పలకరించాడు. వాడు హైస్కూల్లో నా క్లాస్‌మేట్. చాలా ఏళ్ల తర్వాత అనుకోకుండా ఇలా కలిశాడు. మేమొచ్చిన పని కనుక్కుని చనువుగా "డాక్టరుగారు నాకు తెలుసులేరా నువ్వెళ్లు. బ్రదర్ని నేను చూపించి పంపిస్తా" అన్నాడు. ఫోన్ నెంబర్ తీసుకున్నాడు.

సాయంత్రం ఇంట్లో సుబ్బారావు గుర్నాధాన్ని ఒహటే పొగట్టం. 'మీ ఫ్రెండుకి మంచి ఇన్‌ఫ్లుయన్సుందండీ! చెకప్పులూ అవీ చకచకా చేయించేశాడు. రిపోర్ట్సు తీసుకుని వస్తానన్నాడు. మిమ్మల్ని చూసి చాలా కాలమైందటగా' అంటూ. గుర్నాధం హైస్కూలు రోజుల్లో బిలో ఏవరేజ్. వెనకబెంచీలో కూర్చుని ఎప్పుడూ ఏవో పెన్నులు రిపేరుచేస్తుండేవాడు. వాడి సంచీ నిండా బోలెడన్ని కేపులు, పాళీలూ, నిబ్బులూ ఉండేవి. సిరా బుడ్డీ, చెత్తగుట్టతో ఎప్పుడూ రడీగా ఉండేవాడు. పైసాకి పాళీ, రెండు పైసలకి నిబ్బూ, మూడు పైసలకి కేపూ మొత్తం పెన్నయితే అణా... అలా అమ్మేవాడు. పంతుళ్లు ఏమనేవాళ్లుకాదు. వాళ్లక్కావాల్సొచ్చినప్పుడల్లా ఓ పెన్ను చేసి ఫ్రీగా ఇచ్చేవాడు. టెన్త్‌లో పరీక్ష పేపర్లు తారుమారు చేశాడని డిబారు చేశారు.

తరువాత ఇదిగో ఇదే మళ్లీ దర్శనం.

గుర్నాథం తెచ్చిన రిపోర్టు చూసి మా గుండె జారిపోయింది. 'కిడ్నీ ప్రాబ్లంట. ఆపరేషన్ అవసరమంటున్నాడు డాక్టర్' అన్నాడు గుర్నాథం సానుభూతిగా. 'కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషనంటే మాటలా. దానికి ముందు డయాల్సిస్ తర్వాత డయాలిసిస్ లక్షల్లో ఉంటుంది వ్యవహారం. డోనర్ దొరకటం కూడా కష్టం. రిలేషన్ కాకపోతే ఆథరైజేషన్ కమిటీ అప్రూవల్ కావాలి. కేసులవుతున్నాయని చాలా మంది డాక్టర్లీ తరహా ఆపరేషన్‌లకి దూరంగా

కార్నియా ఐదు లక్షలిస్తేగాని దొరకదు"

"వంట్లో పార్టుల్నిలా ఎవరైనా ఎలా అమ్ముకుంటారు గుర్నాథం? " అనడిగా.

"పేదరికం ఎంత పనయినా చేయిస్తుంది బాబూ! రోగి మెదడు చచ్చిపోయినా... గుండె కొట్టుకుంటుందొక్కోసారి. అలాంటి కేసుల్లో బంధువులు ఆర్గాన్స్ అమ్ముకొంటుంటారు"

"దారుణం"

"అవసరం అలాంటిది. అయినా ఇందులో దారుణం మాత్రం ఏముందీ! వజ్రాయుధం



ఉంటున్నారు'

"అవన్నీ నేను చూసుకుంటాగానీ మనీ సంగతే మీరాలోచించుకోండి" అని హామీ ఇచ్చాడు గుర్నాథం.

"ఆపరేషన్‌కెంతకావచ్చు సుమారుగా" అనడిగాడు సుబ్బారావు.

"రెండు లక్షలు"

"అమ్మో! గవర్నమెంటు ఎంప్లాయీని కూడా కాదే కర్చులు రాబట్టుకోటానికి"

"ఇదింకా చవుక సార్! లివరయితే అయిదు లక్షలు. హార్ట్, లంగూ పదిపది లక్షలు. పేంక్రియాస్ నాలుగు, కంటిగుడ్డుకు వాడే

కోసం ఇంద్రుడు దధీచి ఎముకల్ని దానంగా లాక్కోలా. కవచకుండలాల్ని కూడా దానం చేసిన దానవీరశూర కర్ణ కథ మనక్కొత్తా! డబ్బు పడేస్తే లివర్నయినా ఫ్లవర్లో పెట్టిచ్చే వాళ్లు వేలాది మందున్నారు. గుండె కాయలు బెండకాయల్లాగా, కంటిగుడ్లు కోడిగుడ్లలాగా అమ్మే మార్కెట్ యూరప్‌లో కూడా ఒకటుంది"

"చట్టం ఊరుకుంటుందా? "

"చట్టం డబ్బుకు చుట్టం. ప్రాణం ముందు ఏ ధర్మమూ నిలవదు. ఇలా మాట్లాడుతూ కూర్చుంటే మేటరంతా మెలోడ్రామా అయిపోతుందిగాని ఆలోచించుకుని కబురు చేయండని" వెళ్లిపోయాడు గుర్నాథం.

వంటిమీది బంగారాన్ని, ఊరిబైట స్థలాన్నయినా సరే అమ్మి ఆపరేషన్ చేయించుకోవాల్సిందేనని సుబ్బారావు ఫేమిలీ పట్టుపట్టింది. గుర్నాథానికి కబురుచేస్తే అన్నంరాజుని కలవమన్నాడు. గడ్డియన్నారంలో ఉన్న అదేదో అనాథశరణాలయంలో ఉన్నాడాయన. గుర్నాథం పేరు చెప్పగానే సగం రేటుకి దిగి వచ్చాడు.

"డోనర్ని మాత్రం మీకు చూపించం. మీకే రిస్కు. పదేళ్ల బట్టి ఈ వ్యాపారంలో ఉన్నాం. మమ్మల్ని నమ్మండి అని సగం పైకం అందుకున్న తర్వాత ఆపరేషన్ డేటు దాకా కిడ్నీ రెండు నెలలకు నాలుగు వేలు. డోనర్ హెల్దీగా ఉండటం మీకే మంచిది కదా!" అన్నాడు.

డాక్టరుగారు మరో మూడు నెలలగ్గానీ డేటివ్వల్లేదు. ఈ మధ్యలో పాపం, సుబ్బారావు, బాగా నలిగిపోయి చిత్రంగా మాట్లాట్టం మొదలుపెట్టాడు. ప్రతి మనిషికీ కనీసం నాలుగు కిడ్నీలన్నా ఉండాలి. అలాగే ఆరు చేతులు, పదికాళ్లు, నాలుగు చెవులు, రెండు ముక్కులు, వందనాలికలు, నాలుగు గుండెలు ఉంటే ఇంకా బాగుంటుంది" అంటూ

ఒక్క తలకే ఇంత తిక్కగా ఉంది. పది తలలైతే పట్టుకోగలమా? చేతులెక్కువైనకొద్దీ సంపాదన మీద యావ ఎక్కువైపోతుంది. అయినా ఆకారం అమీబాలాగా వికారంగా ఉండదూ. అంటే శివుడికి మూడు కళ్లులేవా? విష్ణుమూర్తికి నాలుగు చేతులు, బ్రహ్మకు నాలుగు ముఖాలు, రావణాసురుడికి పది తలకాయలు, ఇంద్రుడికి వెయ్యి కళ్లు, వీళ్లందరూ అందంగా ఉండగా లేనిది మనం మాత్రం అందంగా ఎందుకుండం? అంటూ మొండికి దిగాడు. ఈసారేమైనా సరే... దేవుడు కనిపిస్తే మాత్రం రకానికో జతన్నా ఎక్స్ట్రా అవయవాలివ్వాల్సిందేనంటా. ఒకటి పాడయినా ఇంకోటి పనికొస్తుంది" అన్నాడు సుబ్బారావు.

ఆపరేషనయిన మూడో వారంలో అనుకుంటా గుర్నాథం ఫొటో పేపర్లోపడింది. పక్కనే అన్నంరాజు, డాక్టరూ అంతా ఉన్నారు. అవయవాల నమ్ముకునే రేకెట్లో సుబ్బారావు కాపరేషన్ చేసిన ఆసుపత్రి పేరూ ఉంది. అనాథశరణాలయం మీద దాడిచేస్తే కిలోల చొప్పున కిడ్నీలు, లివర్లు ప్రిజర్వు చేసున్నట్లు బైటపడింది. కూరగాయలే సరిగా దొరకని రోజుల్లో ఇన్ని గుండెకాయలూ గట్రా ఎలా పోగేసారయ్యా అని ఏదో ఛానెల్ వాళ్లడిగితే పిల్లల వంక చూసి 'వీళ్లే మా పంట. బంగారుకొండలు. ఇంత మందిని పోషించాలంటే మరి పైసలెక్కడికెళ్తాయి' అని ఎదురడిగాడు అన్నంరాజు.

ఆసుపత్రుల్లో ఇలా ఆర్గాన్లు కొనుక్కుంటారని నీకెలా తెలిసిందని గుర్నాథాన్నడిగితే "మా మామ బినామీ పేర్లతో నా పేరుమీద తీసుకున్న బ్యాంక్ అప్పుతో గవర్నమెంటు లాండు మీద బిల్డింగు కడుతుంటే ప్లింత్ లెవెల్లోనే కూలిపోయి పెద్ద కేసయింది. పోలీసు దెబ్బ తప్పించుకోటానికి గుండెనొప్పొచ్చిందని ఈ ఆసుపత్రిలో చేరినప్పుడు వాసనపట్టా. అప్పట్నుంచీ ఈ డాక్టర్లతో ఇలాగా సావాసం" అన్నాడు టీవీలో.

సుబ్బారావు ఢామ్మని పడిపోయాడు. వేరే హాస్పిటల్లో మళ్లీ స్కానింగు తీయించిన డాక్టర్లు ముక్కుమీద వేలేసుకున్నారు. అసలొక్క కిడ్నీకూడా లేకుండా ఇంతకాలం ఎలా బతికాడు బాబూ ఈ సుబ్బారావు అని.

– కర్లపాలెం హనుమంతరావు

## పులిరాజుకు ఎయిడ్స్ వస్తుందా?

పులిరాజు షాక్ తిన్నాడు. తేరుకుని కోపంతో గాండ్రించాడు. పెళ్ళాం తనను అంతమాట అంటుందనుకోలేదు. 'నువ్వు అడ్డమైన తిరుగుళ్ళూ తిరిగొచ్చి నన్ను ముట్టుకుంటే ఊరుకోను. నీకు ఎయిడ్స్ వస్తుందని

లోకమంతా కాకై అరుస్తోంది. నిన్ను వదిలేస్తున్నాను' అంటూ తెగేసి చెప్పేసి పుట్టింటికి చెక్కేసింది.

అవమానంతో తలకొట్టేసినట్టయింది పులిరాజుకి. ఎక్కడ చూసినా అదేమాట... ఎవరినోట విన్నా అదే పలుకు. పులిరాజుకు ఎయిడ్స్ వస్తుందా? అంటూ.

ఆలోచనలో పడ్డాడు పులిరాజు. ఆరోజు ఏదో చికాకులో పెళ్ళాంమీద గాండ్రించాడు తాను. అది అలిగి తనను పక్కలోకి రానివ్వలేదు. దాంతో కోపం వచ్చి పొరుగు



ప్రాంతాలకు వెళ్ళి నచ్చినవాళ్ళతో సంభోగించాడు తాను. పెళ్ళాం తిక్క కుదర్చాలని మూడురోజులపాటు అక్కడే వుండిపోయాడు. తిరిగొచ్చేసరికి ఇదీ పరిస్థితి. ఎక్కడ చూసినా తనకు ఎయిడ్స్ వస్తుందా అన్న అంశంమీద చర్చలు ముమ్మరంగా సాగుతున్నాయి. చివరికి పెళ్ళాం కూడా వదిలేసి వెళ్ళిపోయింది. ఎంతటి పులిరాజయినా పెళ్ళాం వదిలేసిందంటే ఎంత నామోషీ.

అసలు పులిరాజుకు బోధపడని విషయం ఒక్కటే. తాను పొరుగుదేశంలో పరస్త్రీలను కలిసిన సంగతి అందరికీ ఎలా తెలిసిపోయిందా అన్నది? ! హఠాత్తుగా అనుమానం కలిగింది నిజంగానే తనకు ఎయిడ్స్ వస్తుందేమోనని. భయం కూడా పట్టుకుంది.

ఆ టెన్షన్ని భరించలేక డాక్టర్ దగ్గరకు పరుగెత్తాడు పులిరాజు. జరిగిందంతా వివరించి, తనకు ఎయిడ్స్ వచ్చిందేమో పరీక్షించమన్నాడు.

అంతా విని ఫకాలున నవ్వాడు డాక్టర్. పులిరాజు తెల్లబోతే నవ్వాపి, "నీకు ఎయిడ్స్ రాదు. పులిరాజుకు ఎందుకు వస్తుంది? మనుషులకు వస్తుంది. పులిరాజు జంతువు, మనిషికాదు" అంటూ తేల్చి చెప్పాడు.

"ఔను సుమా..." అంటూ బుర్రగోక్కుని, ముక్కుమీద తోక వేసుకుంది ఆ అడవికి సామంతరాజైన పెద్దపులి.

"ఆ మూర్ఖమానవుల మాటలు నమ్మి నా పెళ్ళాం నన్ను వదిలేసింది. అది మరో మగపులిని చూసుకోకముందే నిజంచెప్పి దాని మనసు మార్చాలి. వెళ్దాంపద" అంటూ పెద్దపులి తొందర చేయడంతో కిచకిచలాడుతూ దానివెంట హడావుడిగా పరుగెత్తింది ఆ అడవిలోని జంతువులకు ఏకైక వైద్యుడైన మర్కటం.

– తిరుమలశ్రీ

# పసిడిముత్యాలు

* సూర్యుడి కిరణాల్లాగే సత్యము కూడా ఎటువంటి బాహ్యమైన స్పర్శలతో మలినంకాదు.

– జాన్ మిల్టన్

* బాగా కష్టపడి పనిచేసేవారి ముఖం మనోహరంగా ఉంటుంది.

– డెకర్

* ఈ ప్రపంచంలో మనిషికి అందరినీ మించిన మిత్రులు అతని పదివేళ్లు

– రాబర్ట్ కొలియర్

* కష్టించి పనిచెయ్యడం ద్వారా మనిషి తన కష్టాలన్నిటినీ మరిచిపోగలడు

– సిసిరో

* కష్టపడి పనిచేయని మనిషికి దేవతలు దగ్గర కారు.

– ఋగ్వేదం

* అందం నడవడికలో ఉంటుంది, ఆడంబరాలలో, అలంకరణలలో కాదు

– మహాత్మాగాంధీ

* ప్రేమతో పరిపాలించడం మానవత్వం, అన్యాయంతో పరిపాలన జరపడం అనాగరికత అవుతుంది

– ప్రేంచంద్

* మనిషికి తన లోపలనే శాంతి లభిస్తే, ఇక సమస్త ప్రపంచమూ శాంతిమయంగా కనిపిస్తుంది.

– యోగవాశిష్టం

* సప్త ద్వీపాలలోనైనా, నవఖండాలలోనైనా, ముల్లోకాలలోనైనా శాంతితో సరితూగే సుఖం లేనేలేదు.

– తులసీదాస్

* తన జీవిత సర్వస్వాన్నీ ఒక మంచి లక్ష్యంకోసం అర్పించగలిగేవాడే నిజమైన త్యాగి

– వినోబాభావే

* మనిషికి మంచిప్రవర్తన అలవడాలంటే అందుకు చిన్నచిన్న త్యాగాలు ఎంతో అవసరమవుతుంటాయి.

– ఎమర్సన్

* మనిషి ఉపయోగించే అత్యంత శక్తిమంతమైన ఆయుధం మాట

– కిప్లింగ్

* ఉపాధ్యాయుడే విద్యార్థికి విలువైన పాఠ్యగ్రంథము

– మహాత్మాగాంధీ

సేకరణ: టి. మహి

# చతుర

317వ సంచిక జూన్: 2004

సంపుటి: 27 సంచిక: 5


బాల్యంలో ఆటా పాటా, అమ్మ పిలిచేదాకా ఆకలే తెలియని ఆనంద ప్రపంచం.

యవ్వనం... మనోభావాలు మనోజ్ఞ విహంగాలై మనసైనవారితో చెలిమికట్టి దాంపత్య ప్రాంగణంలో అడుగుపెట్టే అద్భుతకాలం.

**ఆలూమగలూ పాలూ నీళ్లలా... కుటుంబ జీవనంలో అల్లుకుపోయి... పిల్లాపాపల ముద్దు ముచ్చట్లు, పెంపకాలతో సమయమే తెలియని సుమధుర సంఘటనలూ... భారమనిపించని బాధ్యతలూ.**

మరి వృద్ధాప్యం...?

అందరికీ ఎలాగూ వరం కాకపోయినా కొందరికి శాపంగా మారితే...? పెద్దల పట్ల పిల్లల నిరసన ప్రశ్నార్థక మైతే... అటువంటి సమస్యలకి పరిష్కారముందా? వుంటే... ఏవిధంగా?

**సూరేపల్లి విజయ సహేతుకంగా, సమగ్రంగా, సాధ్యమంటూ విపులీకరించిన**

# ఈ వేదన మీకోసం

జూన్ చతుర సమగ్ర నవల.



జననంతో మొదలయ్యే జీవితం మరణంతో అంతమవుతుంది. మరణంతో కొన్ని కథలు మలుపు తిరిగి వ్యధలుగా విషాదమైన ప్రారంభంతో రూపుదిద్దుకుంటాయి.

ఆనందరావు ఇంట్లోని కథ ఆ విధంగానే మలుపు తిరిగి ఊహించని విషాదాన్ని మిగిల్చింది.

అరవై నాలుగేళ్ళ ఆనందరావు ఆరోజు వేకువఝామునే నిద్రలోనే తుదిశ్వాస విడిచాడు. రోజూ అలవాటుగా అంత వయసులోనూ మార్నింగ్‌వాక్‌కు బయల్దేరే ఆనందరావు ఆ రోజు లేవలేదు.

భర్తను నిద్ర లేపడానికి వచ్చిన వైదేహి భర్త శరీరం చల్లగా మంచులా తగిలేసరికి ఉలిక్కిపడింది.

ఒక్క క్షణం భావరహితంగా వుండిపోయింది. జరిగిన దారుణం జీర్ణించుకోవడానికి ఆమెకు సమయం చాలానే పట్టింది.

రాత్రి నిద్రపోయేముందు తనను పిలిచి 'వైదేహీ... రేప్పొద్దున్నే నువ్వు కూడా నాతో మార్నింగ్‌వాక్‌కు రారాదూ?' అని అడగడం గుర్తొచ్చింది.

తనకు మార్నింగ్‌వాక్ అంటే అలవాటే లేదు. తనతో రోజూ మార్నింగ్‌వాక్‌కు తీసుకువెళ్ళాలని ప్రయత్నించిన భర్త... ఆ కోరిక తీర్చుకోకుండానే నిద్రలోనే తుదిశ్వాస విడిచాడు.

రాత్రి తను తెచ్చిచ్చిన పాలగ్లాసు అలానే వుంది. పాలు అలానే వున్నాయి.

గుండెలమీద భగవద్గీత వుంది. మనిషి ప్రశాంతంగా నిద్రపోతున్నట్లు వున్నాడు.

ఆనందరావు పెద్దకొడుకు రాజారాం వెంటనే తండ్రి మరణించిన విషయాన్ని జీర్ణించుకోలేకపోయాడు. అతని భార్య నీలవేణి మామగారి కాళ్ళదగ్గర చేరి ఏడవడం మొదలుపెట్టింది.

"నన్ను కూతురిలా చూసుకొని ఎప్పుడూ వేణీ... అంటూ ప్రేమగా పిలిచే నువ్వు మమ్మల్ని వదిలి వెళ్ళావా?" అంటూ శోకాలు మొదలుపెట్టింది.

గుండెలోతుల్లోనుంచి ఏడవడం ఆమెకు చేతకాదు. మామగారి మరణాన్ని కూడా తన అవసరానికి వాడుకోవాలనే తాపత్రయం.

పదిమంది దృష్టిలో మామగారిని కన్నకూతురిలా చూసుకుంది అని అనుకోవాలన్న తాపత్రయం.

రాజారాం తండ్రి మరణవార్తని తమ్ముళ్ళకు చేరవేశాడు. ఆనందరావుకు నలుగురు కొడుకులు. అందరూ సిటీలోనే తలో మూలా వుంటున్నారు.

★ ★ ★

ఆ ఇల్లంతా ఏడుపులతో మార్మోగిపోతోంది. నలుగురు కొడుకులూ, కోడళ్ళూ, మనవలూ, మనవరాళ్ళూ వచ్చారు. అందరూ ఆనందరావు శవం మీదపడి భోరున ఏడుస్తున్నారు. వైదేహికి దుఃఖం తన్నుకొచ్చేస్తోంది. భర్త గుండెలమీద పడి తనివితీరా ఏడవాలని అనిపిస్తోంది.

ఆ అవకాశం ఆమెకు దొరకడంలేదు. అందరూ వైదేహిని ఓ మూలకు నెట్టేశారు. కోడళ్ళు మామగారి శవాన్ని ఆక్రమించుకున్నారు.

రెండో కొడుకు భార్గవరావు, మూడోకొడుకు మూర్తి, నాలుగో కొడుకు సుభాష్... అందరూ తండ్రి శవంమీద పడి వంతులవారీగా తమ విషాదాన్ని వెళ్ళబోస్తూనే వున్నారు.

వైదేహి ఏడుస్తూనే వుంది.

★ ★ ★

"ఇంకా ఎంతసేపు నట్టింట్లో శవాన్ని పెట్టుకుని వుంటారు. దహన సంస్కారాలు కానీయండి"ఎవరో పెద్దాయన ఉచిత సలహా ఇచ్చాడు.

వైదేహి మనసు కలుక్కుమంది.

శరీరంనుంచి ప్రాణం వేరైపోవడంతోనే మనిషి విలువ పడిపోతుందా? నిన్నటివరకూ తనను అంటిపెట్టుకుని వున్న భర్త

ఇప్పుడు భౌతికంగా తనకు దూరమ య్యాడు.

ఈ నిజాన్ని తనెలా జీర్ణించుకోగలదు.

"ఇంకా ఎవరైనా రావాలా? " ఎవరో అడి గారు.

"పెద్ద మనవరాలు రావాలి" ఎవరో చెప్పారు.

"మా అమ్మాయి అమిత ఢిల్లీనుంచి రావాలి" చెప్పాడు రాజారాం.

"అమ్మాయి ఎప్పుడొస్తుందో ఏమో... శవాన్ని ఎక్కువసేపు ఇంట్లో వుంచడం మంచిదికాదు" మరెవరో సలహా ఇచ్చారు.

దహన సంస్కారాలకు ఏర్పాట్లు చకచకా జరిగిపోతూనే వున్నాయి. నిస్తేజంగా, జీవ చ్ఛవంలా ఓ మూలన మోకాళ్ళమధ్య తల పెట్టుకుని ఏడుస్తూనే వుంది వైదేహి.

★ ★ ★

ఇంట్లో శ్మశాన నిశ్శబ్దం.

ఉలుకూపలుకూలేదు. మాటల్లేవు. ఎవరి కివారే మౌనంగా వుండిపోయారు.

భారంగా పదిరోజులు గడిచిపోయాయి. దశదిన కర్మ జరిగింది. అన్ని శ్రాద్ధకా ర్యాలూ ముగిశాయి. ఆనందరావు అనే వ్యక్తి లేని లోటు మాత్రం ఆ ఇంట్లో మిగిలిపో యింది.

వైదేహి దాదాపుగా మూగదానిలా వుండి పోయింది. ఎన్ని జ్ఞాపకాలు... ఎన్ని స్మృతులు. అన్నీ ఆమె కళ్ళముందు సాక్షా త్కరిస్తూనే వున్నాయి. కళ్ళు మూసినా నిద్ర రాదు. జ్ఞాపకానికి ఎప్పుడూ చావు వుండదు. కొన్ని జ్ఞాపకాలు మనిషికి ఊపిరి పోస్తే మరికొన్ని జ్ఞాపకాలు ఆ ఊపిరి ఆగి పోతే బావుండు అనేలా చేస్తాయి.

భర్త తాలూకు జ్ఞాపకాలు ఆమెకు ఆ విధంగానే వున్నాయి. తనూ భర్తతోపాటే చనిపోయినా బావుండేది.

కొన్ని దశాబ్దాల సాహచర్యం.

కొన్ని సంవత్సరాల సంసారం.

నలభయ్యేళ్ళ కిందటే ఈ ప్రపంచాన్ని ఎదిరించి తామిద్దరమూ సాగించిన వైవా హిక జీవితం...

ఎన్ని మలుపులు. మరెన్ని పోరా టాలూ...!

ఈ ప్రపంచంలో మరణంకన్నా విషాదక రమైనది ఇంకోటి వుండదేమో!

★ ★ ★

నలుగురు కొడుకులూ ఆ గదిలో సమావే శమయ్యారు.

"ఇప్పుడేం చేద్దాం అన్నయ్యా? " సుభాష్ రాజారాంని అడిగాడు.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. అమ్మ నా దగ్గరే వుంటుందిలే" సాలోచనగా అన్నాడు రాజారాం.

వెంటనే భార్గవరావు భార్య భర్తని పక్కకు పిలిచి చెవిలో ఏదో గొణిగింది.

భార్గవరావు అలాగే అన్నట్లు తలూపి,

"మరి నాన్న బ్యాంకులో వేసిన యఫ్.డి. మీద వచ్చే ఇంట్రస్ట్ సంగతి...? "

"అమ్మ నా దగ్గరే వుంటుంది కదా? " అన్నాడు లౌక్యంగా రాజారాం.

"కొడుగ్గా అమ్మను చూసుకోవడం మన బాధ్యతకదా? " మూర్తి చెప్పాడు.

"అందుకే అమ్మను నేను చూసుకుందా మని అనుకుంటున్నాను"

"ఆ బ్యాంకు ఇంట్రస్ట్ ఎవరికెళ్తుంది? "

"అమ్మను నేనే చూసుకుంటున్నాను కదా? "

"ఇందాకేకదా అది మన బాధ్యత అన్నావు" భార్గవరావు అడిగాడు.

"ఆ బాధ్యతకు ఖర్చు వుంటుందికదా" రాజారాం అన్నాడు.

"అలా కాదుకానీ..." అంటూ ఒక్క క్షణం సుభాష్ ఆలోచనలో పడ్డాడు.

ఎవరికీ ఎటూ పాలుపోవడంలేదు.

ఆరోజుకు ఆ సమావేశాన్ని వాయిదా వేశారు. ఎవరిగదిలో వాళ్ళు వాళ్ళవాళ్ళ భార్యలతో ఈ విషయమై తర్జనభర్జనలు పడుతూనేవున్నారు.

ఈ తతంగమంతా వైదేహి గమనిస్తూనే వుంది. అయినా ఆమె నోరు మెదపడం లేదు. అన్నం కూడా ఆమె గదికే తీసుకువస్తున్నారు. ఒక్క ముద్ద ఎంగిలిచేసి వదిలేస్తుంది.

అదేమిటని ఎవరూ అడగడంలేదు. ఎవరి బాధల్లో వాళ్ళున్నారు.

ఆ ఇంట్లో వున్నవాళ్ళలో ఒక్క వైదేహికి మాత్రమే భర్త గురించి బాధ... మిగతా అందరికీ ఆస్తి గురించి బాధ పట్టుకుంది.

★ ★ ★

"వైదేహీ...! ఏంట్రా ఆలోచిస్తున్నావు? నీ బిడ్డల గురించా? నేను చెప్పానుకదరా? వాళ్ళు నా స్థిర, చరాస్తులనే తప్ప నా వెల లేని ఆస్తి అయిన నిన్ను గురించి పట్టించుకోరురా..."

భర్త తన గుండెల్లోనుంచి మాట్లాడుతున్నట్లు అనిపించి అపురూపంగా తన గుండె మీద చేయేసుకుంది.

ప్రేమ కొందరికి ఆకర్షణ వల్లో, డబ్బు వల్లో, అవసరం వల్లో ఏర్పడుతుంది. కానీ తన భర్తకి తనమీద వున్న ప్రేమమాత్రం ప్రేమవల్లే ఏర్పడింది.

"ఏరా" అన్న ఒకే ఒక పిలుపే తన గుండెలోతులను స్పృశించగలదు.

"ఏరా?" అన్న ఆ ఒకే ఒక్క పదమే తనను చితిపైనుంచి సైతం నిద్రలేపగలదు.

ఎదురుగా టేబుల్ మీద భర్త ఫొటోవంక చూసింది. అది దుమ్ము పట్టి వుంది.

కర్మ చేయడం అయిపోగానే చేతులు దులిపేసుకున్నారు పిల్లలు.

కళ్ళొత్తుకుంటూ లేచి టేబుల్ మీద వున్న ఫొటోని చేతిలోకి తీసుకుంది. తన చీరకొంగుతో ఆ ఫొటోని అపురూపంగా, అతి పదిలంగా తుడిచింది.

'నేనంటే నీకెందుకురా ఇంత ప్రేమ?' భర్త అడుగుతున్నట్లు అనిపించింది.

"ఎందుకని అడిగితే ఏమని చెప్పనండీ... నాలుగున్నర దశాబ్దాలు నాతో కలిసి వున్నారుకదండీ... నా మనసులో, నా శరీరంలో ఎక్కడ చూసినా మీరేకదండీ. అయినా మీకు మనసెలా ఒప్పిందండీ నన్ను వదిలి వెళ్ళడానికి...?

"కనీసం ఒక్కమాట... ఒకే ఒక్క మాట చెప్పివుంటే...

"ఏరా నేను వెళ్తున్నాను. మరి నాకిక సెలవా...? అని ఒక్కమాట అని వుంటే నేనూ మీతోపాటు వచ్చేదాన్ని కదండీ"

కనిపించని భర్తతో భర్త ఎదురుగానే వున్నాడన్న భ్రమతో మాట్లాడేస్తోంది వైదేహి.

అది భ్రమ అని తెలుసు. అయినా ఆ భ్రమలో ఆనందాన్ని వెతుక్కుంటూ వుంది.

★ ★ ★

నలుగురు సుపుత్రులు రెండ్రోజులపాటు తలలు బద్దలు కొట్టుకొని ఓ నిర్ణయానికి వచ్చారు.

రాజారాం వుంటున్న ఇల్లు తండ్రిది... అంటే ఆ ఇంటిమీద నలుగురు కొడుకులకు హక్కు వుంది. ఆ ఇంటిని అద్దెకు ఇస్తే హీనపక్షం నాలుగువేలు అయినా వస్తాయి. బ్యాంకులో వైదేహి పేరుతో వున్న ఎఫ్.డి. నుంచి రెండువేలు వడ్డీ వస్తుంది.

మొత్తం ఆరువేలు. తల్లికి ఎంతలేదన్నా రెండువేలకుమించి అవ్వదు. సో... ఆరు వేలు నలుగురు పంచుకుంటే పదిహేను వందల చొప్పున వస్తుంది.

తల్లిని ఒక్కొక్కరూ మూడునెలల చొప్పున వుంచుకోవాలి. తల్లికయ్యే రెండువేలను నలుగురూ షేర్ చేసుకోవాలి.

చిన్నప్పుడు తల్లి ప్రేమను పంచుకున్న ఆ సుపుత్రులు ఇప్పుడు తల్లి బాధ్యతను పంచుకుంటూ దానికి ఖరీదు నిర్ణయించారు.

కానీ అప్పటికే వైదేహి ఓ నిర్ణయానికి వచ్చిందని తెలియదు ఆ నలుగురికీ.

★ ★ ★

ఆరోజు రాత్రి రాజారాం భార్య భర్తతో తీవ్రంగా మాట్లాడుతోంది.

“మీరు చేసిన పని ఏం బాగాలేదు. ఇన్ని రోజులూ మీ అమ్మానాన్నా మన దగ్గరే వున్నారు.

అలాంటప్పుడు ఈ ఇల్లు మనది అవుతుంది గానీ, అందరికీ పంచడం ఎందుకు? గంగిరెద్దులా అన్నింటికీ తలూపడమేనా? ”

రాజారాం భార్యవైపు తాపీగా చూసి “పిచ్చిదానా అలా అంటే మొదటికే ఎసరొస్తుంది. అయినా మొదటి మూడు నెలలు అమ్మ మన దగ్గరే వుంటుంది కదా. ఇల్లు అమ్మ పేరుతో వుంది. ఇది నాన్న స్వార్జితం. తాతలు సంపాదించింది కాదు. దీని మీద మనకు ఎటువంటి అధికారమూ లేదు. ఏదోలా అమ్మను ఒప్పించి మన ఈ ఇంటిని మన పేరు మీద రాయించుకోవాలి. అదీ ఎవరికీ అనుమానం రాకుండా” రాజారాం చెప్పాడు మెల్లగా భార్యకు మాత్రమే వినిపించేలా.

“ఓహో.. అదా మీ ఆలోచన” అంది మొగుడి వైపు మురిపెంగా చూస్తూ.

“అవును గానీ అమితకు తాతయ్య అంటే చాలా ప్రేమ కదా! ఎందుకు రాలేదంటారు” అడిగింది అనుమానంగా నీలవేణి.

“తనకసలు ఆ విషయం తెలిస్తేకదా”

“అంటే”

“నాన్న చనిపోయిన విషయం అమితకు తెలియదు. దానికి నాన్న అన్నా అమ్మ అన్నా మొదట్నుంచి బోల్డు ప్రేమ. ఇప్పుడు మనం ఈ విషయం తెలియచేస్తే అన్ని పనులు వదిలేసి ఇక్కడికి వస్తుంది.

నాన్నమ్మకు తోడు వుంటానంటుంది. మనం చేయబోయే పనులకు అడ్డు తగులుతూ వుంటుంది. బామ్మ మీద ఈగ కూడా వాలనీయదు.

అందుకే ఈ విషయం అమితకు తెలియజేయలేదు. జాగ్రత్త అమ్మ పేరు మీద వచ్చే వుత్తరాలు కూడా అమ్మకు ఇవ్వకు. ఏదో ఒకటి మేనేజ్ చేయి”

“మీకెన్ని ఐడియాలు వస్తాయండీ! బిజినెస్‌లో కూడా ఇన్ని ఐడియాలు వచ్చి వుంటే మనకు బోల్డు లాభాలు వచ్చేవి” అంది నీలవేణి.

“నువ్విప్పుడు నన్ను పొగుడుతున్నట్టు లేదు. నాకు బిజినెస్ చేయడం చేతకాదని దెప్పుతున్నట్టు వుంది” అన్నాడు రాజారాం.

నీలవేణి మరింకేమీ మాట్లాడలేదు. మంచం మీది నుంచి లేచి వెళ్లి ట్యూబులైట్ ఆఫ్ చేసి బెడ్‌లైటు స్విచ్ వేసింది.



ఎవరి కోసమూ ఆగకపోవడమే కాలం నైజం. రోజులు... నెలలు గడిచిపోయాయి.

నీలవేణి వైదేహిని చాలా ప్రేమగా చూస్తోంది. దగ్గరుండి అన్ని పరిచర్యలు చేస్తోంది. రాజారాం కూడా ఎన్నడూ చూపనంత ప్రేమను తల్లిమీద ప్రదర్శిస్తున్నాడు.

రోజూ సాయంత్రం వచ్చేప్పుడు పళ్లు తెస్తున్నాడు తల్లికిష్టమైనవి తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ ప్రయత్నం వెనుక స్వార్థం వుందనేది వేరే విషయం.

వైదేహి ఇదంతా గమనిస్తూనే వుంది. భర్త బతికివున్న రోజుల్లో కూడా ఇంత

ప్రేమ చూపించి ఎరగరు. అలాంటిది...

వైదేహి భర్త జ్ఞాపకాల నుంచి బయటప డలేకపోతోంది. అనుక్షణం భర్త పటం దగ్గరే కూచోని గతం తాలూకు అనుభూతు లను గుర్తు చేసుకుంటూ వుంది.

ఆమెకు ఒకే ఒక బాధ అమిత.. తనకిష్ట మైన మనవరాలు, తనన్నా తన భర్త అన్నా అమితకు అమితమైన ఇష్టం... అలాంటి అమిత తాతయ్య చనిపోయినా రాలేదు. ఈమధ్య అమితనుంచి వుత్తరాలు కూడా రావడంలేదు.

తనే అమితకు వుత్తరం రాయాలి. ఆ నిర్ణయం ఆమెకు కొండంత సంతోషాన్ని చ్చింది. అయితే తన కొడుకు రాజారావే అమిత నుంచి వుత్తరాలు తనకు అంద కుండా చేస్తున్నాడని తెలియదు వైదేహికి.

రాజారాం కొన్నాళ్ల క్రితం పోస్టాఫీసుకు వెళ్లి తమకు ఉత్తరాలు బట్వాడ చేసే పోస్ట్ మేన్‌తో తనే పోస్టాఫీసుకు వచ్చి వుత్తరాలు కలెక్ట్ చేసుకుంటానని చెప్పాడు.

ఆవిధంగా రోజూ వుదయమే పోస్టాఫీ సుకు వెళ్లి తనకు వచ్చిన పోస్ట్ తీసుకుంటు న్నాడు.

అమిత వారానికి రెండు మూడు ఉత్త రాలు రాస్తుంది. అమిత రాసే ప్రతి వుత్త రంలోను తాతయ్య ప్రస్తావన, బామ్మ ప్రస్తా వన వుంటుంది. వాళ్ల నుంచి ఏ ఉత్తరమూ లేదన్న నిష్ఠూరవాక్యమూ వుంటుంది.

రాజారాం మాత్రం అమితకు ఉత్తరాలు రాస్తూనే వున్నాడు.

★ ★ ★

ఆరుబయట కూచొని బియ్యంలో రాళ్లు ఏరుతోంది వైదేహి. కళ్లు కాస్త మసగ్గా అని పిస్తున్నాయి. ఎన్నోసార్లు భర్త ఈ విష యంపై తనని మందలించడం గుర్తొచ్చింది.

"వైదేహి... నువ్వు కళ్లజోడు పెట్టుకుం టావా? లేదా? " అని అడిగేవాడు.

"ఇప్పుడు నా కళ్లకు ఏమైందండీ... బ్రహ్మాండంగా కనిపిస్తున్నాయ"ని అంటే చేతి వేళ్లు చూపించి ఇవి ఎన్నో చెప్పు అని అడిగేవాడు.

ఎప్పటికప్పుడు తను కళ్లజోడు ప్రస్తావన దాటవేస్తూ వచ్చింది. ఓ రోజు చెప్పాపెట్ట కుండా తనని డాక్టర్ దగ్గరకి తీసుకువెళ్లాడు.

సత్యమూర్తి అన్నయ్య దగ్గరికి వెళ్దామని చెప్పి హాస్పిటల్‌కు తీసుకువెళ్లాడు.

డాక్టర్ తనను అన్ని పరీక్షలు చేసి బోర్డుమీద వున్న అక్షరాలను చదవమని చెప్పి చివరికి ఏదో మందులు రాసిచ్చి కళ్ల జోడు వాడమని చెప్పారు. ఆ రోజు తనకు బాగా గుర్తు.

తనకు కళ్లజోడు ఇప్పించి హోటలుకు తీసుకువెళ్లాడు.

"హోటల్‌కు ఎందుకండీ? " అని తను మొహమాట పడింది. ఇంటి దగ్గర కోడలు తమ కోసం వంటచేసి వుంటుంది.

"ఎంత పిచ్చిదానివిరా నువ్వు. మనకోసం కోడలు వేడివేడిగా వండి వార్చి సిద్ధంగా వుంటుందని భ్రమ పడుతున్నావా? హమ్మయ్య ఈ పూటకు ఈ ముసలివాళ్లకు వంట చేయడం తప్పిందని సంతోషపడు తుందిగానీ"

"అదేమిటండీ... మీకు తెలియదు. మన కోడలు అలాంటిదికాదు" తను వాదనకు దిగింది.

"నీ కోడలు ఎలాంటిదో నీకు ఇప్పుడే తెలి యదురా"

"మీరు అన్నింటికీ అంతే ఎడ్డెమంటే తెడ్డె మనే రకం" అంది తను కోపంగా.

"అదేమిటోనోయ్... నువ్వు ఈ వయ సులో కూడా అలిగినా అందంగానే వున్నావు" తనని మరింత ఆటపట్టించేవాడు.

"వయసు మీదపడుతున్నా ఈ మాటలే మిటి? " తను ముద్దుగా విసుక్కుంటే..

"వయసుకు మనసుకు సంబంధం లేదోయ్. వయసు రీత్యా ముసలివాడినేమో కానీ మనసు రీత్యా నేను ఇంకా ముప్ఫయి లోనే వున్నాను"

"చాల్లెండి... ఎవరైనా వింటే నవ్విపోతారు" తను సిగ్గుపడుతూ అంది.

"నవ్వుకోనీరా. నవ్విన వాళ్లకోసం నవ్వే వాళ్ల కోసం మనం ఎందుకు ఆలోచించాలి. ఒక్కటి గుర్తుంచుకోరా. ఈ ప్రపంచంలో నవ్వేవాళ్లు నవ్వించేవాళ్లు, నవ్వులపాలు చేసే వాళ్లు, నవ్వితే చూసి భరించలేని వాళ్లు అంటూ రకరకాలుగా వుంటారు. మొదటి రెండు రకాల మనుషులతో ప్రమాదం లేదు.

ఎప్పుడూ నవ్వేవాళ్లు తమ ఆయుష్షు పెంచుకుంటారు. ఎప్పుడూ ఇతరులను నవ్వించే వాళ్లు తమ ఆయుష్షును పెంచుకుంటూ ఇతరుల ఆయుష్షుని పెంచుతారు. నవ్వులపాలు చేసేవాళ్లు, నవ్వితే చూసి భరించలేనివాళ్లు జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఏడ్వక తప్పదు. అలాంటి వాళ్లకోసం మనం బతకకూడదు"

ఇప్పుడు ఆ మాటలు తలుచుకుంటుంటే మెల్లమెల్లగా జీవిత సత్యాలు బయటపడుతున్నట్టు అనిపిస్తుంది. ఎంత నిజం. బతికి వున్నప్పుడు తన భర్త గొప్పదనం తనకు తెలియలేదా!

భర్త మాటలు గుర్తొచ్చి భర్త ప్రేమ తన గుండె తలుపు తట్టినా తన ప్రమేయం లేకుండానే కన్నీటి చెమ్మ తన మనసును చెమ్మగిల్లేలా చేస్తుంది. వెంటనే లేచి తన గదిలోకి వెళ్లి ట్రంకు పెట్టెలో వున్న కళ్లజోడు తీసింది.

కళ్లజోడు కింద తన భర్త ఫొటో వుంది. తన వైపే చూస్తోన్నట్టు వుందా ఫొటో

కళ్లజోడు పెట్టుకోబోయి ఆగింది.

"వైదేహీ నేనుండగా నీకు ఈ కళ్లజోడు అవసరం రాకూడదు. నాకళ్లే నీకు చూపు అనుకో"

"అలాంటప్పుడు ఈ కళ్లజోడు ఎందుకు కొన్నారండీ? " అయోమయంగా అడిగింది తను.

"నేను పోయాక నీకు పనికి వస్తుంది"

"శుక్రవారం పూట అవేం మాటలండీ? "

నవ్వాడు భర్త "ఏ రోజైనా ఏ పూట అయినా నిజం ఒక్కటే కదరా! నేను వున్నంత కాలమూ నీకు ఎవరి ఆసరా అక్కర్లేదు. నేను పోతే నీకు ఈ కళ్లజోడు చూపునిస్తుంది"

అప్రయత్నంగా వైదేహి కళ్లు వర్షించాయి.

"మీరు నా మనసులో ఇంకా బతికే వున్నారు. బతికే వుంటారు" అంటూ ఆ కళ్లజోడుని ట్రంకు పెట్టెలోనే పెట్టింది.

★ ★ ★

వైదేహి బియ్యం ఏరుతోంటే దూరం నుంచే చూసిన రాజారాం పరుగెత్తుకొచ్చి తల్లి చేతిలోని బియ్యం ప్లేటు లాక్కున్నాడు.

"ఎంతపని చేశావమ్మా" అన్నాడు.

"నేనేం చేశాను బాబూ? "

"నువ్వు... నువ్వు బియ్యంలో రాళ్లు ఏరడమేమిటమ్మా? ఈ వయసులో హాయిగా విశ్రాంతి తీసుకోక"

"బియ్యంలో రాళ్లు ఏరితే తప్పేమిటి? ఇదేమైనా పెద్ద కష్టమైన పనా"

"అయినా సరే నువ్వు ఏ పనీ చేయొద్దు. అయినా ఇదేం చేస్తోంది? దానికసలు బుద్ధి లేదు" అంటూ వంటింటి వైపు తిరిగి.

"నీలవేణి.. వేణి" అంటూ పెద్ద కేక వేశాడు.

వెంటనే నీలవేణి పరుగెత్తుకు వచ్చింది.

"ఏమిటండీ ఏమైంది అంత చేటున కేక వేశారు"

"ఏమైందా? నీకసలు కళ్లు కనిపిస్తున్నాయా? అమ్మ చూడు ఎంత పని చేసిందో? "

"అత్తయ్యా... అత్తయ్య ఏం చేసిందండీ"

"బియ్యంలో రాళ్లేరుతోంది"

అదేదో వినకూడని విషయం అయినట్టు మహా అపచారం అయినట్టు... దానికి తనెంతో బాధపడుతున్నట్టు మొహం పెట్టి.

"అత్తయ్యా మీరు... మీరు బియ్యంలో రాళ్లు ఏరుతున్నారా? " బాధగా అడిగింది.

## సచిత్ర విచిత్రం

# పరుగులు తీసే నీ వయసునకూ...



యాభయ్యవ పడిలో పడితే చాలు మనలో చాలామంది వృద్ధాప్యంలో కొచ్చి పడ్డామనుకుంటారు. కానీ అమెరికాకు చెందిన అన్నే క్లార్క్ వయసు 89 అయినా, పాతికేళ్ల వయసులో వున్న చురుకుదనం ఆవిడకు వుంది. ఈ రోజుకీ పొద్దున్నే జాగింగ్ చేస్తుంది. 64వ ఏటలో పరుగుపందెంలో పాల్గొనడం మొదలుపెట్టిన అన్నేక్లార్క్ ఈ పాతికేళ్లలో 500 రేసుల్లో పాల్గొంది. అందులో 40 పందాల్లో జాతీయ రికార్డ్ సాధించింది. ఓ రేసులో 26.2 మైళ్లు ఏకబిగిన పరుగెత్తింది. అదీ 81వ ఏట. 1986లో నాలుగు గంటల 48 నిమిషాల 9 సెకన్ల కాలం ఏకబిగిన పరుగెత్తి సీనియర్ సిటిజన్ కేటగిరిలో కొత్త ప్రపంచ రికార్డును సాధించిందీ అమ్మమ్మ. ఆమె ఇంట్లో ఓ గోడకి ఆమె గెలుచుకున్న ఎన్నో ట్రోఫీలు అమర్చబడి వుంటాయి. రోజూ ఆమె 13 మైళ్లు పరుగెత్తుతూ రన్నింగ్‌ని అభ్యాసం చేస్తూ వుంటుంది. పరుగెత్తడం, బాగా నడవడం నా హాబీ అనే అన్నే క్లార్క్‌కి ఎలాంటి జబ్బులూ లేవు.



"బియ్యంలో రాళ్లేరితే ఇంత ఆశ్చర్యం ఎందుకు? ఇదేమైనా కొత్తగా చేస్తున్నానా?"

"ఎంత మాటన్నారు అత్తయ్యా నేను బతికి వుండగా మీరేపనీ చేయడానికి వీల్లేదు. అసలే మామయ్య పోయారన్న బాధలో వున్నారు. అయినా నేను వున్నాను కదా" అంది వైదేహి చేతిలోని బియ్యం ప్లేటు తీసుకొని.

"అసలు నీకు బుద్ధి వుందా? అమ్మను జాగ్రత్తగా చూసుకోమని చెప్పానా లేదా?" భార్య మీద కేకలేశాడు రాజారాం.

"నన్ను క్షమించండి. అత్తయ్య కాలుకింద పెట్టకుండా చూసుకుంటాను" అంటూ వైదేహి వైపు తిరిగి "అత్తయ్యా... మీరిలా వచ్చి కూచోండి.. మీకిష్టమైన వేడివేడి ఫిల్టర్ కాఫీ తీసుకు వస్తాను. ఈలోగా మీరు మీ అబ్బాయితో మాట్లాడుతూ వుండండి" అంటూ లోపలికి వెళ్లిపోయింది.

"నువ్వంటే వేణికి భయం, ప్రేమ, భక్తీ అన్నీ వున్నాయమ్మా. రాత్రి కూడా నీ గురించే బాధపడింది. అత్తయ్యను కంటికి రెప్పలా చూసుకోవాలండీ. ఎప్పుడూ అత్తయ్యను మన దగ్గర ఉంచేసుకుందామండీ అంది కూడా" చెప్పాడు భార్య గురించి గొప్పగా రాజారాం.

"నాకు తెలియదట్రా తన గురించి" అంది వైదేహి.

ఆమెకు తెలుసు. ఒకప్పుడు ఇదే కోడలు ఖాళీగా కూచోకపోతే బియ్యంలో రాళ్లేరొచ్చు కదా అని దెప్పి పొడిచింది.

అయిదు నిమిషాల్లో పొగలు కక్కే కాఫీ కప్పులు రెండు తెచ్చి ఒకటి మొగుడికి మరొకటి అత్తగారికి ఇచ్చింది.

వాళ్ళిద్దరూ కాఫీ తాగుతుంటే తను నేల మీద కూర్చుంది.

భర్త బతికి వున్నరోజుల్లో కుర్చీలో కూర్చుని కాలు ఊపుతూ తమ ముందే కాఫీ తాగిన కోడలు ఇప్పుడిలా చేయడం చూసి మనసులో నవ్వుకుంది.

★ ★ ★

మరో రోజు బట్టలు ఆరేయబోయింది వైదేహి.

వెంటనే ఎక్కడ్నుంచి చూసిందో నీలవేణి పరుగెత్తుకువచ్చింది.

"మీరు బట్టలు ఆరవేయడం ఏంటి? నేను బతికి వుండగా మీరు పని చేయడమే? నేను చచ్చాక మీరు ఆ పని చేయండి" అంది తన చేతిలోని బట్టలు లాక్కుని.

అదే కోడలు ఒకప్పుడు...

"ఇంట్లో చాకిరీ అంతా నేనే చేయాలి. కనీసం బట్టలు ఉతకడమో, ఆరవేయడమో చేయొచ్చుగా. అడ్డమైనవాళ్ళ బట్టలు కూడా నేనే ఉతకాల్సి వస్తోంది" అని పొద్దుపోయే వరకూ సణగడం తనకు గుర్తే.

"ఏంటత్తయ్యా... ఆలోచిస్తున్నారు. ముందు మీరు వెళ్ళి హాలులో కూర్చోండి. మీకోసం మీకు ఇష్టమైన సున్నుండలు చేశాను"

మరోసారి నవ్వుకుంది వైదేహి.

సున్నుండలు భర్తకు చాలా ఇష్టం. ఎన్నో సార్లు అవి చేయమని తను కోడలిని అడిగింది. అయినా తన మాటలు లక్ష్యపెట్టలేదు. ఓసారి తనే భర్తకోసం చేయబోతే కావాలనే పంచదార దాచి నిండుకుందని చెప్పింది.

★ ★ ★

రాత్రి పడుకునేముందు భర్త గుర్తొచ్చాడు. భర్తే కనుక బతికి వుంటే ఇలాంటి పరిణామాలు చూసి పొంగిపోయేవాడు.

"పిచ్చి వైదేహి... నువ్వు ఇదంతా నిజమేనని నమ్ముతున్నావా? ఇదంతా నీమీద ప్రేమతో కాదురా, కేవలం నీతో అవసరం పడి" అని అనేవాడు.

అప్పుడు తను విసుక్కొని...

"మీరెప్పుడూ అంతే. అన్నింటికీ చెడుగా ఆలోచిస్తారు" అనేది. కానీ తన భర్త ఏది చెప్పినా కరెక్టేనని తనకు ఇప్పుడిప్పుడే తెలు

స్తోంది.

ఓ నిజం తెలిసేసరికి ఓ విషాదం తన కళ్ళముందే జరిగిపోయింది. తన గుండెలో గాయమై అనుక్షణం బాధిస్తూ తనను అంటి పెట్టుకుంది.

వైదేహిని ఏ పనీ చేయనీయడంలేదు. కాలు కిందపెడితే కందిపోతుందేమోనన్న ప్రేమ కురిపిస్తున్నారు. ఇలాంటి ప్రేమను భరించడం వైదేహికి ఇబ్బందిగానే వుంది.

★ ★ ★

ఆ రాత్రి రాజారాం తన పడగ్గదిలో పెళ్ళాం నుదుటిమీద జెండూబామ్ రాస్తూ వున్నాడు.

నీలవేణి తెగ బాధపడిపోతూ మాట్లాడు తోంది.

"అబ్బ... ఇంకా ఎన్నిరోజులు నటించను. నావల్ల కావడంలేదు. అడ్డమైన చాకిరీ నేనే చేయాల్సి వస్తోంది"

"కొన్ని రోజులు ఓపిక పట్టాలి. అమ్మను పూర్తిగా నమ్మించాలంటే ఈమాత్రం కష్టప డక తప్పదు. పైగా మిగతా తమ్ముళ్ళకన్నా మనమే బెటర్ అని అమ్మ అనుకోవద్దూ"

"అలా అని ఇంకెన్ని రోజులు. నాకు చాలా ఇబ్బందిగా వుంది. నా చేతులు పడి పోతున్నాయి" అంది నీలవేణి.

"ఇప్పుడంటే నువ్వు చేస్తున్నావుగానీ ఇంత క్రితం అన్ని పనులూ అమ్మేచేసేదిగా ఒంటి చేత్తో" రాజారాం గుర్తుచేశాడు.

"ఏంటీ దెప్పుతున్నారా? " కోపంగా భర్త వంక చూసి అడిగింది.

"అబ్బ నీకన్నీ అనుమానాలే. అయినా రోజూ నువ్వు తెగ కష్టపడిపోతున్నావనేకదా నీకు రాత్రుళ్ళు నేను సేవలు చేస్తున్నాను. తల పడుతున్నాను. నడుం, కాళ్ళు టోట ల్‌గా నీకు నేను సేవలు చేస్తున్నానుకదా" అలా ఆ టాపిక్ అప్పుడప్పుడు వాళ్ళమధ్య పునరావృతం అవుతూనే వుంది.

★ ★ ★



రాత్రి భోజనాలు పూర్తయ్యాయి.

వైదేహి ఆరుబయట మంచంమీద కూర్చుని వుంది.

రాజారాం, నీలవేణి అక్కడికి వచ్చారు.

"ఏంటి బాబూ? " వైదేహి అడిగింది.

రాజారాం బుద్ధిగా రాముడు మంచిబా లుడు అన్నట్టు తల్లి కాళ్ళదగ్గర కూర్చు న్నాడు. మరోవైపు నీలవేణి కూర్చుంది.

"ఛ...ఛ... అదేంటి కింద కూర్చున్నారు. రండి" అంటూ తన పక్కనే కూర్చోమని చెప్పింది.

"వద్దమ్మా... నాకు నీ కాళ్ళదగ్గరే హాయిగా వుంది. ఎప్పుడూ నువ్వు మా దగ్గరే వుండాలమ్మా. నాన్నగారు మాకు ఎలాగూ దూరమయ్యారు. నిన్ను కూడా దూరం చేసుకోలేమమ్మా"

నవ్వుకుంది వైదేహి.

మేకను బలి ఇచ్చేముందు కసాయి ఇలానే ప్రవర్తిస్తాడు కాబోలు. ఆమె పెద వుల మీద శుష్క మందహాసం.

"అమ్మా... నువ్వెప్పుడూ మా దగ్గరే వుండాలి. తమ్ముళ్ళ దగ్గరకి వెళ్ళద్దు" రాజారాం డ్రమెటిగ్గా అన్నాడు.

"అదేమిట్రా... వాళ్ళకు నన్ను చూడాలని, వాళ్ళతోపాటు నేనూ వుండాలని అనిపిస్తుం దికదా"

"నిన్ను వదిలి నేను, మీ కోడలూ వుండ లేకపోతున్నామమ్మా"

"అవునత్తయ్యా... నాకు మా అమ్మే గుర్తొస్తోంది. తండ్రిలాంటి మామగారు దూరమయ్యారు. అందుకే మీలో మా అమ్మను, దూరమైన మామగారిని, నాకు దూరంగా వున్న కూతుర్ని, అందర్నీ కలిపి చూసుకోవాలనుకుంటున్నాను" అంది నీల వేణి.

గత రెండు రోజులుగా అత్తయ్యతో ఎలా మాట్లాడాలో పథకం సిద్ధం చేసుకుంది. డైలాగులు బట్టీ పట్టింది.

వైదేహి మరింకేమీ మాట్లాడలేదు.

తనమీద ప్రేమకన్నా తన పేరుమీద వున్న

ఆస్తిమీద ప్రేమతో తనమీద ఇంత ప్రేమ ఒలకపోస్తున్నవాళ్ళకి తన నిర్ణయం తెలిస్తే...?

★ ★ ★

రాజేశ్వరీ ఏడుస్తున్నావా?

పెరట్లో చెట్టుకింద కూర్చుని మోకాళ్ళ మీద తల పెట్టి ఏడుస్తోన్న యాభై అయిదేళ్ళ రాజేశ్వరి భర్త మాటలతో ఉలికిపాటును కప్పి పుచ్చుకుంటూ కళ్ళు తుడుచుకుని తలెత్తి, 'లేదు' అన్నట్టు తలూపింది.

"కన్నీళ్ళను తుడిచి మనసులో అదిమి పెట్టి దాచగలవేమోకానీ కళ్ళముందు కనిపించే అవమానాలను అభిమానాలుగా మార్చి చూపించి భ్రమింపచేయలేముగా రాజేశ్వరీ" భార్య పక్కనే కూర్చుని అన్నాడు సత్యమూర్తి.

రెండు క్షణాలు మౌనంగా వుండిపోయింది.

"మాట్లాడవేం రాజేశ్వరీ. గొంతు గాద్గదికమైందా? కన్నీళ్ళు బయటకు రానంటున్నాయా? మనం పొరపాటు చేశాం రాజేశ్వరీ. సరిదిద్దుకోలేని పొరపాటు. పిల్లలు పున్నామ నరకంనుంచి తప్పిస్తారని అనుకున్నాం. కానీ బతికి వుండగానే నరకాన్ని చూపిస్తారని అనుకోలేదు" సత్యమూర్తి గంభీరంగా అన్నాడు.

భర్తవంక బాధగా చూసింది.

ముప్ఫయ్యేళ్ళకు పైగా పిల్లలకు పాఠాలు చెప్పి ఎందరికో క్రమశిక్షణ నేర్పి ఆదర్శ ఉపాధ్యాయుడిగా అవార్డులు అందుకున్న వ్యక్తి.

ఈరోజు తనబిడ్డ దగ్గరే చేదుపాఠాలు నేర్చుకోవాల్సి వస్తోంది.

ఈరోజు తన కోడలి దగ్గరే చేదు అనుభవాలు దిగమింగాల్సి వస్తోంది.

"ఏంటి రాజేశ్వరీ... బాధపడుతున్నావా? దిగులేసినా, బుగులేసినా బాధతో గొంతు విషాదాన్ని ఆలపించినా పెదవుల మీదికి చిరునవ్వును ఆహ్వానించి దిగులు, బుగులు, విషాదం అనే శత్రువులను పారదోలమని ఎప్పుడూ మా ఆనందం చెబుతుండేవాడు.

"ఈరోజు వాడు లేకపోవడం వల్ల కలిగిన వెలితి ఏమిటో తెలుస్తోంది. వాడి చావును కూడా చూడలేకపోయాను. వాడు మాస్టారు కాకపోయినా వాడెన్నో పాఠాలు చెప్పాడు. అవి గుణపాఠాలుగా ఇప్పుడు అనుభవైకవేద్యమయ్యాయి. ఆరోజు ఆ పాఠాలు విని వుంటే, ఆరోజు వాడి మాటలు విని వుంటే ఈరోజు ఈ చేదు అనుభవాలను దిగమింగాల్సి వచ్చేదికాదు. నాతో జీవితాన్ని పంచుకున్నందుకు నీకూ కొన్ని చేదు పాఠాలను నేర్పుతున్నానుకదూ"

భర్త నోటికి తన చేతిని అడ్డుపెట్టింది. ఆ చేతిని తీసి తన పెదవులకు ఆన్చుకున్నాడు సత్యమూర్తి.

★ ★ ★

ఉత్తమ ఉపాధ్యాయుడిగా పేరు తెచ్చుకున్న సత్యమూర్తి ఈమధ్యే రిటైరయ్యాడు.

సత్యమూర్తి, ఆనందరావు మంచిస్నేహితులు. ఎందరో పిల్లలకు విద్యాదానం చేసిన వ్యక్తి సత్యమూర్తి. అతనికి ఇద్దరూ కొడుకులే.

రిటైరయ్యాక వచ్చిన పి.ఎఫ్., గ్రాట్యుటీ, ఇన్సూరెన్స్ డబ్బులు మొత్తం ఇద్దరి పిల్లలకూ పంచేశాడు. రెండు ఇళ్ళు కట్టించి చెరోటీ ఇచ్చాడు.

తమ శేషజీవితాన్ని పిల్లల దగ్గర గడపచ్చనే భ్రమలో వున్నారు. ఆనందరావు సత్యమూర్తితో తరచూ చెబుతుండేవాడు,

"ఒరే సత్యమూర్తీ... ఈ పిల్లలు మనకు అడ్డాలనాడే కానీ గెడ్డాలనాడుకాదు. ఈ ప్రపంచంలో మనకు మనమే తోడు. నీ చివరి క్షణంవరకూ నిన్ను కాపాడేది నీ మంచితనమొక్కటేకాదు. ఆ మాటకొస్తే ఆ మంచితనమే నీకు శత్రువు కూడా అవ్వొచ్చు.

నీ డబ్బే నిన్ను కంటికి రెప్పలా కాపాడుతుంది. నువ్వు, రాజేశ్వరి చెల్లాయీ సుఖంగా వుండాలంటే నీ డబ్బు నీ దగ్గరే వుండనీయి"

కానీ ఆ మాటలను పెద్దగా పట్టించుకో లేదు సత్యమూర్తి. తన రక్తం నేర్పిన సంస్కారం, మానవతా విలువలూ ఇవ్వన్నీ తన బిడ్డలను అంటిపెట్టుకుంటాయనే నమ్మకంతో తన డబ్బును బిడ్డలకు పంచాడు. కొన్నాళ్ళ తర్వాత బిడ్డల మన స్తత్వం, కోడళ్ళ విశ్వరూపం బయటపడింది.

పెన్షన్ వచ్చేరోజు చూపించే ప్రేమ మిగతా ముప్ఫయి రోజులూ కరువవుతుంది. ఏదో తమకోసం కష్టపడుతున్నట్టు ఫీలవ్వడం, చికాకుపడ్డం మొదలైంది.

మొదట్లో మామగారు లేనిసమయంలో అత్తయ్యను సూటిపోటి మాటలనడం మొదలెట్టింది పెద్దకోడలు. ఆ తర్వాత మామగారి ముందు కూడా మాట్లాడ్డం అలవాటయింది.

అన్నదమ్ముల మధ్య ఒప్పందాలు, తల్లిదండ్రుల పంపకాలు మొదలయ్యాయి, ఆరేసి నెలల చొప్పున తల్లిదండ్రులను భరించాలని.

అది విని ఆ తండ్రి గుండె పగిలింది.

ఆ తల్లి మనసు విరిగింది.

ప్రపంచంలో వృద్ధాప్యం కన్నా భయంకరమైనది మరోటి లేదనిపించింది.

★ ★ ★

వైదేహి గేటు తీసుకొని లోపలికి అడుగు పెట్టింది.

హాలులో రాజేశ్వరి మనవడిని ఆడిస్తోంది.

సత్యమూర్తి పేపరు చదువుకుంటున్నాడు. వైదేహిని చూసి రాజేశ్వరి మొహం సంతోషంతో విప్పారింది.

"నువ్వా... వదినా...? " అంటూ సంతోషంతో ఎదురెళ్ళింది.

"రామ్మా... వైదేహి. ఎలా వున్నావు? " అడిగాడు ఆప్యాయంగా సత్యమూర్తి.

"నేను బాగానే వున్నాను అన్నయ్యా! మీరే కాస్త చిక్కిపోయారు" అంది చేతిలోని పళ్ళు వున్న క్యారీబ్యాగ్‌ని రాజేశ్వరికి ఇస్తూ.

"ఇవ్వన్నీ ఎందుకు వదినా. నువ్వు రావడమే మాకు సంతోషం" అంది రాజేశ్వరి.

"కానీ మీకోసం ఇలా పళ్ళు తీసుకురావడమే నాకు సంతోషం" అంది వైదేహి.

సత్యమూర్తి వైదేహి మొహంలోకి పరిశీలనగా చూశాడు. కళ్ళకింద నల్లటి చారికలు. మనిషి చాలా చిక్కిపోయింది. అయినా ఆమెలోని హుందాతనం, ఆత్మస్థయిర్యం, చెక్కుచెదరని గుండెనిబ్బరం ముచ్చటగొలిపేలా వున్నాయి.

"ఏంటన్నయా... అంత పరిశీలనగా చూస్తున్నావు. నేను మీ చెల్లెలు వైదేహినే"

కళ్ళజోడు తీసి సన్నటి కన్నీటిపొరను కర్చీఫ్‌తో అద్దుకున్నాడు.

"ఎక్కడో కలిసిన పరిచయం, ఎక్కడో మొదలైన అనుబంధం, రక్తసంబంధం కాకపోయినా, ఏ బంధుత్వమూ లేకపోయినా ఇన్నేళ్ళయినా సొంత చెల్లెలులా అభిమానిస్తున్నావు"

"అదేమిటన్నయ్యా, అనుబంధాలు, ఆప్యాయతలు బంధువుల మధ్య, రక్తసంబంధాలు వున్నవాళ్ల మధ్యే వుండాలా? " అంది.

"అవుననుకో... అయినా బంధువులు రాబందులై రక్తసంబంధాలు, ఆర్థిక సంబంధాలుగా మారిపోతూ వుంటే, నువ్వు పిలిచే అన్నయ్యా అన్న పిలుపే చాలా గొప్పదమ్మా. కానీ ఆనందం చనిపోయినప్పుడు రాలేకపోయాను"

"దానిక్కారణం నాకు తెలుసన్నయ్యా"

"అయినా ఎందుకో నాకు బాధగానే వుంది. కానీ... వాడి పార్థివదేహాన్ని చూళ్లేక రాలేదమ్మా. ఎప్పుడూ చిర్నవ్వుతో వుండేవాడు. ప్రతి విషయాన్నీ స్పోర్టివ్‌గా తీసుకొని... నాలాంటి మాస్టార్లకే మాస్టారు అయిన వాడు, ఇక లేడు అనే నిజం జీర్ణించుకోలేక పోయానమ్మా"

వాతావరణం బరువుగా మారుతోందని అర్థమైంది వైదేహికి.

"అన్నయ్యా... మీతో ఓ పని పడింది. చేసి పెడతారా? " అడిగింది టాపిక్ ఛేంజ్ చేస్తూ.

"అదేమిటమ్మా... ఏంపనిచేయాలో చెబితే చాలు... చేస్తాను" అన్నాడు.

"సిటీ అవుట్ స్కట్స్‌లో వున్న పాడుబడిన స్థలాన్ని అమ్ముతున్నారట. ఆ విషయం కాస్త కనుక్కుంటారా? దాదాపు రెండు ఎకరాలు వుంటుందట"

"సిటీ అవుట్ స్కట్స్‌లో ఏం చేస్తావమ్మా... ఫ్లాట్స్ కూడా కట్టి బిజినెస్ చేయడానికి పనికిరాదు"

"ముందు కనుక్కోండి అన్నయ్యా... యిదిగోండి ఆ అడ్రస్. భూపతివర్మగారని బహుశా రాజకుటుంబీకులు అనుకుంటా" అంటూ అడ్రస్ కాగితం యిచ్చింది.

"రెండ్రోజుల్లో కనుక్కుంటానమ్మా" చెప్పాడు సత్యమూర్తి.

అప్పుడే సత్యమూర్తి పెద్ద కోడలు అహల్య వచ్చింది.

"మీరా పిన్నిగారూ...ఏంటిలా వచ్చారు" సాగదీస్తూ మాట్లాడింది అహల్య.

"ఓసారి మిమ్మల్ని అందర్నీ చూసిపోదామని వచ్చానమ్మా" అంది వైదేహి.

"అలాగా" అంటూ మరోసారి సాగదీసి లోపలికి వెళ్ళింది.

"కోడలు మాటలేమి పట్టించుకోకమ్మా" అంటూ రాజేశ్వరివైపు తిరిగి... "మీ వదినకు నాకూ కాఫీ ఏమైనా యిచ్చేదుందా? లేదా? " అంటూ అడిగాడు.

"అయ్యో నామతిమరుపుమండ... వుండండి ఇప్పుడే తెస్తా" అంది.

"నేను వెళ్తానొదినా... మరోసారి వచ్చినప్పుడు తాగుతానులే"

"ఒక్క నిమిషం... ఫిల్టర్ కూడా రెడీగా వుంది"

"అవునమ్మా... ఈ వంకతో నేను కూడా తాగొచ్చు లేకపోతే మీ వదిన నాకు కాఫీకి కూడా రేషన్ పెట్టగల్దు" అన్నాడు.

రాజేశ్వరి కాఫీ కలుపుకురావడానికి కిచెన్ లోకి వెళ్ళింది.

"ఏంటోనమ్మా... నాకు వెనుకటి రోజులు గుర్తొస్తున్నాయి. రోజూ సాయంత్రం కాగానే స్కూల్ నుంచి సరాసరి మీ ఇంటికే వచ్చేవాడిని. నువ్వు చేసిన జీడిపప్పు ఉప్మా కోసమే.

నువ్వు చేసిన వేడివేడి ఉప్మా, పొగలు కక్కే ఫిల్టర్ కాఫీ యింకా నాకు గుర్తే... ఆనందం, నేను కబుర్లు చెప్పుకుంటూ వుంటే నువ్వు మాకు అరగంటకోసారి కాఫీ ఇవ్వడం నాకింకా గుర్తే" సత్యమూర్తి గుండె ఒక్కసారిగా బరువెక్కింది.

"ఆ జ్ఞాపకాలే మనకిప్పుడు వ్యాపకాలు అన్నయ్యా. ఆ రోజులు... ఆ గుర్తులు... ఆ అనుభవాలు మళ్ళీ రమ్మన్నా రావు" అంది దీర్ఘంగా నిట్టూరుస్తూ వైదేహి.

'దేవుడా... ఒక్కసారి పాతికేళ్లను వెనక్కి తీసుకెళ్లవూ' అంటూ దేవుణ్ని వేడుకోవాలని అనిపించింది సత్యమూర్తికి.

నిజమే... కొన్ని అనుభూతులు అద్భుతంగా, ఆర్ద్రంగా వుంటాయి.

కాఫీ తాగి ఇంటికి బయల్దేరింది వైదేహి.

★ ★ ★

ఆరోజు రాత్రి రాజారాం, నీలవేణి మాట్లాడుకుంటున్నారు.

"మీ అమ్మ మనం అడిగిన ఏ ప్రశ్నకూ బదులుచెప్పడంలేదు. అవునని కానీ, కాదనీ కానీ చెప్పడం లేదు. పైగా అప్పుడప్పుడు ఎక్కడికో వెళ్ళొస్తోంది"

"చూద్దాం. అయినా నీకు నేనేం చెప్పాను. కొన్నిరోజులపాటు అమ్మను ఏ పనీ చేయనీయొద్దని చెప్పానా? లేదా? రోజూ ఏదో ఓ టిఫిన్ చేసి పెట్టమని చెప్పాను"

"అన్నీ చేస్తూనే వున్నాను. ఆవిడిగారే మనమీద శీతకన్ను వేశారు. డబ్బుల సంగతి తేల్చదే" అంది నీలవేణి.

"చూద్దాం. అమ్మ మనసు మెల్లమెల్లగా కరగకపోతుందా? ఈలోగా భార్గవగానీ,

మూర్తి, సుభాష్‌లు గానీ రాకుండా చూసుకో... ఆ భార్గవగాడు మహాతెలివైన వాడు. భార్యను పంపించి లేని ప్రేమను ఒలకపోస్తాడు" చెప్పాడు హెచ్చరికగా రాజారాం.

"నాకామాత్రం బుర్రా, బుద్ధీ లేవనుకుంటు న్నారా. అయినా నాకెందుకో మీ అమ్మ వాలకం చూస్తుంటే అనుమానంగా వుంది" అంది నీలవేణి.

"నీకన్నీ అనుమానాలే. అద్సరేగానీ అమిత గురించి జాగ్రత్త. ఒకవేళ అది ఫోన్ చేసినా నువ్వే లిఫ్ట్‌చెయ్. తర్వాత ఏదో ఒకటి సర్ది చెప్పొచు. నాన్న చనిపో యిన విషయం తెలిస్తే అమ్మను పరామ ర్శించడానికి అన్ని పనులు వదిలిపెట్టుకొని మరీ వస్తుంది. ఈ సంవత్సరంతో దాని కంప్యూటర్ కోర్స్ పూర్తవుతుంది. హాయిగా ఏ స్టేటస్ సంబంధమో చూసి అక్కడికి పంపిస్తే సరి" రాజారాం చెప్పుకుపోతు న్నాడు.

అమిత కంప్యూటర్ కోర్స్ చేయట్లేదని, తనకిష్టమైన జర్నలిజంలో మెలకువలు నేర్చుకుంటోందని రాజారాంకు తెలిస్తే కథ మరోలా మలుపు తిరిగి వుండేది.

★ ★ ★

న్యూఢిల్లీ...

బస్సు కోసం ఎదురుచూస్తోంది అమిత.

ఇరవయేళ్ల అమిత ఎత్తుకు తగ్గ లావుతో అందంగా వుంటుంది.

చూడచక్కని రూపం, దానికితోడు అందంగా పెదవులపై అమరిన చిర్నవ్వు, ఐక్యూ అన్నీ అమిత సొంతం.

ఆ బస్టాప్ ఎప్పుడూ రద్దీగా వుంటుంది. అక్కడ ప్రయాణీకులకన్నా ఎక్కువగా పోకిరీలే వుంటారు.

ఉద్యోగినులు, కాలేజి అమ్మాయిలు సాయంత్రం అయ్యిందంటే ఉసూరుమంటూ ఆఫీసులో అలసిపోయి ఇంటికి బయల్దేరు తారు.

చాలా రద్దీగా వున్న సమయం.

ఈవినింగ్ కావడంవల్ల రష్ మరింతగా పెరిగింది. చూడీదార్‌లో కుందనపు బొమ్మలా వుంది అమిత. అప్పుడప్పుడు హ్యాండ్‌బ్యాగ్ ఓపెన్‌చేసి చూసుకుంటోంది.

అయిదూ నలభైఅయిదు.

రోజూ ఆ సమయానికి చెయిన్ స్నాచర్స్, రోమియోలు అక్కడికి వచ్చి చేరుతారు.

అమిత కాస్తంత దూరంగా వెళ్ళి ఓ కిళ్ళీ కొట్టు పక్కన నిలబడింది. తననెవరూ గమ నించడం లేదని నిర్ధారించుకున్న తర్వాత, హ్యాండ్‌బ్యాగులోనుంచి కెమేరా బయటకు తీసింది.

ప్రయాణికుల కోసం కేటాయించిన, బస్ షెల్టర్‌లోని సీట్లలో పోకిరీలు కూచున్నారు. మరి కొంతమంది వస్తాదుల్లా వున్న వీధి రౌడీలు అమ్మాయిల్ని కామెంట్ చేస్తు న్నారు.

యాంగిల్ సరిచూసుకుంది. ఫ్లాష్ చెక్‌చే సుకుంది. ఆ తర్వాత కెమేరాను వాళ్ల వైపు పెట్టి క్లిక్ చేసింది.

ఒకటి... రెండు... మూడు...

క్లిక్... క్లిక్...క్లిక్ అలా క్లిక్ చేస్తూనే వుంది. మూడు నిమిషాల తర్వాత కెమే రాను హ్యాండ్‌బ్యాగులో పెట్టింది.

తాపీగా బస్టాప్‌వైపు అడుగులువేస్తూ వచ్చింది. అమితను చూసి ఎవడో రౌడీ ఈలవేశాడు.

అమిత అతనివైపు వెళ్ళి.

"ఆడపిల్లను చూసి ఈలవేయడానికి సిగ్గు లేదూ" అంది స్వచ్ఛమైన ఇంగ్లీష్‌లో.

"ఏంటి పోరీ ఏమంటున్నావు?" హిందీలో యాసగా, వ్యంగ్యంగా మాట్లా డారు.

"ఇలా బేవర్స్‌గా నిలబడి అమ్మాయిలకు లైన్ వేయడానికి సిగ్గులేదా? అని అంటు న్నాను" ఈసారి హిందీలో అంది.

వాడి మొహం ఎర్రబడింది. అక్కడే వున్న మిగతావాళ్ల మొహాలు కూడా జేవు

రించాయి. అది వాళ్ల అడ్డా. ఇలాంటి వాటిని వాళ్లు సహించరు.

అమిత మిగతా జనంవైపు తిరిగి "మీరెందుకు కామ్‌గా వుండిపోతారు?" అని హిందీలో అడిగింది. అందులో వర్కింగ్ వుమెన్స్ వున్నారు. మగాళ్లు కూడా వున్నారు.

"వాళ్ళు రౌడీలు. వాళ్లతో మనకెందుకు గొడవ చెప్పండి. మనం రోజూ ఈ బస్టాప్‌కు రాక తప్పదు. వాళ్లకు గ్యాంగ్ వుంటుంది" ఎవరో ఒకరు అమితకు నచ్చచెప్పబోయారు.

"అలా అని మనం భయపడుతూ కూచుంటే మనల్ని యిలానే బెదిరిస్తూ వస్తారు. కిరణ్‌బేడీ ఓ స్త్రీ... అయినా ఆమె అంటే నేరస్థులకు హడల్ ఇందిరాగాంధీ దేశాన్నే పరిపాలించింది. ఆఫ్టరాల్ ఓ రౌడీ గురించి భయపడతారా?"

"పోనీ, ఎట్‌లీస్ట్ పోలీసులకు కంప్లయింట్ అయినా ఇవ్వచ్చుగా" అంది అమిత.

"పులి నోట్లో ఎవరు తల పెడతారు మేడం?" ఓ యాభయ్యేళ్ల శాస్త్రీ అన్నాడు.

"నేను" అంది అమిత.

ఆ రౌడీలు కోపంగా అమిత దగ్గరికి వచ్చారు.

ఈ సంఘటన ఇలానే వదిలేస్తే రేపట్నుంచి ఇక్కడ తమకు భయపడేవాళ్లు వుండరని అర్థమైంది. అందుకే అమిత దగ్గరికి వెళ్ళి

"ఏయ్ పిల్లా మా గురించి నీకు తెలియదు. రేపీపాటికి నీ బాడీ పీసుపీసులవుతుంది" పచ్చిగా హిందీలో అన్నాడు.

అమిత వేగంగా తన కుడికాలి చెప్పును తీసి ఆ రౌడీ బుగ్గలు రెండూ ఎర్రగా కంది పోయేవరకూ వాయించింది.

బస్టాప్‌లో వున్న జనం బిత్తరపోయారు, మిగతా రౌడీలు షాకయ్యారు.

"ఇది కేవలం నన్ను అవమానించినందుకు కాదు. మిగతా వాళ్లకు ధైర్యం నూరిపోయడానికి. ఇలా చెప్పు తీసుకొని ఆ చెంపా, ఈ చెంపా వాయించండి అని వాళ్లకు సలహా ఇవ్వడానికి" అంది గట్టిగా.

ఆ రౌడీలు కోపంగా ముందుకు కదిలారు. ప్రయాణికులంతా భయంగా బిగుసుకుపోయారు. వాళ్లకు ఇలాంటి అనుభవం కొత్త.

సినిమాల్లో ఇలాంటి సంఘటన చూశారు. కానీ కళ్లముందు ప్రత్యక్షంగా ఇప్పుడు చూస్తున్నారు.

అమిత రెక్‌లెస్‌గా వాళ్లవైపు చూస్తూ హ్యాండ్‌బ్యాగులో వున్న చిన్న నోట్‌బుక్ తీసి, పెన్‌తో ఏదో నోట్ చేసుకోసాగింది.

సరిగ్గా అప్పుడే పోలీస్‌జీపు వచ్చి ఆగిందక్కడ.

★ ★ ★

జీపులో నుంచి ఆ ఏరియా ఇన్‌స్పెక్టర్, కానిస్టేబుల్స్ దిగారు. ఆ రౌడీలు ఒక్క క్షణం బిత్తరపోయారు. వాళ్ళేమాత్రం వూహించని విషయం. ఇదంతా పకడ్బందీగా జరిగిందని వాళ్లకు అప్పుడు అర్థమైంది. కానీ అప్పటికే ఆలస్యమైంది.

కానిస్టేబుల్స్ ఆ రౌడీలను పెడరెక్కలు విరిచి జీపులో తోశారు.

"ఇన్‌స్పెక్టర్... మీరు వెళ్లండి. నేను వెహికిల్‌మీద వస్తాను" చెప్పింది ఇన్‌స్పెక్టర్‌తో అమిత. జీపు రౌడీలను తీసుకొని ముందుకు కదిలింది.

జనం అంతా విచిత్రంగా చూశారు. సినిమా టిక్‌గా జరిగిన ఈ సంఘటన నుంచి వాళ్లు తేరుకోలేదు. అమిత చిన్న పాటి లెక్చర్ మొదలెట్టింది.

"చూశారా... మనం ధైర్యంగా వుంటే ఆ రౌడీలు ఏమీ చేయలేరు. మీరు ఎవరూ ధైర్యంగా ముందుకు రారని తెలిసినప్పుడు వాళ్ళు రెచ్చిపోతారు. మనమంతా ఒక్కటే అని తెలిస్తే తోకముడుస్తారు. మనం భయపడతాం. ప్రాణాలమీద తీపి, వాడు ఏదో చేస్తాడన్న భయంతో మనం మిన్నకుండి

పోతాం.

ఈరోజు మీమీద, రేపు మరొకరి మీదా...
ఇలా రెచ్చిపోతూనే వుంటారు రౌడీలు.



వాళ్ళు పట్టుమని పదిమంది కూడా వుండరు. మనం ఒక్కరొక్కరంగా కలిస్తే వందలు, వేలమందిమి అవుతాం. ధైర్యంగా కంప్లయింటు ఇద్దాం. అన్యాయాలను ఎండగడదాం. రేపట్నుంచి ఇటు పక్కకి ఏ రౌడీ రాడు"

జనంలో తర్జనభర్జనలు, కొందరు ఆలోచనలో పడితే మరికొందరు మనకెందుకులే అన్న నిరాసక్తంలో పడిపోయారు. ఇంకొందరు నిజమేకదా అనుకున్నారు.

కదలిక... చిన్న కదలిక... ఒకేసారి ఆ కదలిక విశ్వరూపం దాల్చకపోయినా వాళ్ళ మెదళ్ళలో కలిగే ఆలోచన చిన్న కంపనంనుంచి వేనవేల ప్రకంపనల వరకూ విస్తరిస్తుంది.

★ ★ ★

"అయాం... అమిత. ఈవెనింగ్ డైలీ

రిపోర్టర్‌ని. ప్రజలకోసమే పత్రికలు అన్న పాలసీ మాది. మీకు ఎప్పుడు ఏ అవసరం వచ్చినా ఒక్క ఫోన్ కాల్ చేయండి చాలు" అంటూ అక్కడ్నుంచి కదిలింది.

★ ★ ★

అమిత పోలీస్‌స్టేషన్‌లోకి వెళ్ళేసరికి రౌడీలు గోడపక్కగా చేతులు కట్టుకొని నిల బడి వున్నారు.

"కమాన్ మిస్ అమితా. కంగ్రాట్యులే షన్స్. ఇంతవరకూ ఆ ఏరియాలో ఇలా ఎన్నిసార్లు జరిగినా ఎవరూ కంప్లయింట్ ఇవ్వలేదు. ఇంఫాక్ట్ మా సిస్టర్‌ని కూడా ఏడిపించారు. రెడ్ హ్యాండెడ్‌గా దొరకలేదు. సాక్ష్యం ఇవ్వడానికి ఎవరూ రాలేదు" ఇన్‌స్పె క్టర్ అన్నాడు.

నవ్వింది అమిత.

"అదేమిటి మిస్ నవ్వుతారు" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"మీరు కూడా సాక్ష్యాలూ, ఆధారాలు అంటూ వుంటే"

"మేము అనకూడదా. మా పోలీసు కష్టాలు మీకు తెలియదు. మా స్టేషన్‌కు వచ్చి మమ్మల్ని బెదిరించి పోయినా ఒక్కో సారి అలా చూస్తూ వుండిపోవాల్సిన పరి స్థితి వస్తుంది.

"మా ముందే దౌర్జన్యం చేసి ఏదో ఆసు పత్రిలో రెండురోజుల క్రితమే ఆక్సిడెంట్ అయినట్టు ఎలిబీ సృష్టించుకుంటాడు. పొలి టికల్ ప్రెషర్. సవాలక్ష అడ్డంకులు"

"అఫ్‌కోర్స్.. ఇవ్వన్నీ మీలాంటి నిజా యితీ పరులైన ఆఫీసర్లకే"

"వాడ్డూ యూ మీన్?"

"ఐ మీన్ వాటైసే. అకారణంగా లాక ప్పులో తోసే పోలీసులు, లాకప్‌డెత్ చేసే వాళ్ళు, ఎన్‌కౌంటర్లు చేసేవాళ్ళు, ఏ నేరమూ చేయకుండానే, ఏ సాక్ష్యమూ లేకుండానే స్టేషన్‌లో సంవత్సరాల తరబడి వుండేవాళ్ళు లేరంటారా?"



ఇన్‌స్పెక్టర్ నితిన్ మాట్లాడలేదు. అమిత మాటల్లో నిజం గురించి ఆలోచిస్తున్నాడు. ప్రతీ డిపార్ట్‌మెంట్‌లో మంచీచెడూ వుంటాయి.

"ఎనీవే... థ్యాంక్యూ మిస్టర్ ఇన్‌స్పెక్టర్. సినిమా పోలీసుల్లా వస్తారేమోనని భయప డ్డాను" అంది.

"సినిమా పోలీసులా? అదేంటి!" ఆశ్చ ర్యంగా అడిగాడు ఇన్‌స్పెక్టర్ నితిన్.

"సినిమాల్లో అంతా అయిపోయాక ఊపు కుంటూ టోపీలు స్టిఫ్‌గా పట్టుకొని వచ్చేవాళ్ళే సినిమా పోలీసులు. క్లయిమాక్స్ లోనో, దొంగలు పారిపోయాకో వచ్చి హడా విడి చేస్తారు. యూ ఆర్ అండర్ అరెస్ట్ అంటారు"

నవ్వాడు ఇన్‌స్పెక్టర్ నితిన్.

"మిస్ అమితా మీరు చేతల్లోనేకాదు మాటల్లో, ఆలోచనల్లో కూడా చాలా షార్ప్. మీలాంటి జర్నలిస్టుల అవసరం నేటి సమా జానికి చాలా వుంది"

అతని పొగడ్తకు ఇబ్బందిగా ఫీలయింది అమిత.

"ఇన్‌స్పెక్టర్... ఫార్మాలిటీస్ పూర్తిచేస్తే నేను వెళ్తాను" అంది అమిత.

"వై నాట్, ష్యూర్" అంటూ కొన్ని పేపర్లు అమిత ముందుకు తోశాడు.

అమిత ఆ పేపర్లమీద సంతకం చేసి ఆ రౌడీలవైపు ఓసారి చూసి బయటకు నడి చింది. స్టేషన్ బయటకు వచ్చి వెహికల్ స్టాండ్ తీసి స్టార్ట్ చేసింది.

రోడ్ నంబర్ థర్టీ ఫోర్ దగ్గర ఆగింది. అక్కడ్నుంచి రైట్ టర్న్ తీసుకొని ఓ కాల నీలోకి వెళ్ళింది. ఆ కాలనీలో ఓ ఇంటి ముందు ఆగి డోర్‌బెల్ ప్రెస్ చేసింది. అయిదు క్షణాల తర్వాత తలుపు తెరుచు కుంది.

"హాయ్... అమితా. నువ్వా ఏమిటీ అప్పుడే వచ్చేశావు? పని అయిపోయిందా?" సాదరంగా అమితను లోపలికి ఆహ్వానిస్తూ అంది భావన.

అమితకు ఈమధ్యనే పరిచయం అయింది భావన. కాలేజీ డే ఫంక్షన్‌లో భరతనాట్యంలో మంచి పెర్‌ఫార్మెన్స్ చూపించింది భావన. ఆ న్యూస్ ఐటమ్‌ని బాగా కవర్ చేయడంతోపాటు, ఢిల్లీలో పెరిగిపోతున్న డిస్కోథెక్‌ల మధ్య భరతనాట్యం ప్రదర్శన అద్భుతమని పొగుడుతూ రాసింది.

దానితో భావన అమితను కలిసి పర్సనల్‌గా థాంక్స్ చెప్పింది. అలా పరిచయం అయింది. ఆ పరిచయంతో భావన వెహికల్ అడిగింది.

"ఏంలేదు భావనా... ఇవ్వాళ అస్సయిన్‌మెంట్ టేకప్ చేశాను. రౌడీలతో వ్యవహారం. ఒకవేళ బెడిసికొడితే వెహికల్‌తో ఉడాయించొచ్చని ముందు జాగ్రత్త" అంటూ ఉదయం జరిగిన సంఘటన మొత్తం చెప్పింది.

"యూ ఆర్ గ్రేట్. అచ్చు సినిమాల్లో చేసే సాహసంలా వుంది" అంది భావన ఎక్సైయిట్ అయిపోతూ అమితకేసి అడ్మయిరింగ్‌గా చూస్తూ.

"నిజజీవితంలో సంఘటనలే సినిమాల్లో పెడతారు. నాకన్నా ఎంతోమంది గొప్ప గొప్ప జర్నలిస్టులు వున్నారు. ప్రాణాలకు తెగించి ఎన్నో కుంభకోణాలు వెలికితీసినవాళ్ళు ఉన్నారు. వాళ్ళతో పోల్చుకుంటే నేను నథింగ్" అంది అమిత.

"ఎవరి గొప్ప వాళ్ళకు తెలియదులే. లోపలికి రా. వేడివేడి టిఫిన్ చేసి పెడతా" అంది భావన.

"వద్దు. ఇప్పటికే లేటయింది. ముందు ఆఫీసుకు వెళ్ళాలి. ఎడిటర్‌గారిని కలిసి ఆ తర్వాత ఆంధ్రా టిఫిన్ సెంటర్‌కు వెళ్ళాలి. నాకోసం మా ఫ్రెండ్ ఎదురు చూస్తుంటుంది. మరోసారి కలుస్తాను" అంది వెహికల్ కీస్ ఇస్తూ అమిత.

"ఈసారి వచ్చినప్పుడు లంచ్‌కే రావాలి" అంది భావన.

"ష్యూర్... నెక్ట్స్ సండే తప్పకుండా లంచ్‌కి వస్తాను" అంటూ బయటకు వచ్చి ఆటోని పిలిచి కూర్చుని అడ్రస్ చెప్పింది.

★ ★ ★

ఈవెనింగ్ డైలీ...

ఎడిటర్ ఛాంబర్‌లోకి అడుగుపెట్టింది అమిత.

అమిత లోపలికి అడుగుపెట్టేసరికి ఈవెనింగ్ డైలీ ఎడిటర్ రావు సీరియస్‌గా కంప్యూటర్‌లో మ్యాటర్ చూస్తున్నాడు. ఆ ఎడిటర్ ఛాంబర్‌లోకి ఎలాంటి అనుమతీ లేకుండా అడుగుపెట్టే చనువు ఒక్క అమితకి మాత్రమే వుంది.

అడుగుల శబ్దం విని తలెత్తి అమితవైపు చూసి 'వెరీ గుడ్ అమితా... నిన్న బస్టాప్‌లో నువ్వు క్రియేట్ చేసిన సీన్ మంచి ఎఫెక్ట్ ఇచ్చింది. ఆ ఫొటోగ్రాఫ్, అక్కడ ఇన్సిడెంట్, పోలీసులు ప్లాన్ ప్రకారం రావడం, ఆ న్యూస్ కవరేజ్ చాలా బావుంది. ఎసిపిగారు ఇప్పుడే ఫోన్ చేసి నీకు అభినందనలు తెలియచేయమన్నారు" ఉత్సాహంగా చెప్పాడు ఎడిటర్ రావు.

"నాదేముంది సార్. ఇది చాలా చిన్న విషయం" అంది వినమ్రంగా అమిత.

"లేదమ్మా... నిజం చెప్పాలంటే ఇది చాలా మేజర్ ఇష్యూ. చాలా చిన్నగా మొదలయ్యే ఇలాంటి సంఘటనలు పెద్ద మార్పుకు శ్రీకారం చుట్టుకుంటాయి.

"ఒక్క ఢిల్లీ పరిసర ప్రాంతాల్లోనే దాదాపు అయిదువందలకు పైగా బస్టాప్‌ల్లో ఇలాంటి సంఘటనలు జరుగుతున్నాయి. పెద్దపెద్ద స్కాంలు, రాజకీయ నాయకుల సెన్సేషన్ ఇంటర్వ్యూలు... ఇవన్నీ ప్రజల్లో సంచలనం కలిగించొచ్చేమో కానీ నువ్వు కవర్ చేసిన న్యూస్ మాత్రం ప్రజలకు ఉపయోగపడుతుంది.

నిన్న జరిగిన సంఘటన మనం ఈవెనింగ్ డైలీలో కవర్‌చేశాక చాలామంది మహిళలు, ప్రయాణికులూ ఫోన్‌లో అభి

నందల వర్షం కురిపించారు.

ఈ చిన్న సంఘటనతో ఈవ్‌టీజర్స్, రోమియోలు, వీధి రౌడీలు కాస్త వెనకడుగు వేస్తారు. పోలీసులు కూడా ఎలర్టయ్యారు. సాయంత్రం సమయాల్లో బస్టాప్‌ల దగ్గర మఫ్టీలో పోలీసులను పెడుతున్నారు. ప్రజలకు కావలసింది సంచలనంకాదు. సమస్యకు పరిష్కారం"

ఎడిటర్‌వైపే చూస్తుండిపోయింది అమిత.

"ఏంటమ్మా నేను చెప్పేది రైటేకదా?" అడిగాడు రావు.

"ఎగ్జాట్‌లీ సార్. మీలాంటి ఎడిటర్ దగ్గర పని చేస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. మీరు ఇచ్చే ఈ ప్రోత్సాహం నాకు మరింత ఆసక్తిని ఇస్తుంది సార్. జర్నలిస్టునవ్వాలనే కోరిక చిన్నప్పట్నుంచీ నాలో పెరుగుతూ వచ్చింది. ఇప్పుడు మీలాంటి ఎడిటర్ దగ్గర కనకే అపూర్వమైన అవకాశం వచ్చింది. థాంక్యూ సార్" అంది.

"దట్సాల్ రైట్. అన్నట్టు లోకల్ రైళ్ళలో ప్రయాణించి వర్కింగ్ ఉమెన్స్ ప్రాబ్లమ్స్ గురించి ఓ ఆర్టికల్ తయారుచేయాలి. కొన్ని లోకల్ రైళ్ళలో టాయ్‌లెట్లు వుండవు. రద్దీగా వుండే రైళ్ళలో మగాళ్ళతో పాటు నిలబడి ప్రయాణం చేయాలి. దానికి సంబంధించి వాళ్ళ ఫీలింగ్స్, ప్రాబ్లమ్స్ కవర్‌చేయి. రిపోర్టర్‌గా వెళ్ళకు. ఓ ప్రయాణికురాలిగా వెళ్ళు. వరుసగా మూడ్నాలుగు రోజులు స్పెషల్ స్టోరీగా వేద్దాం" చెప్పాడు.

"అలాగే సార్" అంది ఉత్సాహంగా అమిత.

★ ★ ★

ఆంధ్రా టిఫిన్ సెంటర్...

ఓ కార్నర్ టేబుల్ దగ్గర కూర్చుని వుంది అమిత. ఆమెకు ఎదురుగా సుచిత్ర వుంది. వాళ్ళిద్దరూ ఒకప్పుడు ఒకే కాలేజీలో చదువుకున్నారు. సుచిత్ర రెండేళ్ళు సీనియర్.

"మీకు థాంక్స్ ఎలా చెప్పాలో అర్థంకావడంలేదు" అంది అమిత సుచిత్రతో.

"అదే వద్దన్నది. మీరు ఏమిటి. మనిద్దరి మధ్యా పెద్ద వయసు తేడాలేదు. వుయ్ ఆర్ ఫ్రెండ్స్. దట్సాల్. సుమిత్రా అని పిలువు"

"అలాగే" అంది అమిత.

"ఇప్పుడు చెప్పు. థాంక్స్ ఎందుకు?"

"ఇవ్వాళ ఎడిటర్‌గారు పిలిచి ప్రత్యేకంగా అభినందించారు"

"అది నా క్రెడిటా?"

"అఫ్‌కోర్స్... కానీ నేను ఇక్కడికి రావడానికి కారణం నువ్వే. ఇంట్లో కంప్యూటర్ స్పెషల్ కోర్స్ అని చెప్పి ఇక్కడికి వచ్చాను. మమ్మీ, డాడీ నన్ను స్టేట్స్‌కు పంపించాలని అనుకుంటున్నారు.

"నీకు తెలుసుకదా. నాకు జర్నలిజం అంటే ప్రాణం. ఇంట్లో ఇష్టంలేదు. లక్కీగా నీలాంటి ఫ్రెండ్ దొరకడంవల్ల అది సాధ్యమైంది. కంప్యూటర్ స్పెషల్ కోర్స్ పేరుతో జర్నలిస్ట్‌గా ఇక్కడ ఓనమాలు దిద్దుకుంటున్నాను"

"నీ పట్టుదల చూస్తుంటే నాకు ముచ్చటేస్తోంది అమితా. ఎక్కడ్నుంచో, ఇంతదూరం వచ్చి జర్నలిజంమీద ఇంట్రస్ట్‌తో ఇంట్లోవాళ్ళకు తెలియకుండా మేనేజ్ చేస్తూ నీ అభిరుచిని, జీవితాశయాన్ని నెరవేర్చుకుంటున్నావు. నీలాంటి పట్టుదల ప్రతి ఒక్కరిలో వుంటే ఈ డిప్రెషన్, నిరాశ అనే పదాలే వుండవు" సుచిత్ర అంది సిన్సియర్‌గా.

"నన్ను మరీ పొగిడేయకు" అంది ఎర్రబడ్డ మొహంతో అమిత.

సుచిత్ర ఇంట్లో పేయింగ్ గెస్ట్‌గా వుంటుంది అమిత. సుచిత్ర ఫ్రీలాన్స్ జర్నలిస్ట్. ఆమె సహకారంతోనే ఈవెనింగ్ డైలీలో చేరింది అమిత.

★ ★ ★

"ఇంతకీ వూరెప్పుడెళ్తున్నావు? " అడిగింది సుచిత్ర.

"వెళ్ళాలి. నెక్స్‌ట్ మంత్‌లో డాడీ లెక్క ప్రకారం కంప్యూటర్ కోర్స్ పూర్తవుతుంది. నాకూ తాతయ్యను, బామ్మను చూడాలని వుంది. నిజం చెప్పాలంటే నాకు జర్నలిజం మీద ఆసక్తి కలగడానికి మా తాతయ్యే కారణం. మనకు ఏ రంగంలో ఆసక్తి వుంటే ఆ రంగంలో కృషి చేయాలని చెప్పేవాడు. నేను ఏ పనిమీద ఢిల్లీ వచ్చానో తాతయ్యకు, బామ్మకు తెలుసు"

మా బామ్మ నాకు ఐడియల్ షి... ఆవిడ దగ్గర చాలా నేర్చుకున్నాను. నిజం చెప్పాలంటే నాకు అమ్మానాన్నకన్నా బామ్మ తాతయ్యలు అంటేనే బోల్డు ఇష్టం. ఈమధ్య వాళ్ల నుంచి ఉత్తరాలు రావడం లేదు. బహుశా నన్ను డిస్టర్బ్ చేయొద్దని అనుకుంటున్నారేమో" అంది అమిత.



"అలాగా" అన్నట్టు తల పంకించింది.

ఈలోగా వెయిటర్ బిల్లు తెచ్చాడు. బిల్లు చెల్లించి బయటపడ్డారు.

ఆ రోజు భార్గవరావు ఇంట్లో మూర్తి, సుభాష్ సమావేశమయ్యారు.

"ఒరే అన్నయ్యా నాకెందుకో రాజారాం అన్నయ్యమీద అనుమానం పెరిగిపోతోంది" అన్నాడు మూర్తి.

"ఎందుకలా అంటున్నావు? "

"మొన్న అమ్మను చూడ్డానికి నేనూ, మీ మరదలు వెళ్లాం. అమ్మ ఇంట్లోలేదు. అన్నయ్య నేను రావడమే ఇష్టం లేనట్టు మొహం పెట్టుకున్నాడు. వదిన పెద్దగా ఏమీ మాట్లాడలేదు. అమ్మ ఎక్కడికి వెళ్లిందని అడిగితే ఏమో ఎవరికి తెలుసు... అంటూ మాట్లాడారు.

పళ్లు, స్వీట్లు ఇచ్చి వచ్చాను. సాయంత్రం ఆఫీసు నుంచి వెళ్లేప్పుడు అమ్మ వచ్చిందేమో చూద్దామని వెళ్తే అమ్మ వుంది.

ఉదయం ఎక్కడికి వెళ్లావమ్మా. నీ కోసం నేనూ మీ కోడలు వచ్చామని చెబితే విషయం తనకు తెలియదన్నది. అంటే నేను వచ్చిన విషయం అమ్మకు చెప్పలేదు. అమ్మకు నా మీద కోపం రావాలని తమకే అమ్మ మీద ప్రేమ వుందని అనుకోవాలని చేస్తున్నాడేమోనని నా అనుమానం"

"అవునవును. నేను మొన్నోసారి అమ్మకు ఫోన్ చేస్తే అమ్మలేదని చెప్పింది వదిన. కానీ అమ్మ మాటలు వినిపిస్తూనే వున్నాయి" సుభాష్ అన్నాడు.

"ఇప్పుడు ఏం చేద్దామంటారు? " భార్గవరావు అడిగాడు.

"అమ్మ దగ్గరికి వెళ్లి ఎవరి ఆస్తి వాళ్లకు పంచమని చెబుదాం. అందరి దగ్గర తలా మూడునెలలు వుంటుంది. ఎవరి దగ్గర వుంటే వాళ్లకి తన పెన్షన్ డబ్బులు ఇస్తుంది" మూర్తి అన్నాడు.

"చిన్నవాడైనా మీ తమ్ముడు కరక్ట్‌గా చెప్పాడు" భార్గవరావు భార్య అంది.

ఆ ముగ్గురూ సమాలోచనలు జరిపారు. చివరికి ఆస్తి పంపకాలకోసం తల్లి దగ్గరకు వెళ్లాలని నిర్ణయించుకున్నారు.

★ ★ ★

వైదేహి ఆలోచిస్తూ వుండిపోయింది.

భర్త గుర్తొచ్చాడు. గదిలో మూలనవున్న సూట్‌కేసు ఓపెన్ చేసింది. సూట్‌కేస్ అడుగున చీరల మడతలో వున్న వుత్తరాల దొంతర బయటకు తీసింది.

ముప్పయ్యేళ్ల క్రితం వుత్తరాలవి. ప్రేమతో తన భర్త రాసిన వుత్తరాలు. ఆ వుత్తరాలను స్పృశిస్తుంటే ఆమె మనసు ఎక్కడికో అవ్యక్తమైన అనుభవాల గతంలోకి జారుకుంటోంది.

ఓ ఉత్తరం మడత విప్పింది. చిరిగిపోవడానికి సిద్ధంగా వున్న కాగితాలు అవి.

"ఎలా వున్నావురా! ఈ క్షణం నువ్వు గుర్తొస్తే మరుక్షణం నీ రూపం కళ్లముందు కదలాడుతుంది. నా కోసం నువ్వు ఎదురు చూసే ప్రతీక్షణం నాతో ఏమంటుందో తెలుసా. 'నీ కోసమే మమ్మల్ని త్వరగా వెళ్లిపొమ్మంటుంది. మమ్మల్ని లెక్కపెడుతూ నిట్టూర్పులు విడుస్తుంది. నీ జ్ఞాపకాలే ఆమెకు వ్యాపకాలు అయ్యాయి' అని.

నిజమే నేనంటే నీకెంత ప్రేమో తెలుసు. విషాదంలో కూడా చిర్నవ్వు చిందించడం నీకే చేతనవుతుంది. నాకు ఇన్ని మైళ్ల దూరంలో వుండికూడా నా మనసుకు అతి దగ్గరగా వున్నట్టు కనిపిస్తావు. అదే నీ ప్రత్యేకత కదా!

ఆ ఉత్తరాన్ని గుండెలకు హత్తుకుంది వైదేహి.

ఉత్తరాల దొంతరను పెదవులకు ఆన్చుకుంది. ఉత్తరమంటే మన మనసును చదవడమే. అందులోని ప్రతి అక్షరం తన గుండెను తాకుతుంది.

ఆ ఉత్తరాల్లోని ప్రతీ అక్షరం ఆమెకు చిర పరిచితమే. ఆ అక్షరాలే తనని ఓదార్చే నేస్తాలు.

ప్రతి ఉత్తరంలో ఏరా అనే సంబోధన వుంటుంది. ఆ పిలుపు తనకు వేనవేల వేణువులతో సమానం.

ఒంటరిగా చీకటి బూచి నిన్ను భయపెడుతున్న వేళ నిద్రరాని నువ్వు, నిద్రకోసం అలమటించే నువ్వు ఏదో ఓ రోజు ఏదో ఓ క్షణం ఖచ్చితంగా నన్ను గుర్తుచేసుకుంటావు.

తక్షణం నేను నీ కనురెప్పల మీదికి వచ్చి కనురెప్పలను మూసి నీకు నిద్రను ప్రసాదిస్తాను. అయినా నీ గుండెలోతుల్లో వున్న నేను నా గుండెను చీల్చుకొని ఎలా బయటకు వస్తాను.

వైదేహి చేయి ఆ ఉత్తరాలను తన గుండెలకు మరింత గట్టిగా హత్తుకుంది.

తన నేస్తం, తన సహచరుడు, తన ప్రియ వల్లభుడు, తన తల్లి, తన తండ్రి అన్నీ తనే. అతను తన తనువును చాలించడం... అతని తాలూకు ఉత్తరాలు, ఉత్తరాల్లోని ఆ అక్షరాలూ... ఉద్విగ్నభరిత క్షణాల్లారా కంటి తడిపెట్టరే.

★ ★ ★

వైదేహి బయటకు వెళ్లడానికి రెడీ అవుతోంది. సరిగ్గా అప్పుడే ముగ్గురు కొడుకులూ కోడళ్లతో సహా వచ్చారు.

"ఎక్కడికమ్మా బయల్దేరావు? " భార్గవరావు అడిగాడు.

"బయట కాస్త పని వుంది" ముక్తసరిగా చెప్పింది వైదేహి.

తల్లికి వున్న పనేమిటో ఆ ముగ్గురు కొడుకులకూ అర్థం కాలేదు. వాళ్లు ఒకరి మొహంలోకి మరొకరు చూసుకున్నారు. రాజారాం కామ్‌గా వుండిపోయాడు.

వైదేహి ఇవేమీ పట్టించుకోకుండా బయటకు వెళ్లిపోయింది.

★ ★ ★

"అమ్మ ప్రవర్తన నాకేమీ అంతుబట్టడం లేదన్నయ్యా" అన్నాడు భార్గవ రాజారాంతో.

"నాకూ అలానే తోస్తోంది. రోజూ ఉదయమే ఎక్కడికో వెళ్తుంది"

"కొంపదీసి ఏదైనా బిజినెస్ స్టార్ట్ చేయలేదుకదా" అన్నాడు మూర్తి.

"ఇప్పుడా... అయినా అమ్మకే బిజినెస్

# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్
హైదరాబాద్, 500 082.

శ్రీచంద్ర

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూన్ చతుర నవల **ఈ వేకువ మీకోసం**

చిరునామా: ______________________________

______________________________

______________________________

______________________________

చేతవుతుందని. నాన్న ఇంటి ఖర్చులకు డబ్బిస్తేనే అయ్యో నావల్లకాదు మీరే చూసు కొండి అనేది" సుభాష్ అన్నాడు.

"మరి అత్తయ్య ఎక్కడికి వెళ్లి వుంటుంది" అనే విషయం మీద నలుగురు కోడళ్లు చర్చించుకున్నారు.

చివరికి అందరూ సమిష్టిగా ఓ నిర్ణయం తీసుకున్నారు.

"అన్నయ్యా ఈ ముసుగులో గుద్దులాట వ్యవహారం వద్దు. అమ్మను ఏదోలా ఒప్పించి ఆస్తిపంపకాలు చేసుకుందాం. మనలో మనం కీచులాడుకుని ప్రయోజనం లేదు" డైరక్ట్‌గా విషయంలోకి వచ్చాడు భార్గవ.

మళ్లీ కొద్దిసేపు తర్జనభర్జనలు చివరికి అందరికీ అదే ఆమోదయోగ్యంగా పరిష్కా రంగా కనపడింది.

"మనం అందరం కలిసికట్టుగా అమ్మని అడుగుదాం" అని రాజారాం అన్నాడు.

అందరూ ఆ ప్రపోజల్‌ని ఒప్పుకున్నారు. సాయంత్రం వరకూ వైదేహి రాలేదు.

★ ★ ★

వైదేహి బస్టాప్‌లో నిలబడింది. తల మీదుగా ఎండ తగులుతోంది. అయినా ఆమె ఆ ఎండను లెక్కచేయలేదు. జనం బస్సుల కోసం ఎదురుచూస్తున్నారు.

బస్సులు వస్తున్నాయి. వెళ్తున్నాయి. కానీ వైదేహి ఏ బస్సు ఎక్కలేదు. అసలు ఆమె బస్సు ఎక్కడానికి రాలేదు. ఆ ఇంట్లో నుంచి బయటపడడానికి వచ్చింది.

ఏ తల్లి అయినా బిడ్డల దగ్గర ఆనందాన్ని పొందుతుంది. కానీ బిడ్డల ఉనికి భరించలే నంతగా పరిస్థితి ఎదురైతే. ప్రస్తుతం ఆమె అలాంటి పరిస్థితిలోనే వుంది.

"మేడమ్ మీరెక్కడికి వెళ్లాలి? " అప్ప ట్నుంచి ఆమెనే అబ్జర్వ్ చేస్తోన్న ఓ వ్యక్తి అడిగాడు.

కాస్త తడబడి వెంటనే తేరుకుంది. ఈలోగా ఓ బస్సు వచ్చింది. ఆ బస్సు ఎక్క డికి వెళ్తుందని కూడా చూసుకోకుండా ఎక్కే సింది. బస్సు రద్దీగా లేదు. ఓ సీట్లో కూచుంది. విండోసీటు అది. ఆ బస్సు ఎక్కడికి వరకూ వెళ్తుందో తెలుసుకొని చివరి స్టాప్‌కు టికెట్ తీసుకుంది.

బస్సు వెళ్తోంటే రోడ్డు మీద కదిలే జనాన్ని చూస్తోంది. ఉరుకులు పరుగులూ ప్రతిక్షణం టెన్షనే. ఆఫీసులకు వెళ్లే హడావి డిలో కొందరు, వ్యాపార పనుల వల్ల మరి కొందరు... ఎవరిలో చూసినా టెన్షనే. బస్సు ఒక్కసారిగా పెద్ద కుదుపుతో ఆగింది.

జనంలో కంగారు. ప్రయాణికుల్లో కుతూ హలం. ఏమైంది? ఏం జరిగింది? యాక్సి డెంటా? రకరకాల కామెంట్లు. వైదేహి తల బయటకు పెట్టి చూసింది.

"ఓ ముసలాయన రోడ్డు దాటుతూ కళ్లు తిరిగి బస్సుకు అడ్డంగా పడిపోయాడు" ఎవరో అన్నారు.

"దెబ్బలు తగిలాయా? " ఆదుర్దాగా అడి గింది వైదేహి.

"డ్రైవర్ సడన్ బ్రేకుతో బస్సాపాడు. లేక పోతే తగిలే వుండేది. ప్రాణమే పోయినా ఆశ్చర్యం లేదు" ఎవరో కామెంట్ చేశారు.

"ఈ వయసులో రోడ్డు మీదికి రావడం ఎందుకు? " ఎవరో అన్నారు.

"ఎవరినైనా వెంటబెట్టుకు రావచ్చుకదా" ఇంకో కామెంట్.

అలా కామెంట్ చేస్తూనే చోద్యం చూస్తు న్నారు. వైదేహి గబగబా బస్సు దిగింది. కళ్లు తిరిగి పడిపోయిన వృద్ధుడి వయసు డెబ్బయ్ పైగానే వుంటుంది.

వైదేహి వెళ్లి చేయి అందించి, అతడ్ని తన చేయి ఆసరా ఇచ్చి లేపింది.

"మీకావల్సిన మనిషా? " ఎవరో అడి గారు. అవుననలేదు కాదని అన్లేదు. ఆ వృద్ధుడ్ని ఓ పక్కకు తీసుకువచ్చింది.

బస్సు కదిలింది. కండక్టర్ వైదేహి వైపు చూసి "మేడమ్ మీరు రండి" అన్నాడు ఆమె

చివరి స్టాప్‌లో టికెట్ తీసుకుందన్న విషయం గుర్తొచ్చి

"నేను ఇక్కడే దిగిపోతాను కండక్టర్" చెప్పింది వైదేహి. బస్సు వెళ్లిపోయింది.

★ ★ ★

"దెబ్బలేమైనా తగిలాయా? " అడిగింది ఆ వృద్ధుడ్ని వైదేహి.

"లేదు తల్లీ నాకేమీ కాలేదు. ఈ వృద్ధుడ్ని ఆదుకున్నావు" అంటూ రెండు చేతులూ జోడించాడు.

"అయ్యయ్యో! పెద్దవాళ్లు చిన్నవాళ్లకు నమస్కరిస్తే ఆయుక్షీణం" అంది వైదేహి.

"దేవుడికి భక్తులు నమస్కరిస్తే అది ఆయుక్షీణం కాదు. నన్ను కాపాడి దేవుడి అంత ఎత్తుకు ఎదిగావు"

"అయ్యయ్యో ఎంతమాట! ఇందులో నేను చేసిందేమీ లేదు. చిన్న సాయం అంతే... మీరు ఎక్కడికి వెళ్లాలో చెబితే నేను అక్కడి వరకూ మిమ్మల్ని దిగబెడతాను"

"ఫర్లేదు తల్లీ, ఇల్లు ఇక్కడికి దగ్గరే" అంటూ ముందుకు కదలబోయి అమ్మా అన్నాడు.

"అయ్యయ్యో దెబ్బలు తగిలినట్టున్నాయి" అంది ఆ వృద్ధుడి బాధ చూసి.

"తగలవలసిన దెబ్బలు ఈ గుండెకు ఎప్పుడో తగిలాయి" ఆ వృద్ధుడు తనలో తను గొణుక్కుంటున్నట్టు అన్నాడు.

"అలా హోటల్‌కి వెళదాం రండి. ఏదైనా పళ్లరసం తీసుకోవచ్చు" చనువుగా అంది వైదేహి.

"నేనెవర్నని తల్లీ ఇంత ఆప్యాయత చూపిస్తున్నావు? నీ తండ్రినా? కాదు, నీ తోబుట్టువునా అదీ కాదే. పోనీ నీకు తెలిసిన వ్యక్తినా? ఆ అవకాశం కూడా లేదే. ఎందుకు తల్లీ నీకింత జాలి" ఆ వృద్ధుడి గొంతు వణుకుతోంది.

"ఈ భూమ్మీద పడే బిడ్డకే తను భూమ్మీద పడే వరకూ ఎవరికి జన్మించిందో, వాళ్లకూ తనకూ ఏ సంబంధమో తెలియదు. ఒక మనిషిని ఆదుకోవడానికి, ఒక మనిషికి సాయపడ్డానికి రక్తసంబంధాలు, మమతానుబంధాలు, స్నేహానుబంధాలు వుండాలా? " అడిగింది వైదేహి.

ఆ వృద్ధుడి కళ్లు చెమర్చాయి.

అతనింకేం మాట్లాడలేకపోయాడు. వైదేహితోపాటు అతను జ్యూస్ షాప్‌కు వెళ్లి పళ్లరసం తాగాడు. ఆ డబ్బు వైదేహియే చెల్లించింది.

ఆమెకు కృతజ్ఞతలు చెప్పి ముందుకు కదిలి జనంలో కలిసిపోయాడతను.

వైదేహి వెనుతిరిగింది ఓ చిన్న సంతృప్తితో

★ ★ ★

వైదేహి రాత్రి ఆరు... ఆరున్నర అవుతుండగా వచ్చింది. నలుగురు కొడుకులు, కోడళ్లు వైదేహి రాకకోసం ఎదురుచూస్తున్నారు.

వైదేహి స్నానం చేసొచ్చింది.

డైనింగ్ టేబుల్ దగ్గర కూచుంది.

పెద్ద కోడలు వడ్డించింది.

మౌనంగా అన్నం తిని చేయి కడుక్కొని ప్లేటుని సింక్‌లోవేసి తన గదిలోకి వెళ్ళబోయింది.

"అమ్మా... నీతో మాట్లాడాలి" రాజారాం అన్నాడు.

"మాట్లాడు" అంది సోఫాలో కూచొని వైదేహి.

"మేమంతా ఓ నిర్ణయానికి వచ్చాం" రాజారాం ఉపోద్ఘాతంగా అన్నాడు.

"చాలా మంచిది" శాంతంగానే అంది వైదేహి.

"ఏమిటా నిర్ణయం అని అడగవేమిటమ్మా"

"నేను అడక్కపోయినా చెబుతారుగా"

"అదీ... మరేం లేదు. మా నలుగురి పరిస్థితి ఆర్థికంగా అంతంతమాత్రమే. ఈ వ్యాపారాలు, ఉద్యోగాలు ఏదీ గొప్ప చెప్పుకోవడానికి కానీ ఎందుకూ పనికిరావు. నాన్న బతికివున్నన్నాళ్లు మా గురించి ఆలోచించే

వాడు. ఈ డబ్బు, ఈ జీవితం మీకోసమేనర్రా అనేవాడు" అంటూ ఆగాడు రాజారాం.

వైదేహి మౌనంగా వుండిపోయింది.

"నాన్న పేరుమీద వున్న డబ్బు, బ్యాంకులోని డబ్బు నువ్వు తీసిచ్చావనుకో. మా నలుగురికి కాస్త సాయంగా వుంటుంది. బ్యాంకులో వుంటే వచ్చే వడ్డీ ఎంత. నామమాత్రమేగా. నువ్వే పెద్దమనసు చేసుకొని నీ కొడుకుల గురించి ఆలోచించాలమ్మా" రెండోవాడు నేలమీద కూచొని అడిగాడు.

"వెళ్ళి తీసుకోండి" అంది వైదేహి.

"మేమా... మాకెలా ఇస్తారు? "

"ఏం...ఎందుకని? "

"అది నీ పేరుమీద నాన్నగారు వేసింది కదా. ఇల్లు కూడా నీ పేరుతో వుంది. ఈ ఇంట్లో నలుగురం వుండలేం. ఈ ఇల్లు అమ్మితే వచ్చే డబ్బులతో ఎవరికివారు ఫ్లాట్స్ తీసుకుంటే అందరికీ బావుంటుంది కదా"

"నా పేరుమీద నాన్నగారు వేసిన డబ్బు, నా పేరుమీద వున్న ఇల్లు నేను మీకిస్తానని ఎలా అనుకున్నారు" అడిగింది వైదేహి.

నలుగురూ షాక్‌తిన్నారు. వాళ్లు ఈ సమాధానం వూహించలేదు.

"అదేమిటమ్మా... అలా అంటావు. ఈ ఆస్తి మాక్కాక ఇంకెవరికి యిస్తావు? " రాజారాం ఆశ్చర్యంగా అడిగాడు.

"అది నేను నిర్ణయించుకుంటాను" వైదేహి అంది.

"అంటే ఈ ఆస్తి మాక్కాక ఇంకెవర్కైనా యిస్తావా? మేము కాక, నాన్నగారికి ఇంకా ఎవరైనా పిల్లలున్నారా? "

నలుగురు కొడుకులవైపు కోపంగా చూసింది వైదేహి. నలుగురు చప్పున తలలు దించుకున్నారు.

"బ్యాంకులో వున్న డబ్బు నాన్నగారు నాకోసం వేసిన డబ్బు. మిమ్మల్ని చదివించారు. నలుగురికీ సమంగా వాటాలు వేసి డబ్బు ఇచ్చారు. ఆ డబ్బుతో బిజినెస్‌లు మొదలుపెట్టారు. ఫ్లాట్లు కొనుక్కున్నారు. నిజానికి ఈ ఇల్లు మా జీవిత చరమాంకంలో పనికివస్తుందని మాకోసం కొన్నది.

నేను బతికివున్నన్నిరోజులు ఈ ఇంట్లోనే వుంటాను. నేను చనిపోయాక మీరు పంచుకోవచ్చు లేదా అమ్ముకోవచ్చు.

ఇక బ్యాంకులో వున్న డబ్బు అంటారా? అది నా స్వవిషయం. ఆ డబ్బును ఏదో విధంగా సద్వినియోగమే చేస్తాను"

నలుగురూ బిత్తరపోయారు. కోడళ్లు మొహమొహాలు చూసుకున్నారు.

"అదేమిటమ్మా... అన్ని లక్షల డబ్బు ఏం చేస్తావు? ఈ ఇల్లు ఇప్పుడు అమ్మితే ఏమవుతుంది? మా దగ్గరే నిన్ను ఉంచుకుంటాంగా. ఈ వయసులో"

ఇక మాట్లాడొద్దన్నట్టు వారించి అంది వైదేహి.

"ఎవరి దయాదాక్షిణ్యాలమీద నేను బతకాలని అనుకోవడం లేదురా... బిడ్డలకు తల్లి పట్ల బాధ్యత వుండాలి"

"పిల్లలపట్ల కూడా తల్లికి బాధ్యత వుండాలి" రాజారాం ఉక్రోషంగా అన్నాడు.

"ఉంది కాబట్టి మిమ్మల్ని పెంచి పెద్దచేసి ప్రయోజకుల్ని చేశాం. అందరికి ఆస్తి పంపకాలు కూడా చేశాం"

"అంటే నువ్వు వేరే ఉందామని అనుకుంటున్నావా? "

"లేదు. ఈ ఇంట్లోనే వుంటాను. ఇది నా భర్త నా కోసం కష్టపడి కొనిపెట్టిన ఇల్లు. నేనూ, మీనాన్న శేషజీవితాన్ని ఇక్కడ గడపాలని అనుకున్నాం. ఆ దేవుడు మీ నాన్నను నాకు దూరం చేశాడు.

కనీసం ఆయన జ్ఞాపకాలతోనైన ఈ ఇంట్లో గడుపుతాను. అలాంటి ఈ ఇల్లును అమ్మే ప్రసక్తిలేదు"

"మరి నీ పేరుతో వున్న డబ్బు? "

"మీనాన్న కోరిక తీరేలా సద్వినియోగం చేస్తాను"

"దానధర్మాలు చేస్తావా? " మూర్తి వ్యంగ్యంగా అడిగాడు.

"ధర్మంగా నాకు తోచింది చేస్తాను" చెప్పింది వైదేహి.

ఆ నలుగురికీ ఏం మాట్లాడాలో తోచ లేదు. విసురుగా అక్కడ్నుంచి లేచి వెళ్ళిపో యారు.

వైదేహి తన గదిలోకి వెళ్ళిపోయింది.

★ ★ ★

"అమ్మ ఇలా మాట్లాడుతుందని అనుకో లేదు" రాజారాం అన్నాడు.

"నేనూ ఎక్స్‌పెక్ట్ చేయలేదు. ఆ డబ్బు మన నలుగురికీ పంచుతుందని అనుకు న్నాను" భార్గవ్ అన్నాడు.

"ఇప్పుడేం చేద్దాం. బలవంతంగా లాక్కుంటే సరి" మూర్తి కోపంగా అన్నాడు.

"అమ్మ చదువురానిది కాదు. అదీగాక చిన్నప్పట్నుంచీ అమ్మ మనస్తత్వం తెలి యదా? చాలా పట్టుదలగల మనిషి" సుభాష్ అన్నాడు.

"అయితే ఇప్పుడేం చేద్దాం" భార్గవ సందేహం.

"సహాయనిరాకరణ" మూర్తి అన్నాడు.

"అంటే? " రాజారాం అర్థంగాక అడిగాడు.

"మనం అమ్మతో మాట్లాడ్డం మానేద్దాం. అంటీముట్టనట్టుగా వుండి బాధ పడుతు న్నట్టు నటిద్దాం. దాంతో మన విలువ అమ్మకు తెలిసివస్తుంది" సుభాష్ చెప్పాడు.

ఈ అయిడియా అందరికీ నచ్చింది.

మానవ సంబంధాలను తుంచేసి, ఆర్థిక సంబంధాలకోసం ఆ కొడుకులు తల్లి ప్రేమతో నటన మొదలెట్టారు.

★ ★ ★

వైదేహి అలసటగా కళ్లు మూసుకుంది.

ఆమె మనసు ఒకవిధమైన బాధతో నిండి పోయింది. ఇలాంటి పరిస్థితి ఏదోఓరోజు వస్తుందని ఊహించింది.

భర్త తరుచూ అనేవాడు.

"నేను చనిపోయాక మొదటి కొన్ని రోజులు నిన్ను ప్రేమగా చూసుకుంటారు. ఆ తర్వాత ప్రేమగా నా పేరుమీద వున్న డబ్బు ఇవ్వమంటారు. ఆ తర్వాత అంతే ప్రేమగా నిన్ను వదిలించుకోవాలని ప్రయ త్నిస్తారు.

ఒకవేళ మన పిల్లలు అలా చేయకపోతే అది మన అదృష్టమే. కానీ మన అదృష్టాన్ని నుదిటిమీద ఆ విధాత ఎలా రాశాడో"

భర్త మాటలు ఇప్పుడు నిజమవ్వబోతు న్నాయా? ఆర్థిక సంబంధాలు, మానవ సంబంధాలను కాలరాయబోతున్నాయా?

తనకు డబ్బు మీద వ్యామోహంలేదు. కానీ ఈ డబ్బు తన భర్త జ్ఞాపకంగా మిగి లిపోవాలి. తన దగ్గర వున్న డబ్బు కరిగిపో యేలోగా తన భర్త పేరు మిగిలిపోవాలి.

అలానే నిద్రపోయింది. ఆ మగత నిద్రలో భర్త చిరునవ్వుతో తనని పలకరిస్తు న్నాడు.

ఆ కలత నిద్రలో తనని ఓదారుస్తు న్నాడు.

"బాధపడతున్నావా. నవ్వరా... నువ్వు నిండుగా నవ్వాలిరా. విషాదాన్ని గుండెలో పెట్టుకున్నా నీకు చిర్నవ్వు మాత్రం పెదవు లపైన వుంటుంది కదరా.

మనసారా నవ్వినట్టు నటించే నువ్వు. మనసారా ఏడ్వడానికి కూడా వీలులేదు కదరా.

కానీ నీకో విషయం తెలుసా. నీ ఆలో చన నన్ను నేను మరణించానన్న విష యాన్ని మరిచిపోయేలా చేస్తుంది. నిజంరా. గుండెల చాటున దాచుకున్న నీ విషాదంమీద ఒట్టు.

నాకోసం అనుక్షణం తపిస్తూ నా ఆలోచ నలను నీ మనసులో, నా ప్రతిరూపం నీ కన్నులలో నింపుకున్న నీమీదొట్టు"

కలతలోనుంచి కళ్లు తెరిచి బయటకు వచ్చింది.

అంతా శూన్యం. ఆ శూన్యంలో తన భర్త తనకోసం ఎస్పెషల్లీ తనకోసం బతికివచ్చాడే

మోనన్నట్టు.

వైదేహి కళ్లు అశ్రుపూరితాలయ్యాయి.

'నన్నెందుకయ్యా విడిచి వెళ్ళావు. మూడు ముళ్లు వేయించుకున్నానే. సప్తపదీ నడిచానే. ఆ తర్వాత వేనవేల అడుగులు నీతో నడుస్తూనే వున్నానే.

అలాంటి నన్ను వదిలి, ఒంటరిగా నువ్వెందుకయ్యా వెళ్ళిపోయావు. కన్ను మూసి తెరిచేలోగా మన/ జ్ఞాపకాలు కరిగిపోయాయా?

ఆమె మనసు విషాదమైంది.

కన్నీళ్లు ఘనీభవించాయి.

★ ★ ★

వైదేహి నిద్రలేచింది.

రాత్రి సరిగ్గా నిద్రపోకపోవడంవల్ల కళ్లు ఎర్రబడ్డాయి. వైదేహి సింక్ దగ్గరికి వెళ్ళి చల్లటి నీళ్లతో మొహం కడుక్కుంది.

మామూలుగా అయితే ఈపాటికి పెద్దకోడలు నానా హడావిడిపడుతూ, హైరానా పడిపోతూ అత్తయ్యగారూ బ్రష్ అని ఎదురొచ్చేది.

వైదేహికి పరిస్థితి అర్థమైంది. బాత్రూంలోకి వెళ్ళింది.

స్నానం చేసొచ్చాక, కాఫీ కోసం చూసింది. అయిదు. పది. ఇరవై. ఎవరూ కాఫీ ఇవ్వలేదు. తనే కిచెన్‌లోకి వెళ్ళి కాఫీ కలుపుకుంది.

వైదేహిని చూడగానే కోడళ్లు తలలు తిప్పుకున్నారు. కొడుకులు మాట్లాడ్డంలేదు. తన గదిలోకి వెళ్ళి ఏవో ఫైల్స్ సీరియస్‌గా చూడసాగింది.

సరిగ్గా అప్పుడే సత్యమూర్తి, రాజేశ్వరి వచ్చారు.

"అరెరె... అందరూ ఇక్కడే వున్నారా? బావున్నారా? " అడిగాడు సత్యమూర్తి రాజారాంని, వాళ్ళ అమ్మావాళ్ళని చూస్తూ.

"ఆ... ఏదో బావున్నాంలెండి. మేమెలా వుంటే మాత్రం ఎవరికి పట్టింది? " సాగదీస్తూ అన్నాడు రాజారాం.

"అదేంటి బాబూ అలా అంటావు? " సత్యమూర్తి మనసులో ఏదో అనుమానం.

భార్గవ మెల్లగా రాజారాం చెవిలో.

"అమ్మ మారిపోవడానికి కారణం ఈయనేకాబోలు. ఎంతైనా నాన్నకు ప్రాణస్నేహితుడు కదా. అన్నయ్యా... అన్నయ్యా... అంటూ ఈవిడ వెళ్తుంది. చెల్లెమ్మా, చెల్లెమ్మా అంటూ ఏవో సలహాలు ఇచ్చివుంటాడు" అన్నాడు.

"అంతే అయి వుంటుంది" రాజారాం అన్నాడు మెల్లగానే.

రాజారాం వెళ్లి భార్య చెవిలో ఏదో గొణిగాడు.

నలుగురు అన్నదమ్ములు లోపలకి వెళ్ళిపోయారు.

సత్యమూర్తి మనసు ఒక్కక్షణం బాధతో నిండిపోయింది. తను రాగానే అంకుల్ వచ్చాడంటూ ఎంత సంతోషంగా వుండేవారు.

చిన్నప్పుడు అందరూ తనను చుట్టేసి "అంకుల్ చాక్లెట్" అంటూ అడిగేవాళ్లు. ఎంతలో ఎంతమార్పు.

సత్యమూర్తి గొంతు విని వైదేహి బయటకు వచ్చింది.

"రా... అన్నయ్యా" అంటూ తన గదిలోకి ఆహ్వానించింది.

"అదేమిటి చెల్లెమ్మా... పిల్లలు ముభావంగా వున్నారు"

"నామీద మౌనపోరాటం చేస్తున్నార్లే అన్నయ్యా... పాపం నాకు అన్న అయినందుకు మీమీద కూడా పోరాటం చేస్తున్నారేమో" బాధనిండిన స్వరంతో అంది.

సత్యమూర్తికి విషయం అర్థంకాలేదు.

వైదేహి క్లుప్తంగా నిన్న జరిగిన విషయం చెప్పింది.

"అయ్యో... అలా జరిగిందా? పోనీలె వెధవ ఆస్తి ఇచ్చేయకపోయావా? ఈ వయసులో వాళ్లతో గొడవ ఎందుకు? " సత్యమూర్తికి ఏమనాలో తోచక అన్నాడు.

"పోనీలే అని నేను ఆస్తి ఇచ్చాక, వెళ్ళిపో అమ్మా అని అన్నా ఆశ్చర్యంలేదు. అయినా ఈ ఆస్తిమీద నాకు మమకారం లేదని మీకు తెలియదా అన్నయ్యా" అంది వైదేహి.

"నాకు తెలుసనుకో. పిల్లలకు తెలియాలిగా"

"వాళ్ళకూ తెలుసు. అయినా వాళ్ళు నిద్ర నటించేవాళ్ళు కదన్నయ్యా. నిద్ర నటించేవాళ్ళని ఎవరు మాత్రం నిద్రలేపగలరు?"

"ఇలా ఎన్ని రోజులమ్మా?"

"చూద్దాం... ఒక్కనిముషం. కాఫీ పెట్టుకువస్తాను" అంటూ లేవబోయింది వైదేహి.

"ఇప్పుడేమీ వద్దమ్మా. నువ్వు అడిగిన డిటెయిల్స్ తీసుకువచ్చాను"

వైదేహి వెంటనే...

"ఇప్పుడే విషయాలూ వద్దు. నేనే రేపో, ఎల్లుండో వీలు చూసుకుని వస్తాను" అంది.

"అలాగే నీ ఇష్టం అమ్మా" అంటూ లేచాడు సత్యమూర్తి.

వాళ్ళిద్దర్నీ సాగనంపింది.

ఆమె మనసు చివుక్కుమంది. చాలా కాలం తర్వాత వచ్చిన వాళ్ళని కనీసం వుండమని కూడా అన్లేకపోతోంది తను.

తమలో తమకు ఎన్ని వున్నా వచ్చిన అతిథులను గౌరవించాలన్న ఇంగితం లేని కొడుకులమీద, కోడళ్ళమీద కోపమూ, బాధా రెండూ కలిగాయి.

★ ★ ★

రెండ్రోజులుండి భార్గవ, మూర్తి, సుభాష్ దంపతులు వెళ్ళిపోయారు. వెళ్ళేముందు తల్లితో మాట మాత్రమైనా చెప్పలేదు. వెళ్ళేముందు అన్నయ్యతో గుసగుసలాడారు.

★ ★ ★

రాజారాం, నీలవేణి మాట్లాడడంలేదు. దానికితోడు సూటిపోటి మాటలు ఎక్కువయ్యాయి. ప్రతీదీ దెప్పి పొడుస్తూ మాట్లాడడం మొదలయింది.

ఆరోజు ఉదయం పెరుగు వుందా అని అడిగింది వైదేహి.

"మేమేం లక్షలు, కోట్లు వున్నవాళ్ళం కాదత్తయ్యా. మా మామగారి పేరుమీద వున్న ఆస్తి కూడా మాది కాదాయె" అంది నిష్టూరంగా.

ఒక విషయానికి మరో విషయం సంబంధం లేకుండా మాట్లాడడం నీలవేణికే చేతనవుతుంది. వైదేహి అన్నీ మౌనంగా భరిస్తోంది.

రాజారాం తల్లిని పలకరించి మాట్లాడడం లేదు. అతను మరింత పంతంగా తల్లిని తన మౌనంతో బాధపెట్టదలచుకున్నాడు.

★ ★ ★

వైదేహి సత్యమూర్తి ఇంటికి వెళ్ళేసరికి రాజేశ్వరి అంట్లు తోముతోంది.

రాజేశ్వరి కోడలు కావాలనే పనిమనిషిని మాన్పించింది. అత్తయ్యని పనిమనిషిగా మార్చేసింది. బిల్లులు కట్టడం, తోటపని మామయ్యకు అప్పగించింది. కోడలు మాత్రం క్లబ్బులకూ, సినిమాలకూ వెళ్తుంది.

"రామ్మా" అంటూ ఆహ్వానించాడు సత్యమూర్తి. కుశల ప్రశ్నలయ్యాక...

"ఇంట్లో పరిస్థితి ఎలా వుందమ్మా?" అడిగాడు సత్యమూర్తి.

"ఆ పరిస్థితి మారేది కాదు అన్నయ్యా. అది డబ్బు జబ్బు. దానికి డబ్బే మందు" అంది.

సత్యమూర్తి మౌనంగా వుండిపోయాడు.

"అది సరేగానీ అన్నయ్యా. ఆ సిటీ అవుట్స్కట్స్‌లోని శ్మశానం సంగతి ఏమైంది?"

"ఆ స్థలం ఓ మాజీ జమిందారుది. అతను ఒకప్పుడు బాగా బతికినవాడే. కాలక్రమేణా ఆస్తులు హరించుకుపోయాయి. మిగిలిన కొన్ని అతి ఖరీదైన ఆస్తులు కొడుకులు పంచుకొని తండ్రికి ఆ సిటీ అవతల ఉన్న శ్మశానం ఇచ్చారు. నిజానికి అది పనికిరాని భూమి. దాన్ని ఎవరూ పట్టించుకోకపోవడంతో శ్మశానంగా మారింది. అనాథ శవాలను అక్కడ దహనం చేయడం, పాతిపెట్టడం చేస్తారు. దానికి శ్మశానమని పేరు

సార్థకమైంది.

ఆ స్థలాన్ని కొనడానికి ఎవరూ ముందుకు రావడంలేదు. చాలామంది శ్మశానం అనగానే భయపడి పోతున్నారు. ఆ జమిందారుగారికి వున్న ఆస్తి ఇదొక్కటే. పిల్లలు కూడా ఆయన్ని ఇంట్లోనుంచి వెళ్ళగొట్టారట. ఓ మామూలు హోటల్‌లో చిన్నపాటి గదిలో ప్రస్తుతం వుంటున్నాడు" డిటైల్డ్‌గా చెప్పుకొచ్చాడు.

ఓ నిట్టూర్పు విడిచి అంది వైదేహి.

"ఈ ప్రపంచంలో అన్ని విషాదాలూ ఒక్కటే. చాలామంది తల్లితండ్రుల బాధలకు మూలం పిల్లలే. ఆ పిల్లలూ రేపు వృద్ధులయ్యాక ఇదే పరిస్థితి పునరావృతం అవుతుందని అప్పుడుగానీ తెలిసిరాదు"

భారంగా నిట్టూర్చాడు సత్యమూర్తి.

'అవును తను అనుభవిస్తూనే వున్నాడు' అనుకున్నాడు మనసులో.

"అన్నయ్యా మనం రేపే వెళ్ళి ఆ జమిందారుని కలుద్దాం. ఆ స్థలం మనం కొంటున్నాం" వైదేహి స్థిరంగా చెప్పింది.

"ఆ స్థలమా... వద్దమ్మా. ఆ శ్మశానం ఎందుకూ పనికిరాదు"

"ఒకవిధంగా ఆ శ్మశానమే ప్రశాంతమైన స్థలం అన్నయ్యా. అక్కడ మరణించిన వారి ఆత్మలు ప్రశాంతంగా నిద్రపోతూ వుంటాయి;

"అక్కడి సమాధులకు రాగద్వేషాలు వుండవు. ఈర్ష్యాసూయలూ వుండవు. పాశాలు తెంచుకుని బంధాలు వదిలేసి హాయిగా వుంటాయక్కడ"

"ఏమోనమ్మా... నువ్వు సాహసం చేస్తున్నావని అనిపిస్తోంది"

"తప్పదు అన్నయ్యా. ఓ మంచిపని కోసం ఈ మాత్రం సాహసం చేయాలి. నీవు సిద్ధంగా ఉండు అన్నయ్యా. నేను రేపు ఉదయం వస్తాను" అంది వైదేహి.

★ ★ ★

ఇంట్లో పరిస్థితి విషమిస్తోందని అర్థమయ్యింది వైదేహికి. ఈ పరిస్థితి ఎక్కడికి దారితీస్తుందో ఊహించగలదు. ఆరోజు ఉదయమే ఫోన్ వచ్చింది. అది ఎస్.టి.డి. రింగ్ అని అర్థమయ్యింది. బహుశా అమిత నుంచే ఆ ఫోన్ అయి ఉండచ్చు వైదేహి మనసు లాగుతోంది.

మనవరాలితో మాట్లాడాలని ఆమె మనసు ఉవ్విళ్ళూరుతోంది. గబగబా ఫోన్ దగ్గరకు వెళ్ళింది. అప్పటికే రాజారాం కూతురితో మాట్లాడుతున్నాడు. అవతలి వైపు బామ్మ గురించి అడిగినట్లుంది.

"బామ్మా... మనకు ఆవిడ గుర్తుంటుంది కానీ, ఆవిడకు మనం గుర్తు వుండమమ్మా. కొడుకులకన్నా, మనవరాళ్ళకన్నా ఆవిడకు డబ్బే ముఖ్యం. మమ్మీతో మాట్లాడు" అంటూ ఫోన్ భార్యకు ఇచ్చాడు.

"అమ్మా... ఫోన్ ముందు బామ్మకు ఇవ్వు. నేను రాసే ఏ లెటర్‌కూ బామ్మ సమాధానం ఇవ్వడంలేదు. నాన్నేంటి అలా మాట్లాడ్తాడు" అటువైపునుంచి అమిత అడుగుతోంది.

"సరే ఎప్పుడొస్తున్నావు? " అడిగింది నీలవేణి.

"ముందు బామ్మకు ఫోన్ ఇవ్వవే" అమిత చికాగ్గా అంది.

"ఉంటాను" అంటూ ఫోన్ పెట్టేసింది నీలవేణి.

వైదేహి మనసు చివుక్కుమంది. తనకు అమిత అంటే ఎంత ప్రేమో అందరికీ తెలుసు. తన ఒళ్ళోనే పెరిగింది. తన గుండెలమీద ఆడుకుంది. అలాంటి అమితతో మాట్లాడించడానికి మనసు ఒప్పడంలేదు కొడుక్కీ కోడలికీ.

మళ్ళీ ఫోన్ రింగయ్యింది.

రాజారాం ఫోన్ ఎత్తాడు. అటువైపు నుంచి అమిత.

"నాన్నా... అమ్మేంటి ఫోన్ బామ్మకు ఇవ్వమంటే పెట్టేసింది" కోపంగా అడిగింది అమిత.

"లేదు... బామ్మ బయటకు వెళ్ళింది" ముక్తసరిగా మాట్లాడాడు రాజారాం.

"ఇంత పొద్దున్నా? ఎక్కడికి వెళ్ళింది? తాతయ్య ఎలా వున్నాడు? "

"బయటకు వెళ్ళారని చెప్పాగా? నువ్వెప్పు డొస్తున్నావు? " అడిగాడు రాజారాం.

"మరో వారం రోజుల్లో వస్తున్నాను" అంది అమిత.

"సరే... వచ్చేముందు ఫోన్ చేయి స్టేష న్‌కు వస్తాను" అని ఫోన్ పెట్టేశాడు రాజారాం.

వైదేహి అదంతా వింటూనే ఉంది. ఆమెకు మరో విషయం కూడా అర్థమైంది. తన భర్త చనిపోయిన విషయం కూడా అమితకు చెప్పలేదన్న విషయం అది.

★ ★ ★

అది అతి చవుకబారు హోటల్. అందులో చిన్నచిన్న కేబిన్స్‌లాంటి ఇరుకు గదులున్నాయి. ఆ హోటల్‌లో ఒకప్పటి జమిందారు ప్రస్తుతం ఒక చిన్న గదిలో ఉంటున్నాడు. వైదేహి సత్యమూర్తిని తీసు కుని హోటల్‌లోకి అడుగుపెట్టింది.

హోటల్ మేనేజర్ వాళ్ళవైపు విచిత్రంగా చూశాడు. తమలాంటి చిన్న హోటల్‌కి ఖరీ దైన మనుషులు రావడం అతని చూపుల్లో ఆంతర్యాన్ని పసిగట్టి సత్యమూర్తి,

"భూపతివర్మగారు ఏ గదిలో వున్నారు? " అనడిగాడు.

మేనేజర్‌కు సగం అర్థమయ్యింది. వెంటనే గది నంబర్ చెప్పాడు.

ఆ హోటల్‌ని చూస్తుంటే తెలుస్తుంది దాని వాలకం ఏమిటో. సీలింగ్‌కి వేలాడు తున్న ఫ్యాన్లు పెద్ద శబ్దంతో తిరుగుతు న్నాయి. అవి ఏ క్షణంలో ఊడి పడతాయో అన్నట్లున్నాయి. చిన్నచిన్న అగ్గిపెట్టెల్లాంటి గదులు.

నేలమీద పరిచిన బండలు పాతకాలంనా టివి. గది గోడలు పెచ్చులూడిపోయాయి.

ఓ గది ముందాగి చిన్నగా తలుపు తట్టాడు. రెండు క్షణాల అనంతరం తలుపు తెరుచుకుంది. దాదాపు అరవై ఏళ్ళ వయ స్సున్న వృద్ధుడు తలుపు తెరిచాడు. తెల్లని తెలుపు, మాసిన గడ్డం, రాచరికం ఉట్టిపడు తోన్న అతని మొహంలో నీరసం వయసు తాలూకు కన్నా మానసికమైన వేదన తాలూకు ముడతలు పడ్డ శరీరం.

వైదేహి, సత్యమూర్తి చేతులు జోడిం చారు. జమిందారు భూపతివర్మ పక్కకు తప్పుకొని వాళ్ళకు దారి ఇచ్చాడు. చాలా ఇరుకైన గది.

ఒక రేకు కుర్చీ వుంది. ఇనుప మంచం... ప్లాస్టిక్ జగ్, పెద్ద శబ్దంతో తిరిగే ఫ్యాన్.

కూచోండి అన్నాడు గంభీరంగా.

"నా పేరు సత్యమూర్తి. ఈవిడ నా చెల్లెలు వైదేహి. సిటీ అవుట్‌స్కట్‌లో వున్న స్థలాన్ని కొనుగోలు చేయాలని వచ్చాం" విషయాన్ని క్లుప్తంగా చెప్పాడు సత్యమూర్తి.

భూపతివర్మ కన్నుల్లో ఆశ్చర్యం... "ఆ స్థలమా? అది శ్మశానం. ఇంతవరకూ దాన్ని కొనడానికి ఎవరూ రాలేదు"

"ఆ విషయం తెలుసండీ" అంది వైదేహి.

"తెలుసా... తెలిసే ఆ స్థలం కొనాలని అనుకుంటున్నారా? "

"అవును" చెప్పింది వైదేహి.

"ఆ స్థలం ఎందుకూ పనికిరాదు. అది నివాసయోగ్యం కాదు. ఫ్యాక్టరీలకూ అనుకూ లంగా వుండదు. పైగా అక్కడ సమాధులు, అస్థిపంజరాలు తప్ప ఏమీ వుండవు"

"అన్నీ తెలుసు. అయినా ఎవరైనా తమ స్థలం గురించి గొప్పగా చెప్పుకుంటారు మీరేమిటి? " సత్యమూర్తి అన్నాడు వుండబ ట్టలేక.

"నిజమే... కానీ నాకు నిజం చెప్పడం మాత్రమే అలవాటు. ఆ తర్వాత ఈ భూప తివర్మను తిట్టుకోవడం భరించలేను"

"మీ నిజాయితీ మాకు నచ్చింది. మీ స్థలం ఎంతకు అమ్ముతారో చెప్పండి" అంది

వైదేహి.

ఒక్కక్షణం మౌనంగా వుండిపోయి ఆ తర్వాత "నిజం చెప్పాలంటే ఆ స్థలానికి ఇంత డబ్బు ఇమ్మని డిమాండ్ చేసే పరిస్థితిలో లేను. స్థలం ఏమాత్రం ఖరీదు చేయదు. ఖరీదు చేసేదైతే నా పిల్లలు అది నాకు మిగిల్చేవారేకాదు" అన్నాడు నిర్లిప్తంగా.

"మా దృష్టిలో ఆ స్థలం విలువైనది. ఓ పుణ్యకార్యానికి పనికివచ్చేది" అంది వైదేహి.

"పుణ్యకార్యమా? "

"అవును. అక్కడో వృద్ధాశ్రమం నిర్మించాలని నా కోరిక"

"వృద్ధాశ్రమమా? " విస్మయంగా అడిగాడు భూపతివర్మ.

"అవును. నిస్సహాయులకు, పిల్లల నిరాదరణకు గురైనవాళ్ళకు పనికివచ్చే ఆశ్రమం. వృద్ధుల్లోని నిరాశా, నిస్పృహలను పారదోలి ప్రేమ రాహిత్యంగా కృశించిపోయే వృద్ధులకు ప్రేమను పంచి వాళ్ళలో నూతనోత్తేజాన్ని నింపడానికి"

"మీ ఆశయం చాలా మంచిది" అన్నాడు మనస్ఫూర్తిగా భూపతివర్మ.

"ఇప్పుడు చెప్పండి. ఆ స్థలానికి మీరు ఎంత అనుకుంటున్నారు"

"చూడమ్మా. నిన్ను చూస్తుంటే చనిపోయిన నా కూతురు గుర్తొస్తోంది. ఒక మాట చెప్పనా? "

"చెప్పండి" అంది వైదేహి.

"ఆ స్థలం మీకు ఉచితంగా యిస్తాను. కానీ ఒక్క షరతు"

"ఏమిటా షరతు? "

"నన్ను మీ వృద్ధశరణాలయంలో చేర్చుకొండి. ఈ శరీరంలో ప్రాణం ఉండడానికి రెండు పూటలా తిండి పెట్టకపోయిన ఫర్లేదు. కానీ అప్పుడప్పుడు ఆప్యాయంగా నాన్నా అని పిలవాలి"

ఒక్కక్షణం వైదేహి గుండె చెమర్చింది. అప్పుడే వైదేహికి అర్థమైంది. కళ్లే కాదు. మనసూ కన్నీళ్లు కారుస్తుందని.

"అవును తల్లీ ఒకప్పటి వైభవం ఈరోజు శిథిలమైంది.

"ఒకప్పుడు నా దర్జా ఇప్పుడు దాస్యం చేయమంటోంది.

"ఒకప్పుడు రాజఠీవి ఇప్పుడు కళావిహీనమైంది. ఆస్తులు, ఆభరణాలు, భవంతులు, అన్నీ... అన్నీ వుండి కూడా ఇదిగో ఇలాంటి గదిలో వున్నాను.

నా అతిథులకు సకల మర్యాదలు జరిగేవి ఒకప్పుడు. కానీ ఇప్పుడు కప్పు టీ కూడా ఇవ్వలేని దౌర్భగ్యుడిని.

ఆ దేవుడు మనుష్యుల తలరాతలు రాస్తాడని అంటారు. అది ఎంతవరకు నిజమో నాకు తెలియదు కానీ వృద్ధాప్యంలో తల్లిదండ్రుల తలరాతలను కొడుకులు, కోడళ్లు రాస్తారు. నా బిడ్డలు నన్ను సగౌరవంగా బయటకు గెంటేశారు.

సకల రాజతాంబూలాలతో నన్ను వీధిన పడేశారు. శ్మశానం పనికిరాదని అరిష్టమని, ఆ శ్మశాన స్థలాన్ని నాకు ధారాదత్తం చేసి తమ ఔదార్యాన్ని చాటుకున్నారు.

నా భార్య చనిపోయాక బిడ్డలు సవతితల్లి బారిన పడకూడదని పెళ్ళిచేసుకోలేదు. నా జీవితమంతా వాళ్ల భవిష్యత్తు కోసమే ఖర్చుచేశాను.

కానీ ఈ వయసులో వాళ్లు విధించిన శిక్ష ఎంత దారుణంగా వుందో చూశారా? " అతని కళ్లు కన్నీళ్లని ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

"మీలాంటి పెద్దవాళ్లు నిబ్బరాన్ని కోల్పోకూడదు. ఈ ప్రపంచంలో కొడుకులందరూ చెడ్డవాళ్లు కాదు. మంచి కొడుకులు ఎక్కడో వున్నారు. అత్తని అమ్మలా చూసుకునే కోడళ్లూ వున్నారు.

వృద్ధాప్యంలో తల్లిదండ్రులను నిర్దాక్షిణ్యంగా బయటకు గెంటేసిన పిల్లలు ఏదో ఓరోజు తమకు తమ బిడ్డలద్వారా అలాంటి పరిస్థితి వస్తుందని వూహించరు" అంది

వైదేహి.

భూపతివర్మ మౌనంగా వుండిపోయాడు.

"చూడండి భూపతివర్మగారు. మీరో నిర్ణయానికి వచ్చాక కబురుచేసినా సరే ఆ స్థలం విషయం..."

"నేను మనస్ఫూర్తిగా చెబుతున్నాను. ఆ స్థలానికి నాకు ఖరీదు అక్కర్లేదు. మీరు చేసే సేవలో నాకూ ఓ అవకాశం ఇవ్వండి. నన్ను మీ కార్యక్రమంలో పాలుపంచుకోనీయండి" మనస్ఫూర్తిగా అన్నాడు భూపతివర్మ.

వైదేహికి ఇప్పుడు తృప్తిగా వుంది.



వెంటనే బ్యాగులో నుంచి వంద రూపాయల నోట్లకట్ట ఒకటి తీసి భూపతివర్మ చేతిలో పెట్టింది.

"ఇది ఉంచండి. మీరు వద్దన్నా నేను ఎంతో కొంత మీ స్థలానికి యిస్తాను. లేదా మీ పేరుమీద డిపాజిట్ చేస్తాను. త్వరలో మనం అక్కడ ఓ ఆశ్రమాన్ని కట్టించబోతున్నాం. ఆ ఆశ్రమం పేరు "ఈ వేకువ మీకోసం"

"చాలా చక్కని పేరు" అన్నాడు భూపతివర్మ.

"మాకు సెలవిప్పించండి. మనం ఒకట్రెండురోజుల్లో కలుసుకుందాం" సత్యమూర్తి అన్నాడు.

"అలాగే" అన్నట్టు లేచాడు భూపతివర్మ.

అతనికిప్పుడు ఆనందంగా వుంది. ఏరులో కొట్టుకుపోయే జీవికి చిన్న గడ్డిపోచే ఆధారం అయినట్టు అతనికిప్పుడు వాళ్ల ఆసరా గొప్ప స్థయిరాన్ని ఇచ్చింది.

"పాపం బాగా బతికి చితికిపోయాడు కదూ" అన్నాడు సత్యమూర్తి వైదేహితో.

వాళ్ళిద్దరూ ఆ హోటల్ నుంచి బయట పడ్డారు. దగ్గర్లో వున్న ఓ హోటల్‌కు వెళ్ళారు. జ్యూస్ ఆర్డర్ చేసింది వైదేహి.

"ఇప్పుడెందుకమ్మా... ఎలానూ ఇంటికి వెళ్తున్నాం కదా" అన్నాడు సత్యమూర్తి.

"ఫర్లేదులే అన్నయ్యా" అంది వైదేహి.

తను ఇంటికి వెళ్ళాక తన కోసం అన్నం కూడా వుంచరని అర్థమైంది వైదేహికి.

ఈమధ్య కొత్తరకం నిరసన మొదలైంది. తను వెళ్లేసరికి ఖాళీగిన్నెలు వెక్కిరిస్తున్నాయి. ఎందుకో చాలా బాధేసింది వైదేహికి.

ఇది ఒకవిధమైన బెదిరింపులాంటిది. కన్నతల్లిని ఆకలితో మాడ్చడమా? ఆ వూహే ఆమెకు ఇబ్బందిగా వుంది. అందుకని జ్యూస్ ఆర్డర్ చేసింది.

జ్యూస్ వచ్చాక స్ట్రాతో సిప్ చేస్తూ "అన్నయ్యా సాధ్యమైనంత తొందరలో మన పని మొదలుపెట్టాలి. ముందు ఆ ప్రాంతాన్ని చదునుచేయాలి. ఓ పక్క కొంత స్థలాన్ని శ్మశానంగా ఉపయోగిద్దాం"

"శ్మశానంగానా? " సత్యమూర్తి గొంతులో విస్మయం.

"ఇప్పటివరకూ అనాథశవాలకు ఆ శ్మశానం ఉపయోగపడింది. శ్మశానాన్ని మించిన ప్రశాంతత యింక ఎక్కడుంటుంది"

నవ్వుతూ అంది వైదేహి.

ఆమె నవ్వు వెనక వున్న విషాదం అర్థ మైంది సత్యమూర్తికి.

"అలాగేనమ్మా" అన్నాడు.

బిల్లు ఇచ్చి బయటకు నడిచారు.

"నిన్ను ఇంటిదగ్గర దింపి నేను వెళ్తాను" అంది అటుగా వెళ్తున్న ఆటోని పిలిచి వైదేహి.

★ ★ ★

న్యూఢిల్లీ

లోకల్ ట్రయిన్‌లో వుంది అమిత.

ట్రయిన్ ప్లాట్‌ఫామ్ విడిచి ముందుకు కదిలింది. మహిళల సంఖ్య చాలా తక్కువగా వుంది. ఆ కంపార్ట్‌మెంట్‌లో ఆ టైంలో మామూలుగా చాలా రద్దీగా వుండాలి. కానీ ఆ రద్దీ కంపార్ట్‌మెంట్‌లో కనిపించడంలేదు.

అమిత కాలేజీ అమ్మాయిలా తయారైంది. ఓ చేతిలో బుక్స్ మరో చేతిలో హేండ్‌బ్యాగ్.

ఫ్రెష్‌గా అప్పుడే కాలేజీలో జాయినవ్వడానికి వెళ్తుందా అన్నట్టు వుంది.

సీట్లు ఖాళీగా వున్నాయి. లోకల్ ట్రైన్స్‌లో రద్దీగా వుంటుందని తెలుసు. కానీ అందుకు విరుద్ధంగా ఇలా ఎందుకున్నట్టు?

ఇంతలో ఆ కంపార్ట్‌మెంట్‌లోకి కొంత మంది వచ్చి ఎక్కారు. వాళ్ల వాలకం చూస్తేనే తెలుస్తోంది రోడ్డుపైన రోమియోలని. కొందరు గంజాయి దమ్ము కొడుతున్నారు. ఆ కంపార్ట్‌మెంట్‌లో ముగ్గురు మహిళలున్నారు. అమితతో కలిసి మగాళ్లు ఓ పదిమంది వరకు వుండొచ్చు.

ఆ పోకిరులు అమిత దగ్గరికి వచ్చారు.

"ఎక్కడకి వెళ్తున్నావు పోరి? " అడిగాడా వ్యక్తి.

అమిత మాట్లాడలేదు.

"అదేంటి పాపా. మాటలు రావా... హిందీ రాదా? పోనీ ఏ భాష వచ్చు? " హిందీలో అన్నాడావ్యక్తి.

"నీకనవసరం" హిందీలోనే అంది అమిత.

"అబ్బా" అంటు ఆమెను రాసుకుంటూ ముందుకు వెళ్లాడు. అమిత కోపంగా చూసింది అతడివంక.

మరోవ్యక్తి వచ్చి అమిత ఎదురుగా నిలబడి గంజాయి దమ్ము కొట్టసాగాడు.

అమిత ముందుకు వెళ్ళి ఓ సీటులో కూచుంది.

"అనవసరంగా ఆ రౌడీ వెధవలతో పెట్టుకోవద్దమ్మాయ్. మేమూ బుద్ధి తక్కువై ఈ ట్రయిన్‌లో వచ్చాం" అంది పక్క సీటావిడ.

"అదేమిటండీ" అడిగింది అమిత.

"ఈ టైంలో కాలేజీ అమ్మాయిలు, ఉద్యోగంచేసే లేడీస్ ఇదే ట్రెయిన్ ప్రిఫర్ చేస్తారు. ఆఫీసు టైంకు, కాలేజీ టైంకు వెళ్లే లోకల్ ట్రెయిన్ ఇదొక్కటే"

"అయితే? " అమిత అర్థంగాక అడిగింది.

"ఈ ట్రెయిన్‌లో అమ్మాయిలే ఎక్కుతారని తెలిసి పోకిరీలు ఎక్కుతారు. ఏదో వంకతో మీదమీద పడతారు. వెకిలిగా మాట్లాడతారు" అందావిడ.

"మరి పోలీస్ కంప్లయింట్ ఇవ్వకపోయారా" అమిత అంది.

ఆ మహిళ అమితవైపు అదోలా చూసి "ఏమని యిస్తాం? అలా చేస్తే రేపట్నుంచి ఈ రైలులో ఎలా వస్తాం లేనిపోని గొడవలు"

"అందుకని యిలానే భరిస్తారా? "

"అందుకే ఈ ట్రయిన్ కన్నా ముందు వుండే ట్రయిన్‌లో వెళ్తాం. కాకపోతే అది చాలా ముందు వెళ్తుంది. ఎర్లీగా ఇళ్లలో నుంచి బయటపడాలి. అయినా తప్పదు. ఇవ్వాళ పని తెమలనందున ఈ ట్రెయిన్‌లో రావాల్సి వచ్చింది" చెప్పిందావిడ.

అప్పుడర్థమైంది అమితకు. అంటే కేవలం ఈ లోకల్ ట్రయిన్‌లోనే పోకిరీలు ఎక్కువగా వుంటారు.

మహిళలు, కాలేజీ అమ్మాయిలకు ఈ ట్రెయిన్ సౌకర్యవంతంగా వుంటుంది.

అయినా పోకిరీల బెడదవల్ల కిక్కిరిసిన ట్రెయిన్‌లో వెళ్తున్నారు.

నెక్స్ట్ స్టేషన్‌లో ట్రెయిన్ ఆగింది. అక్కడ దిగి మరో కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కింది. అందులోనూ ప్రయాణికులు పలుచగానే వున్నారు. ఉద్యోగినులు, కాలేజీ అమ్మాయిల సంఖ్య చాలా తక్కువగా వుంది.

★ ★ ★

సాయంత్రం అయింది.

అమితకు చాలా అలసటగా వుంది. ఉదయం నుంచి సాయంత్రం వరకూ లోకల్ ట్రెయిన్స్‌లో స్టేషన్సు మారుతూ వుంది. ఫ్లాట్‌ఫామ్‌మీద ప్రయాణికుల ఒపీనియన్ తీసుకుంది.

బస్టాప్‌ల్లోనే కాదు లోకల్ ట్రెయిన్స్ లోనూ ఈ పోకిరీల బెడద తప్పడంలేదు. అమ్మాయిలను ఏడిపించే ఈ జబ్బు కొందరి మగవాళ్లలో ఎప్పుడు పోతుందో? అని అనిపించింది.

బాగా అలిసిపోయిన ఫీలింగ్. రూమ్‌కు కూడా వెళ్ళాలని అనిపించలేదు. ఓ తెలుగు రెస్టారెంట్‌కు వెళ్ళింది. చల్లటి నీళ్లతో మొహం కడుక్కున్నాక ప్రాణం లేచివచ్చినట్టు అనిపించింది. స్టేషన్‌లలో టిఫిన్స్ చేశాక టిఫిన్లమీది విరక్తి కలిగింది.

"ఏం కావాలి మేడమ్? " వెయిటర్ వచ్చి అడిగాడు.

"ఆనియన్ దోశ" చెప్పింది అమిత.

అయిదు నిమిషాల్లో వేడిగా ఆనియన్ దోశ తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.

గబగబా అయిదు నిమిషాల్లో తినేసింది.

ఆ రుచికి ప్రాణం లేచి వచ్చినట్టు అనిపించింది. దోశ తిని వేడి కాఫీ తాగాక ఉత్సాహం తిరిగి వచ్చింది.

అప్పటికే చీకటిపడుతోంది. చల్లగాలి రివ్వున వీస్తోంది. ఆ చల్లగాలిలో ఆటో కూడా ఎక్కాలని అనిపించలేదు. నడుచుకుంటూ వెళ్తోంది.

ఢిల్లీ అందాలు ఆమెను ఉత్సాహపరుస్తున్నాయి. కార్లు, స్కూటర్లు, బస్సులు రోడ్డు మీద వెళ్తూనే వున్నాయి. పెద్ద పెద్ద షాపులు, ఛాట్ బండార్‌లు, హోటళ్లు ఢిల్లీ నగరానికి కొత్త అందాన్నిస్తున్నాయి.

ఆమె అలా నడుస్తూ వుండగానే హలో అన్న పిలుపు వినిపించింది. తల తిప్పి చూసింది. ఇన్‌స్పెక్టర్ నితిన్.

"మీరా" అంది ఆశ్చర్యంగా అమిత.

"నేను కాకుండా నా బదులు డూప్ రావడానికి నేను సినిమా హీరోని కాదుకదండీ" అన్నాడు నితిన్.

"అఫ్‌కోర్స్... అయినా మీ వాహనమేది. ఎప్పుడూ సైరన్ కొడుతూ వస్తుంది కదా జీప్" అంది నవ్వుతూ.

"ఇది మరీ అన్యాయమండీ."

"ఏది అన్యాయం, సినిమాల్లో దొంగల్ని పట్టుకునేప్పుడు మేము వస్తున్నామహో అని చెప్పి మరీ వస్తారు"

"సినిమాలను చూసి మమ్మల్ని అలా అనడమే అన్యాయం అంటున్నాం. దొంగలను పట్టుకునేప్పుడు సైరన్ మోగిస్తూ ఎందుకు వెళ్తాం. సినిమా పోలీసులకు, మాకు బోల్డు తేడా వుంటుంది" అన్నాడు నితిన్.

"ఓ.కె. ఓ.కె. మీరు సిన్సియర్ పోలీసులు అని ఒప్పుకుంటాను. సరేనా"

"హమ్మయ్య... అది చాలులెండి. అన్నట్టు ఏంటీ కాలినడకన బయల్దేరారు. పాదయాత్ర చేస్తున్నారా? "

నవ్వింది అమిత. అలానే అమితను చూస్తుండిపోయాడు. నవ్వితే అమితలో అతనికి కొత్త అందాలు కనిపిస్తున్నాయి.

"హ...లో" అంది అమిత. నితిన్ తేరుకొని,

"చెప్పండి" అన్నాడు.

"ఇంతకూ మీ జీపు ఎక్కడ? "

"జీపులోనే బయల్దేరాను. ఆ రోడ్డుకు అటువైపు వున్న మిమ్మల్ని చూసి, జీపును పంపించి, నేను పాదయాత్ర మొదలెట్టి

వచ్చాను" అన్నాడు నితిన్.

"వెరీగుడ్. కానీ మీరు నా పక్కన ఇలా నడవడం బావోదు" అంది అమిత.

దెబ్బతిన్నట్టు చూశాడు "సారీ" అన్నాడు అతను మరేదో అనుకొని.

"ఎంత క్లోజ్ ఫ్రెండ్ అయినా సరే పోలీసుల పక్కన నడిస్తే నేను దొంగనేమో అనుకుంటారు" అంది నవ్వుతూ.

"ఓహ్ అదా" నితిన్ మనసు తేలికపడింది.

"మరింకేమిటనుకున్నారు? " అడిగింది అమిత.

"ఏదో అనుకున్నాలెండి... మీకు అభ్యంతరం లేకపోతే అలా వెళ్లి కాఫీ తాగుదామా? "

ఈసారి ఫక్కున నవ్వింది అమిత.

"అదేమిటండి అలా నవ్వుతారు. కాఫీ తాగుదామా అంటే అంత నవ్వు ఎందుకొచ్చింది"

"చాలా నవలల్లో హీరోహీరోయిన్లుగానీ ఫ్రెండ్స్‌గానీ కలుసుకున్నప్పుడు...

అలా వెళ్లి కాఫీ తాగుదామా అని అడుగుతారు. రైటర్స్ ఎక్కువగా ఇలాని రాస్తారు" అంది అమిత.

"బహుశా మనలాంటి వాళ్లని చూసి వాళ్లకు ఇలాంటి ఐడియా వచ్చి వుంటుంది" అన్నాడు నితిన్.

"వాళ్ల ఓన్ ఎక్స్‌పీరియన్స్ కూడా అయి వుండొచ్చుకదా" అంది అమిత.

"అఫ్‌కోర్స్... ఇంతకీ కాఫీ విషయం తేల్చలేదు"

"ఇప్పుడే కాఫీ తాగి హాయిగా ఇలా చల్లగాలిలో బయలుదేరాను" అంది అమిత.

"మీలా అందంగా మాట్లాడ్డం చేతకాదు నాకు" సిన్సియర్‌గా అన్నాడు నితిన్.

"మనసు అందంగా వుంచడానికి ప్రయత్నించాలి అది చాలు" అంది అమిత.

నితిన్ మాట్లాడలేదు. అమిత ఏం మాట్లాడినా కరక్ట్‌గా మాట్లాడుతుంది. సెకండ్ క్వశ్చన్‌కు ఛాన్స్ ఇవ్వదు.

"నేనిప్పుడే కాఫీ తాగొచ్చాను. మీరు తప్పదంటే ఓకే. మీకు కాస్త కంపెనీ ఇస్తాను. బట్ వన్ కండీషన్" అంది అమిత.

"ఏమిటది... బిల్ మీరే పే చేస్తారా? " అడిగాడు నితిన్.

"ఊహు మీరే ఆఫర్ చేశారు కాబట్టి మీరే పే చేయడం బావుంటుంది" నిర్మొహమాటంగా అంది అమిత.

"మరి ఏమిటా కండీషన్" అర్థంగాక అడిగాడు నితిన్.

"మరోసారి మీరిలా యూనిఫాంలో వచ్చి నన్ను హోటల్‌కు రమ్మనకండి. మీతోపాటు ఇలా వస్తే మీరు పోలీసాఫీసర్, నేను ఖైదీని అనుకుంటారు" అంది అమిత.

మనస్ఫూర్తిగా నవ్వి అన్నాడు నితిన్ "డెఫెనిట్‌గా ఈసారి యూనిఫాంలో రాను ఇట్స్‌మై సిన్సియర్ ప్రామిస్"

"చెప్పండి మీ ప్రొఫెషన్ ఎలా వుంది? " అడిగాడు కాఫీ సిప్ చేస్తూ నితిన్.

"నాకిష్టమైన ప్రొఫెషన్ ఎంత కష్టంగా వున్నా బాగానే వుంటుంది" అంది అమిత.

"అన్నట్టు మొన్న బస్టాప్‌లో అమ్మాయిలను అల్లరి పెట్టే రౌడీల గురించి రాసిన ఆర్టికల్ చాలా బావుంది. అందులో నా గురించి కూడా బాగా రాశారు. థాంక్యూ... కమీషనర్ గారు కూడా ప్రత్యేకంగా అప్రిషియేట్ చేశారు. క్రెడిట్ గోస్ టుయు" అన్నాడు నితిన్.

"అందులో నా క్రెడిట్ ఏమీలేదు. నిజం చెప్పాలంటే ఆ క్రెడిట్ మీది. నేను ప్లాన్ చెప్పగానే వెంటనే స్పందించి నేను చెప్పినట్టు సహకరించారు. మా ఎడిటర్‌గారు కూడా ఈ విషయంలో నన్ను ప్రత్యేకంగా అభినందించారు. ప్రెస్ ఎంత చేసినా మీలాంటి సిన్సియర్ ఆఫీసర్ల సహకారం ఉంటేనే మరింత ఉపయోగకరంగా ఉంటుంది" సిన్సియర్‌గా అంది అమిత.

"మీ నెక్స్‌ట్ టార్గెట్ ఏమిటి? అడిగాడు

నితిన్.

"టార్గెట్ ఏమీ లేదుగానీ ఇవ్వాళ ఉదయమే లోకల్ ట్రయిన్‌లో వెళ్లొచ్చాను. వాటిమీద ఆర్టికల్ తయారుచేస్తున్నాను" అంది ఉదయం జరిగిన యాక్సిడెంట్స్ అన్నీ వరసగా చెబుతూ.

"బావుంది. మీరు చాలా చిన్నచిన్న విషయాలను బాగా ఎనలైస్ చేస్తారు" మెచ్చుకోలుగా అన్నాడు నితిన్.

"చాలా చిన్నగా కనిపించే విషయాలే పెద్ద ప్రాబ్లమ్స్‌ని క్రియేట్ చేస్తాయి. మీకు తెలుసో లేదో చాలామంది రౌడీ ఎంప్లాయిస్ కేవలం లోకల్ ట్రయిన్స్‌లో అమ్మాయిలను ఏడ్పించి పోకిరీలకు భయపడి అరగంట ముందే బయల్దేరుతున్నారు. లేదా బస్సులో వెళ్తున్నారు. ఏ ట్రయిన్‌లో ఎక్కువగా మహిళలు వుంటారో తెలుసుకొని ఆ ట్రయిన్‌లో ఎక్కుతారు రౌడీలు"

"గుడ్ ఎనాలిసిస్. ఇవన్నీ చాలా చిన్నగా కనిపించే పెద్ద ప్రాబ్లమ్స్" అన్నాడు నితిన్.

"అందుకే లోకల్ ట్రయిన్స్‌లో మహిళలు ముఖ్యంగా ఉద్యోగినులు ఎదుర్కొనే ప్రాబ్లమ్స్ మీదే స్పెషల్ న్యూస్ ఐటమ్ తయారు చేస్తున్నాను" అంది.

"వెరీగుడ్, మీ ప్రొఫెషన్‌లో యాజె ఫ్రెండ్‌గా లేదా రియాజే పోలీస్ ఆఫీసర్‌గా మీకే హెల్ప్ కావాలన్నా నన్ను అడగండి- ఐ విల్ డు మై లెవల్ బెస్ట్" చెప్పాడు నితిన్.

"థాంక్యూ ఇక వెళ్దామా? " అంది లేస్తూ అమిత.

నితిన్ లేచి బిల్లు పే చేసి బయటకు నడిచాడు.

"మీరెలా వెళ్తారు? " అడిగాడు నితిన్.

"బైవాక్... నా రూమ్ దగ్గరే" అంది అమిత.

"ఓకే బై" చెప్పాడు నితిన్.

"బై" అంది అమిత.

నితిన్ అక్కడ్నుంచి ముందుకు వెళ్లి ఆటోని పిలిచి అడ్రస్ చెప్పాడు.

అమిత నడుచుకుంటూ తన రూమ్‌వైపు కదిలింది.

నితిన్ ఆలోచనల్లో అమిత కదలాడిరది.

★ ★ ★

నితిన్ ఆటోలో ఇంటి ముందు దిగి లోపలికి అడుగుపెట్టబోతుండగా లోపల్నుంచి చెల్లెలు వచ్చింది.

"అదేమిటన్నయ్యా ఆటోలో వచ్చావు? జీప్ ఏమైంది" అడిగింది భావన.

"అది... అదేమీ లేదమ్మా. వేరే చిన్న పని వుంటే అది చూసుకొని వస్తున్నా" చెప్పాడు నితిన్.

అన్నయ్య తన దగ్గర ఏదో దాస్తున్నాడని అర్థమైంది.

"సరే ఫ్రెషప్ అయిరా భోజనం వడ్డిస్తాను" అంది భావన.

నితిన్ స్నానం చేసొచ్చి అన్నం తిని కామ్‌గా తన గదిలోకి వెళ్లిపోయాడు.

అన్నయ్యలో వచ్చిన ఈ మార్పు ఏమిటో అని ఆలోచిస్తూ వుండిపోయింది భావన.

★ ★ ★

వైదేహి తన గదిలో కూచొని ఏవో కాగితాలు చూసుకుంటోంది. కిచెన్ రూమ్‌లో నుంచి గిన్నెల శబ్దం వినిపించింది. మామూలుగా చేయిజారి కిందపడ్డ శబ్దం కాదు. కావాలని కోపంతో తమ నిరసన తెలియజేయాలని ఉద్దేశంతో విసిరిన శబ్దం.

"ఏంటి ఏంటది" రాజారాం హాలులో నుంచి కేక వేశాడు కావాలనే.

"ఆ ఏముంది నా శ్రాద్ధం. ఎప్పుడూ ముష్టి బతుకులేగా మనవి. మా బాబాయ్ చనిపోతే మా పిన్ని కొడుకులందరికీ ఆస్తి రాసిచ్చి పుణ్యక్షేత్రాలకు వెళ్లిపోయింది. ఆ డబ్బుతో మా బాబాయ్ పిల్లలు హాయిగా వున్నారు. మనకూ వున్నారు.." అంది నోరు పెద్దది చేస్తూ.

ఆ మాటలు తనను ఉద్దేశించే అని

తెలుసు. ఉదయం పూటకూడా రాజారాం అమ్మకు కాఫీ ఇచ్చావా? అని అడిగాడు కావాలనే.

వెంటనే కాఫీ డబ్బా నేల మీద పెద్ద శబ్దంతో పెట్టి "కాఫీ నిండుకుందని ఎప్పుడో చెప్పాను. అయినా నేనేమైనా కాఫీ పొడి మింగేస్తున్నానా? డబ్బులన్నీ ఇంట్లో దాచుకున్నానా? " అంటూ అంతెత్తున ఎగిరింది.

కావాలనే రాజారాం ఏదో ఓమాట అనడం ప్రతీ దానికి ఆస్తిని ముడిపెట్టి నీల వేణి మాట్లాడ్డం ఇదంతా వైదేహికి అర్థమవుతూనేవుంది.

★ ★ ★

నితిన్‌కు మెల్లమెల్లగా అర్థమవుతూ వుంది. తను అమితను అభిమానిస్తున్నాడు. కాదు అంతకన్నా ఎక్కువైన ఫీలింగ్.

అవును తను అమితను ప్రేమిస్తున్నాడు. అమితంగా ప్రేమిస్తున్నాడు.

దాన్ని లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అంటారా?

మొదటి చూపులోనే తను అమితను ప్రేమించాడా? తనకేమైంది? తన మనసులో అమితకు సంబంధించిన ఆలోచనలు ఎందుకు వస్తున్నాయి. అతని మెదడు వేడెక్కిపోతోంది. తన ప్రేమను తన మనసు లోనే దాచుకోవాలి.

తన ప్రేమను ఎలా వ్యక్తం చేయాలి? అమితతో చెబితే ఆమె రియాక్షన్ ఎలా వుంటుంది? ఏమని చెప్పగలడు.

కొద్దిపాటి పరిచయంతో ఒక అమ్మాయి దగ్గరికి వెళ్లి నేను ప్రేమిస్తున్నానని ఎలా చెప్పగలడు? అదీ అమితలాంటి తెలివైన ఆడపిల్ల ముందు. పోనీ అమిత విషయం చెల్లెలికి చెబితే. చెల్లెలు కూడా తనని అపార్థం చేసుకుంటుందేమో. పెద్దగా పరిచయం లేని ఓ అమ్మాయిని సడన్‌గా ప్రేమించానని చెబితే ఎలా వుంటుంది?

ఇలా అతను తర్జనభర్జనలు పడుతున్న సమయంలో అతనూహించని ఓ సంఘటన జరిగింది.

ఆ రోజు ఆదివారం.

పేపరు చదువుకుంటూ కూచున్నాడు నితిన్. భావన తన ఫ్రెండొస్తుందని హడావిడి చేస్తోంది. ఈలోగా డోర్‌బెల్ మోగింది. భావన కిచెన్‌లో వంట పనిలో వుంది.

నితిన్ వెళ్లి తలుపు తీసి ఒక్కక్షణం షాకయ్యాడు.

ఎదురుగా అమిత.

"మీరా" ఆశ్చర్యంతో అడిగాడు నితిన్.

అమిత కూడా ఆశ్చర్యపోయింది. "మీరిక్కడ? "

"ఇది మా ఇల్లే"

"అంటే భావన"

"నా చెల్లెలు"

అమిత లోపలికి వచ్చింది. భావనకు అప్పుడే తెలిసింది తన అన్నయ్యకు అమిత తెలుసని.

"భలే కోయిన్సిడెన్స్ కదూ" అంది అమిత.

"ఎగ్జాక్ట్లీ మనం ఇలా కలుసుకుంటామని అనుకోలేదు" నితిన్ అన్నాడు.

"ఏసీవే... నాకు పరిచయం చేసే బాధ తప్పింది. అన్నయ్యా! నువ్వు అమితగారికి కంపెనీ ఇవ్వు. ఈలోగా నేను వంట పని పూర్తిచేస్తాను" అంది కిచెన్‌లోకి వెళ్లిపోతూ భావన.

తను కూడా వంటలో సాయం చేస్తానని భావనతో పాటు కిచెన్ రూమ్‌లోకి వెళ్లింది అమిత.

దానితో నితిన్ కాస్త నిరుత్సాహపడ్డాడు. అయినా అతనికి ఒకందుకు ఆనందంగానే వుంది. ఈవిధంగా అమితను కలుసుకుంటానని అతను ఊహించలేదుకూడా!

★ ★ ★

ముగ్గురు కలిసి సరదాగా భోజనం చేశారు. అమిత భావనకు, నితిన్‌కు థాంక్స్ చెప్పి ఇంటికి బయల్దేరబోయింది.

నితిన్ తను ఇంటివరకూ డ్రాప్ చేస్తాన న్నాడు. అమిత తను ఆటోలో వెళ్తానంది. కానీ భావన వూర్కోలేదు. తప్పనిసరిగా భావన పట్టుబట్టడంతో నితిన్‌తో కారులో బయల్దేరింది.

★ ★ ★

కారులో ఇద్దరూ కామ్‌గా వున్నారు.

"నాకు చాలా హేపీగా వుంది. మనం అనుకోకుండా కలుసుకున్నందుకు" అన్నాడు నితిన్ డ్రైవ్ చేస్తూ.

"ఒక్కోసారి ఇలాంటి థ్రిల్స్ మనకు ఎదు రవుతూ వుంటాయి" అంది అమిత.

"యస్సెస్. ఇంతకీ మా భావన చేతి వంట ఎలా వుంది? అఫ్‌కోర్స్ మీరూ చేయి వేశారనుకోండి" అన్నాడు నితిన్.

"భావన బాగా వంట చేస్తుంది. ఆమెకు రాబోయే భర్త అదృష్టవంతుడు" అంది అమిత.

"అదేం"

"ఎక్కడో చదివాను.. భార్య మంచి పాక శాస్త్ర ప్రావీణ్యురాలైతే భర్త యాభై శాతం సుఖపడిపోయినట్టేనట"

"మరి మిగతా సగం? "

"భర్త మంచి హృదయం వున్న వాడైతే ఆ భార్యా యాభై శాతం సుఖపడుతుంది. రెండు యాభైలు కలిస్తే వందకదా! అంటే నూటికి నూరు శాతం అన్నమాట" అంది అమిత నవ్వుతూ.

అమిత మాట్లాడుతుంటే అలాగే మంత్ర ముగ్ధుడై వింటూ వుండిపోయాడు.

అమిత ఏ విషయాన్ని అయినా స్పష్టంగా, సరదాగా, అద్భుతంగా చెప్పగ లదు. ఆమె మొహంలో అలసట, చికాకు తనింత వరకూ చూళ్లేదు.

"ఏంటి మీరేదో విషయమై దీర్ఘంగా ఆలో చిస్తూ వున్నట్టున్నారు" అడిగింది నితిన్ పరధ్యానం చూసి అమిత.

"ఏంలేదు. మీ గురించే ఆలోచిస్తున్నాను"

"నా గురించా... నా గురించి ఏం ఆలో చిస్తున్నారు? "

"మీకు ఇన్ని తెలివితేటలు ఎక్కడ్నుంచి వచ్చాయా? అని"

"అవా... మా తాతయ్య, బామ్మల సహ చర్య ప్రభావం" అంది అమిత. అలా అంటున్నప్పుడు ఆమెకు బామ్మ, తాత య్యలు గుర్తొచ్చారు.

"ఇదిగో... ఈ పక్కనే ఆపండి" అంది అమిత.

కారు ఓ పక్కగా ఆపాడు. అమిత 'బై' చెప్పి తన రూమ్‌వైపు నడిచింది.

★ ★ ★

వైదేహి ఇంటికి వచ్చేసరికి శ్మశాన నిశ్శబ్దం ఆవహించిందా ఇంటిని.

ఎవరికి వారు పట్టనట్టే వున్నారు. రెండ్రో జులక్రితం అయితే చెప్పాపెట్టకుండా తాళం వేసుకొని మొదటి ఆట సినిమాకు వెళ్లారు. తాళం చెవులు పక్కింట్లో కూడా ఇచ్చి వెళ్ల లేదు.

వాళ్లు కావాలని చేశారని అర్థమైంది. కోడలు అలా చేయడం సమర్థించుకుందా మన్నా కొడుకు అలా చేయడమా?

వైదేహికి అర్థమైంది. భర్త మాటలు మరోసారి ఆమె చెవుల్లో మార్మోగి హెచ్చరి స్తూనే వున్నాయి.

ఓ నిర్ణయానికి వచ్చింది.

ఒరే పెద్దాడా పిలిచింది.

ఏమిటన్నట్టు వచ్చి నిలబడ్డాడు రాజారాం.

"రేపు తమ్ముళ్లను పిలిపించు" అంది ముక్తసరిగా వైదేహి.

"ఎందుకూ? " అతని మొహంలో దాచినా దాగని ఆనందం. 'అంటే ఆస్తి తమ పేరుమీద రాస్తుందా? '

"ముందు పిలిపించు" చెప్పి తన గదిలోకి వెళ్ళింది వైదేహి.

★ ★ ★

ఆఘమేఘాలమీద వచ్చారు కొడుకులు.

వాళ్ల మొహాల్లో ప్రసన్నత.

"మేము తెలిసోతెలియకో ఏమైనా తప్పులు చేస్తే మమ్మల్ని క్షమించమ్మా" నలుగురూ కూడబలుక్కొని అన్నారు.

ఆరోజు ఉదయమే పెద్దకోడలు పాయసం చేసి వేడివేడిగా తెచ్చిచ్చింది.

"ఏదో ఆరోగ్యం బాగుండక సరిగ్గా మాట్లాడలేకపోయా, క్షమించండత్తయ్యా" అంది.

డబ్బు 'లేని'ప్రేమలను 'కొని' తెస్తుందని అర్థమవుతూనే వుంది.

★ ★ ★

"ఇన్నాళ్ళ మీ నిరసనలు, మౌనపోరాటాలు నాకు అర్థమయ్యాయి" అంది వైదేహి.

నలుగురు కొడుకుల మొహాల్లో నెత్తురు యింకిపోయింది.

"నిజం చెప్పాలంటే నాకు చాలా సిగ్గుగా వుంది" సూటిగా అంది వైదేహి.

ఎవరికీ ఏంమాట్లాడాలో అర్థంకాలేదు.

"తల్లి ప్రేమకన్నా, తల్లి దగ్గర వున్న డబ్బే మీకు ప్రధానమన్న నగ్నసత్యం తెలిసింది. నాకు అనుభవ వేద్యం అయ్యేలా చేసినందుకు కృతజ్ఞతలు"

"అది కాదమ్మా" రాజారాం ఏదో చెప్పబోయాడు.

"వద్దు... నాకేమీ చెప్పొద్దు... మరో మూడ్నాలుగు రోజుల్లో నేనిక్కడ్నుంచి శాశ్వతంగా శా...శ్వ...తం...గా వెళ్ళిపోతాను. వెళ్ళిపోయే ముందు ఆస్తి పంపకాలు చేసి మరీ పోతాను"

అందరూ నిశ్శబ్దంగా తల్లి మాట్లాడే మాటలు వింటుండిపోయారు.

"ఈ ఇల్లు మీనాన్న స్వార్జితం. మీకోసం అన్నీచేసి, చివరికి మాకోసం కట్టుకున్న చిన్న పర్ణశాలలాంటి ఈ ఇల్లు... నాకు చివరిదశలో, తను లేకున్నా, ఈ ఇల్లయినా వుంటుందని మీ నాన్నగారి వుద్దేశం"

అలా అంటున్నప్పుడు వైదేహి గొంతు వణికింది.

"సరే... ఈ ఇంటిని నేను అమ్మబోవడం లేదు. అలా అని మీపేరుమీద రాయబోవడంలేదు"

వైదేహి మాటలు అర్థంగాక అలాగే చూస్తుండిపోయారు.

"మీ నలుగురికి నలుగురు ఆడపిల్లలు వున్నారు. ఆ నలుగురు ఆడపిల్లల పేరుమీద రాస్తున్నాను. నా నలుగురు మనవరాళ్ల పేరుమీద ఈ ఇల్లు రాస్తాను. ఈ డబ్బు వాళ్ల పెళ్ళిళ్ళకు కానీ, చదువులకు కానీ ఉపయోగపడాలి. నాకోసం కొంత డబ్బు వుంచుకొని మిగతా డబ్బు మీ అందరికీ పంచుతాను"

మిగతా డబ్బు అంటే ఎంత? అని అడగాలని వున్నా ధైర్యం చేసి ఆమాట పైకి అన్లేకపోయారెవరూ.

"ఇక మౌనపోరాటాలు, నిరసన వ్రతాలు మాని హ్యాపీగా వుండొచ్చు" చెప్పి తన గదిలోకి వెళ్ళింది వైదేహి.

కాసేపు నలుగురు కొడుకులు, కోడళ్లు వేరే గదిలోకి వెళ్ళి గుసగుసలాడుకున్నారు.

వాళ్లెవరికీ వైదేహిని పలకరించే ధైర్యం కూడా లేకపోయింది.

★ ★ ★

వైదేహి కుర్చీని కాస్త ముందుకు జరుపుకుంది. టేబుల్‌మీద వున్న ప్యాడ్ తీసుకుంది. పెన్ను చేతిలోకి తీసుకుంది.

వైదేహికి అమిత గుర్తొచ్చింది. ఆస్తి మాటలయ్యాక అడగ్గానే ఎడ్రస్ ఇచ్చాడు అమితది రాజారాం.

"ప్రియమైన అమితను మీ బామ్మ దీవించి వ్రాయునది" ఉత్తరం రాయడం మొదలెట్టింది వైదేహి.

★ ★ ★

పత్రికాఫీసునుంచి... ఇంట్లోకి అడుగుపెట్టేసరికి బామ్మ రాసిన వుత్తరం కనిపించింది అమితకు. ప్రాణం లేచివచ్చినట్టనిపించింది. ఛాలాకాలం తర్వాత బామ్మనుంచి

తనకు ఉత్తరం.

బామ్మ చేతిరాత తనకు బాగా గుర్తు. హ్యాండ్‌బ్యాగ్‌ను ఓ మూలకు గిరాటేసింది. ఉత్తరాన్ని అతి పదిలంగా అపురూపంగా చూసుకుంటూ మెల్లగా ఫోల్డ్ విప్పింది.

"ప్రియమైన అమితకు మీ బామ్మ దీవించి వ్రాయునది. మామూలుగా అయితే మీబామ్మ, తాతయ్యలు దీవించి వ్రాయునది అని రాయాలి. కానీ నాకా అవకాశం మీ తాతయ్య యివ్వలేదు. నిన్ను, నన్ను, ఈ లోకాన్నే విడిచి పెట్టేశారాయన.

ఒక్కక్షణం అమిత మెదడు స్థబ్దుగా మారింది. మరోసారి ఉత్తరాన్ని చదివింది.

"నిన్ను, నన్ను ఈలోకాన్నే విడిచిపెట్టేశారాయన"

తాతయ్య, తాతయ్య చనిపోయాడా. నో, గట్టిగా అరిచేసింది. ఆ గదిలో ఆమె అరుపు ఆమెకే ప్రతిధ్వనిగా వినిపించింది.

కళ్లలోనుంచి కన్నీళ్లు ఆమె ప్రమేయం లేకుండానే జలజల రాలిపోతున్నాయి. తనని ఎత్తుకొని ఆడించిన తాతయ్య, తాతయ్య చనిపోతే ఆ విషయం తనకు తెలియకుండా.

ఉత్తరంలోని అక్షరాల వెంట ఆమె కళ్లు పరుగులు తీశాయి.

"మనిషిని డబ్బు శాసిస్తుంది. ఇది చాలా సందర్భాల్లో రుజువవుతూ వస్తోంది. మీనాన్న, మీ బాబాయిలు అందరికీ నేను అక్కర్లేదు. నా పేరుమీద వున్న ఆస్తి కావాలి.

ఆస్తి గురించి నాకు చింతలేదు. ఆస్తిమీద వ్యామోహమూ లేదు కానీ, నాకో ఆశయం వుంది. అది మీ తాతయ్యకు నేనిచ్చిన మాట.

వృద్ధాప్యం చాలామందికి శాపం. అనివార్యమైన వృద్ధాప్యాన్ని జయించడం ఎవరికీ సాధ్యంకాదు. కానీ ఆ వృద్ధాప్యాన్ని ఆనందంగా గడపడం మాత్రం ఆ వృద్ధుల పిల్లల చేతుల్లో వుంది. ఎంతమంది బిడ్డలు తమ తల్లిదండ్రుల గురించి పట్టించుకుంటున్నారు.

నీ తల్లిదండ్రులే దానికి సజీవసాక్ష్యం. అయినా నాకు బాధలేదు. ఈ ప్రపంచంలో నేను అమితంగా ప్రేమించేది మీ తాతయ్యను.

నన్ను నేను కూడా ఎప్పుడూ అంత అమితంగా ప్రేమించుకోలేదు. ఆ తాతయ్యే నాకు దూరమయ్యాక నేనెందుకు బతకాలనే ప్రశ్నకు సమాధానం మీ తాతయ్య చెప్పారు.

అందుకే తాతయ్య కోరికను బతికించడం కోసం వృద్ధులకోసం ఓ ఆశ్రమం ఏర్పాటు చేయాలని సంకల్పించాను. దానికి నేను పెట్టుకున్న పేరు 'ఈ వేకువ మీ కోసం'. అవును జీవితంలోని చివరిదశను వేదనతో, నిరాశతో గడిపే అందరికీ స్థయిర్యానిచ్చేదే ఈ వేకువ మీకోసం ఆశ్రమం.

ఈ ఆశ్రమంలో నా శేషజీవితం గడపాలని నిర్ణయించుకున్నాను. ఈ ప్రపంచంలో మీ తాతయ్య తర్వాత నేను ప్రేమించే వ్యక్తివి నువ్వే. నిన్నెప్పుడూ మనవరాలిలా చూడ్లేదు. స్నేహితురాలివే అనుకున్నాను.

నువ్వు ఇక్కడికి వచ్చేసరికి నేను వుండకపోవచ్చు నీకెప్పుడైనా సరే, ఈ బామ్మను చూడలని అనిపిస్తే నీకోసం ఈ బామ్మ మనసు తలుపులు, ఆశ్రమం తలుపులూ ఎప్పుడూ తెరుచుకునే వుంటాయి.

నీ బామ్మ...

రెండు కన్నీటిబొట్లు ఆ వుత్తరంలోని అక్షరాలమీద పడ్డాయి. ఆమె మనసంతా అదో రకమైన ఫీలింగ్‌తో బరువెక్కింది.

తను వెళ్ళాలి. బామ్మను కలుసుకోవాలి. భామ్మని ఓదార్చాలి. ఆమెలో ఓ స్థిరమైన నిర్ణయం.

★ ★ ★

"ఏంటీ మీరు హైద్రాబాద్ వెళ్తున్నారా? " అపనమ్మకంగా అడిగాడు నితిన్.

అమిత ఆరోజు ఉదయమే తనకు ఫోన్ చేసి ఈ విషయం చెప్పడంతో సాయంత్రం

అమితను ఆమె ఆఫీసులో కలుసుకున్నాడు. తనతోపాటు కాఫీకి రెస్టారెంట్‌కు రమ్మన్నాడు. రెస్టారెంట్‌లో అమిత తను హైద్రాబాద్ వెళ్తున్న విషయం మరోసారి చెప్పింది.

"అవును నితిన్‌గారూ, మా తాతయ్య చనిపోయారట" ఆ విషయం చెప్పినప్పుడు ఆమె గొంతు బాధతో పూడుకుపోయింది.

"ఓహ్... అయామ్ సారీ" అన్నాడు నితిన్.

"విచిత్రమేమిటంటే మా తాతయ్య చనిపోయాక చాలా రోజులకుగానీ నాకీవి



షయం తెలియకపోవడం"

"అదేమిటి? "

"అదంతే" అంటూ బామ్మ ఉత్తరంలో రాసిన విషయాలు మొత్తం క్లుప్తంగా చెప్పింది.

"అంటే మళ్ళీ ఢిల్లీకి రారా? " అడిగాడు నితిన్.

"బహుశా రాకపోవచ్చు. బామ్మతోపాటు వుండి బామ్మకు చేతనైనంత సాయం చేయాలని అనుకుంటున్నాను"

ఒక్కక్షణం మౌనంగా వుండిపోయాడు నితిన్. అతనికి ఏం మాట్లాడాలో తెలియడంలేదు.

"ఏంటి నితిన్. ఏంటాలోచిస్తున్నారు? "

"మీ గురించే"

"నాకు తెలుసు. యూ ఆర్ మై గుడ్ ఫ్రెండ్... చాలా కొద్ది పరిచయంలోనే నాకు మంచి ఫ్రెండ్‌గా మిగిలారు. నిజం చెప్పాలంటే ఈ ఫ్రెండ్‌షిప్‌లమీద ఒకప్పుడు సదభిప్రాయం వుండేదికాదు. ఆడ, మగల స్నేహాలు ప్రేమకు దారితీస్తాయన్న నమ్మకంలో వుండేదాన్ని.

బట్... మీ స్నేహం చూశాక, మీలాంటి ఓ మంచి మిత్రుడ్ని ఇంతకాలంగా ఎందుకు గుర్తించలేదా... అని బాధ పడుతున్నాను" సిన్సియర్‌గా అంది అమిత.

నితిన్ మాట్లాడలేదు.

ఇద్దరూ కాఫీ తాగారు.

"నేనిక వుంటాను. మళ్ళీ మీరు కలుస్తారో లేదోనని ముందే చెప్పాను" అంది అమిత.

"మీ పరిచయం నాకు గొప్ప తృప్తిని ఇచ్చింది అమితగారు"

"థాంక్స్... థాంక్స్ ఫ్రెండ్"

"మీరు ఎప్పుడు బయల్దేరుతున్నారు"

"రేపు ఈవినింగ్ ట్రెయిన్‌కు"

"రిజర్వేషన్ దొరికిందా"

"దొరికింది. మీ ఫ్రెండ్ ఆ పని చేసి పెట్టింది"

"రేపు మీకు సెండాఫ్ యివ్వడానికి మీ ఫ్రెండ్ వస్తుందా"

"తనకు కాస్త పని వుండి రాలేనని చెప్పింది. అయినా నేను ఒక్కదానినే వెళ్ళగలను" అంది అమిత.

"మీకు అభ్యంతరం లేకపోతే నేనొస్తాను భావనను తీసుకొని" అన్నాడు నితిన్.

"థాంక్యూ" అంది అమిత.

బిల్లు చెల్లించి బయటకు వచ్చారు.

ఆ రాత్రంతా నితిన్‌కు నిద్రలేదు. అతను విచిత్రమైన పరిస్థితిలో వుండిపో

# ఏరినముత్యాలు

* జీవితంలో అరుదుగా వచ్చే అవకాశం లభించినప్పుడు మనిషి మీనమేషాలు లెక్కించుకుంటూ వెనకాడకూడదు.

– డేల్ కార్నిజీ

* తమ ప్రతిభ రాణింపు తెచ్చుకునే బహుకొద్దిమందికి ఉండే ఓ ముఖ్యమైన అర్హత- కాస్తంత సాహసం.

– సిడ్నీస్మిత్

* ఎంతటి గొప్ప నిర్ణయమైనా, కార్యరూపం దాల్చకపోతే తన మహత్తుని కోల్పోతుంది.

– డబ్ల్యూ.సి. స్టోన్

* మనం మన భయాలని మనవరకే పరిమితం చేసుకుని, మన ధైర్య సాహసాలని మాత్రం పదిమందికీ పంచిపెట్టాలి.

– రాబర్ట్ లూయిస్ స్టీవెన్

* దుఃఖాన్ని దిగమింగుకోవడానికి వంటరితనం సరిపోతుందిగానీ, ఆనందం అనుభవించాలంటే మరొకరి తోడు అవసరం.

– ఎల్బర్ట్ హబ్బర్డ్

* మనం మనంగా ఉండాలి. ఉన్నదానికన్నా ఉన్నతులం కావడానికి మనం చేయవలసిన కృషిలో ఇది తొలిమెట్టు.

– అగస్టస్ హేర్

* మనిషిని పరిస్థితులు సృష్టించకూడదు. మనిషే పరిస్థితులను సృష్టించి శాసించగలగాలి.

– బి.బి. (సెయిలి

* దిగులుపడటంవల్ల రేపటి వేదనాభారం అణువంతైనా తగ్గదు. పైగా ఈనాటి మనోబలం ఎంతో సన్నగిల్లుతుంది.

– ఎ.జె. క్రొనిన్

* రేపటికోసం పరితపిస్తూ పరిశ్రమించే మనిషికి ఏనాటికీ వయసు పెరగదు.

– ఆర్నాల్డ్ హెచ్. గ్లాసో

* మంచాన పడినప్పుడుగానీ, మహా ధనవంతుడికి తెలిసి రాదు- ధనం విలువ ఎంత అల్పమో.

– చార్లెస్ సి. కాల్టన్

* అవకాశం రెండుసార్లు నీ తలుపు తడుతుందని భావించకు.

– ఛెంపోర్టు

సేకరణ: **టి. మహి**

యాడు. అమితకు తన ప్రేమ గురించి చెప్పే సాహసం చేయలేకపోయాడు. తననో మంచి స్నేహితుడిగా చూసే అమితకు... నేను నిన్ను ప్రేమిస్తున్నానని ఎలా చెప్పగలడు.

ఒకవేళ అమిత నెగెటివ్‌గా రియాక్ట్ అయితే? ముందే చెప్పింది ఆడ, మగల మధ్య చాలా స్నేహాలు ప్రేమగా మారుతాయని, తను అలాంటి వాడిని కానని అనుకుంటున్నట్టు.

వద్దు... అమితకు ఈ విషయం చెప్పొద్దు. అమిత ప్రేమ తనకు దొరక్కపోయినా ఫర్లేదు. కానీ అమిత స్నేహం తనకు దూరం కావద్దు. తను, అమితా మంచి స్నేహితుల్లానే వుండాలి.

కాలమే తన సమస్యను పరిష్కరించొచ్చు. లేదా తనని అమిత స్నేహితుడిగా మిగల్చవచ్చు.

ఆ ఆలోచన రావడంతో ప్రశాంతంగా కళ్లు మూసుకున్నాడు నితిన్.

★ ★ ★

రైల్వే స్టేషన్

చాలా రద్దీగా, రణగొణ ధ్వనులతో నిండి వుంది. నితిన్, భావనలు వచ్చారు. నితిన్ ఫ్లవర్‌బొకే తీసుకువచ్చాడు.

భావన చాలా బాధపడిపోయింది. ట్రెయిన్ రావడానికి మరో పదినిమిషాలే వుంది. వాతావరణం భారంగా వుంది. అమితకు కూడా మాటలు రావడంలేదు. చాలా కొద్దిపాటి పరిచయమే. అయినా ఆమెకు ఎందుకో తన ఆత్మీయులను విడిచి వెళ్తున్న ఫీలింగ్ కలిగింది.

ట్రెయిన్ ప్లాట్‌ఫామ్ మీదికి వచ్చింది. నితిన్ ఫ్రూట్స్, మేగజైన్స్ తీసుకువచ్చి అమితకు ఇచ్చాడు.

భావన అమితకోసం కర్డ్‌రైస్ తీసుకువచ్చింది. ట్రెయిన్ ఎక్కింది. గార్డు విజిల్ వేశాడు. రైలు మెల్లమెల్లగా కదులుతోంది.

భావన చెయ్యి నొక్కి వదిలింది అమిత. నితిన్ అలాగే చూస్తుండిపోయాడు.

"బై ఫ్రెండ్... మళ్ళీ ఎప్పుడైనా, ఎక్కడైనా కలుద్దాం" అతని చేయి స్నేహపూర్వకంగా నొక్కి చెప్పింది నితిన్‌కు అమిత.

రైలు కదలి వెళ్తోంది. వేగంగా వెళ్తోంది. అంతకన్నా వేగంగా వెళ్తున్నాయి అమిత ఆలోచనలు. ఆమె తన ఒళ్ళో వున్న సూటుకేసు తీసి పక్కన పెట్టి ఓపెన్ చేసింది.

అందులో బట్టల అడుగున వున్న ఓ ఉత్తరాన్ని తీసింది. దాదాపు ముప్ఫయేళ్ల క్రిందట ఉత్తరం. అది తాతయ్య బామ్మకు రాసింది.

ఆ అక్షరాలు ముత్యాల్లా వున్నాయి. యింకు పెన్నుతో రాసిన ఉత్తరం. అప్పటి ఆ కాగితం... కాస్త రంగుమారినా పాతకాలంనాటి విలువైన తాళపత్ర గ్రంథంలా వుంది.

నిన్నేమని సంబోధించాలో అర్థంకావడం లేదురా... నా కళ్లకు ఇంకా పసికూనలానే కనిపిస్తున్నావు. నాకోసమే నువ్వు పుట్టినట్టు అనిపిస్తోందిరా.

ఏ భార్య అయినా భర్తనుంచి, డబ్బునో, పేరునో, సెక్యూర్ ఫీలింగ్‌నో కోరుకుంటుంది. కానీ నువ్వేమిట్రా కేవలం నా ప్రేమను మాత్రమే కోరుకుంటావు.

ఆమధ్య సెలవులకు వచ్చినప్పుడు సత్యమూర్తి చెప్పాడు. నా ఫోన్ రాగానే నువ్వు పసిపిల్లవే అవుతావట. చెంగున గంతులేసే హరిణిలా మారుతావట. నేను మాట్లాడుతున్నంతసేపు నీ కంట్లో మెరుపులు కనిపిస్తాయట.

ఎక్కడ నా మాటలు జారి కిందపడిపోతాయో అన్నంత ఇదిగా రిసీవర్ బిగించి పట్టుకుంటావట. ఆ తర్వాత నీకు ఆకలి కూడా వేయదట.

ఏరా పిచ్చికన్నా... నీ ప్రేమతో నన్ను కంట తడిపెట్టిస్తున్నావు కదరా. నాకోసం నువ్వు ఎన్ని కష్టాలు పడ్డావురా?

నీకెప్పుడూ విశ్రాంతినివ్వలేదు కదూ..

మొన్నెవరో అడిగారు మీ అమ్మ పేరేమి టని. నేను ఠక్కున చిత్రంగా నీ పేరే చెప్పాను. అవునుమరి. నువ్వు నా కళ్ళకు ఓ అమ్మలా, ఓ స్నేహితురాలిలా, ఓ సహ చరిలా, భిన్నరూపాల్లో కనిపిస్తావు.

ఎప్పుడూ నువ్వన్నమాటలే నాకు గుర్తొ స్తుంటాయి. 'మీ జ్ఞాపకమే నన్ను బతికి స్తుంది.

మీ జ్ఞాపకమే నాకు ఊపిరిపోస్తుంది.

మీ జ్ఞాపకాలే నాగుండె చప్పుళ్లు'

ఎంత అందంగా చెప్పగలవురా...

విషాదాన్ని గుండెలోతుల్లో దాచుకుని నువ్వు చిర్నవ్వును ధైర్యంగా పెదవులమీద నిలుపుకోగలవు.

నీ సాహచర్యంలో అనుభవం వుంది.

నీ సాన్నిహిత్యంలో అనుభూతి వుంది.

అది అమృతప్రాయం. మృత ప్రాయ మయ్యే మనసును బతికించే సంజీవిని.

ఉండనా మరి.

నీ నేను...

ఒక్కక్షణం గుండె చిత్రమైన సవ్వడిని సృష్టించిందేమోననిపించింది.

ఎంత భావుకత. ఎంత ఆర్తి. ఎంత ప్రేమ. ఓ మనిషిని మరో మనిషి ఇంత ఇదిగా ప్రేమించగలరా? తాతయ్య మీద ప్రేమ; బామ్మమీద అవ్యాజమైన అనురా గమూ వెన్వెంటనే కలిగాయి.

వెంటనే బామ్మ దగ్గరికి పరుగున వెళ్లా లన్న కోరిక. తను వెళ్లేసరికి తాతయ్య వుండడు. ఆ నిజమే ఆమెను కలిచివే స్తోంది.

ఆమె ఆలోచనలతో నిమిత్తం లేకుండా రైలు వెళ్తూనే వుంది.

★ ★ ★

"వెళ్లక తప్పదామ్మా" అడిగాడు మొక్కుబ డిగా రాజారాం.

"వెళ్లాలని నిర్ణయించుకున్నాక తప్పదు" అంది వైదేహి.

"ఇంత కఠినంగా ఎలా మాట్లాడగలుగు తున్నావమ్మా" లేని జీరను గొంతులోకి తెచ్చుకొని అన్నాడు రాజారాం.

"అది మీ అంతరాత్మలకు తెలియదా?" వైదేహి సూటిగా అడిగింది.

ఆమెకు తెలుస్తూనే వుంది. తనెంత కఠి నంగా మాట్లాడుతున్నదీ, కానీ తప్పదు.

సూటుకేసు చేతిలోకి తీసుకుంది. సత్య మూర్తి ఆమె చేతిలోని సూట్‌కేసు తీసుకు న్నాడు.

"ఈ ఇంటి తాలూకు కాగితాలు లాయర్ గారి దగ్గర వున్నాయి. అందరికీ సమంగా రాశాను.

క్యాష్ బ్యాంకులో వుంది. చెక్కులమీద సంతకం చేశాను. వెళ్ళి డ్రా చేసుకోవచ్చు

"నాకంటూ తీసుకెళ్తుంది స్వల్ప మొత్తమే. అది ఈ తల్లి బతకడానికి కాదు. ఈ తల్లిలాంటి వాళ్లను కొందరినైనా బతికిం చడానికి"

వైదేహి అడుగు బయటకు వేసింది.

ఆమె ప్రస్థానంలో ఓ మలుపు మొద లైంది.

★ ★ ★

ఆటోదిగి లోపలికి వస్తూనే 'బామ్మా' అంటూ పిలిచింది అమిత. ఇల్లంతా నిశ్శ బ్దంగా వుంది.

రాజారాం కూతుర్ని చూసి...

"రామ్మా... ప్రయాణం కులాసాగా జరి గిందా. ఉత్తరం రాస్తే సరిపోయేది. కనీసం ఫోన్ చేసినా స్టేషన్‌కు వచ్చి రిసీవ్ చేసు కునేవాడిని కదా" ఆ తండ్రి యింకా మాట్లా డుతూనే వున్నాడు.

"బామ్మ ఎక్కడ?" సూటిగా అడిగింది అమిత.

తలవంచుకున్నాడు రాజారాం.

"పంపించేశారా? బామ్మను పంపించే శారా?" అంటూ ఎదురుగా గోడకు వేలాడు తున్న తాతయ్య ఫొటో దగ్గరికి వెళ్ళింది.

ఆనందరావు ఫొటోకు దండ వేలాడు తోంది.

"తాతయ్యను కూడా పంపించేశారుగా" అంది భోరున ఏడుస్తూ.

"అవేం మాటలమ్మా" తల్లి ఊరడింపుగా అంది.

వాళ్లవైపు కోపంగా చూస్తూ "తాతయ్య చనిపోతే నాకెందుకు తెలియజేయలేదు" నిలదీసి అడిగింది.

"అది... నీ చదువు డిస్టర్బ్ అవుతుందని"

"అందుకని నాకు చెప్పలేదా? తాతయ్య కంటే నా స్టడీస్ ఎక్కువా" కోపంగా అంది అమిత.

"అది కాదమ్మా"

"ఏదికాదు. నాకేమీ చెప్పొద్దు. బామ్మ ఎక్కడికి వెళ్ళిందో చెప్పండి ముందు" ఏడుస్తూనే అంది.

"తనే మేము ఎంత చెబుతున్నా వినకుండా వెళ్ళిపోయింది" అన్నాడు రాజారాం.

కళ్లు తుడుచుకుంటూ లేచింది అమిత.

"ఎక్కడికెళ్తున్నావే? " అడిగింది తల్లి.

"బామ్మ దగ్గరికి. బామ్మను కలిశాకే వస్తాను" అంటూ హ్యాండ్‌బ్యాగ్ తీసుకొని బయటకు వచ్చింది.

బామ్మ గురించి రాజేశ్వరిగారికి తెలుసని అమితకు తెలుసు.

★ ★ ★

ఆటోలో నుంచి దిగారు వైదేహి, భూపతివర్మ, సత్యమూర్తి. వైదేహి చేతిలో వున్న సూట్‌కేసు తన చేతిలోకి తీసుకున్నాడు సత్యమూర్తి.

"అదిగో, అదేనమ్మా, నువ్వు ముచ్చటపడి కొనుక్కున్న శ్మశానం" బాధ నిండిన స్వరంతో అన్నాడు భూపతివర్మ.

అక్కడక్కడ పాడుబడిన సమాధులు వున్నాయి. పిచ్చిమొక్కలు మొలిచాయి. ఎగుడుదిగుడుగా వుంది.

రాత్రివేళ ఎవరూ అటువైపు రావడానికి సాహసించరు.

"ఈ వాతావరణాన్ని, ఈ స్థలాన్ని చూసి భయపడుతున్నావా తల్లీ" అడిగాడు భూపతివర్మ.

లేదన్నట్టు అడ్డంగా తలూపుతూ అంది.

"రేపట్నుంచీ దీన్ని చదును చేయించాలి. ముందుగా చిన్న పర్ణశాల లాంటిది వేయించాలి" అంది ఆ స్థలాన్ని పరిశీలనగా చూస్తూ. దూరంగా చిన్న షెడ్డులాంటిది వుంది. దహనం చేయడానికి దాన్ని ఉపయోగిస్తున్నట్టుంది.

"అన్నయ్యా... మీరు వెళ్లండి. నేను ఇక్కడే వుంటాను" అంది వైదేహి.

"నువ్వు ఒక్కదానివి వుంటావా? " ఆశ్చర్యంగా అడిగాడు సత్యమూర్తి.

"ఇవ్వాళ్టినుంచి నా నివాసం యిదే అన్నయ్యా"

"అదేమిటమ్మా అలా అంటావు. నాతో పాటు వచ్చేయ్"

"వద్దన్నయ్యా"

"పోనీ ఈ ఒక్కరోజు ఏదైన మంచి హోటల్‌లో"

"లేదన్నయ్యా... యిక్కడే వుంటాను"

"ఇది నిర్జన ప్రదేశమమ్మా పైగా శ్మశానం"

"నాకు ఇక్కడే ప్రశాంతంగా వుంటుందన్నయ్యా ప్లీజ్" అంది వైదేహి.

"సత్యమూర్తిగారూ... మీరు నిశ్చింతంగా వెళ్లండి. అమ్మాయికి తోడుగా నేను వుంటాను"

"మీరా? " వైదేహి అడిగింది.

"ఏం నేను వుండకూడదా తల్లీ. నీకు అమ్మేశాను కదా. యిక నాకే హక్కూ లేదా? "

"ఛ...ఛ... నా ఉద్దేశం అది కాదు"

"మరింకేం అభ్యంతరం తల్లీ. నీ ఆశ్రమంలో మొదటి అనాథని నేనే అనుకో" అలా అంటున్నప్పుడు ఆయన గొంతు వణికింది.

"మీ ఇష్టం" అంది వైదేహి.

"అయితే. నేను రేపు ఉదయమే వస్తా

నమ్మా. కూలీలను తీసుకొని వస్తాను. రేప ట్నుంచే పనులు ప్రారంభిద్దాం" అన్నాడు సత్యమూర్తి.

అలాగేనన్నట్టు తలూపింది వైదేహి. చీకట్లు ముసురుకుంటున్నాయి.

"చీకటి పడుతోందమ్మా. తినడానికి కూడా ఏమీ లేదుకదా. దగ్గర్లో హోటళ్లు కూడా వుండవు. పోనీ ఏదైనా తెచ్చిచ్చేదా? " అడిగాడు సత్యమూర్తి.

వైదేహిని ఒంటరిగా వదిలి వెళ్లడానికి బాధగా వుంది. బలవంతంగా తనతో తీసుకువెళ్ళాలన్నా భయంగానే వుంది. కొడుకు, కోడలూ చేసే రాద్ధాంతం గుర్తుకువస్తుంది.

వైదేహి మొండితనం తెలుసు. ఆమె పట్టుదలా తెలుసు.

"సరేనమ్మా. నేను బయల్దేరుతాను" అన్నాడు సత్యమూర్తి.

అలాగే అన్నట్టు తలూపింది.

సత్యమూర్తి వెళ్ళిపోయాడు.

భూపతివర్మ, వైదేహి యిద్దరే మిగిలారు. చీకట్లు ముసురుకుంటున్నాయి.

దూరంగా వీధి స్థంబాల వెలుతురు కనపడుతోంది.

సరిగ్గా రెండు గంటల తర్వాత ఓ ఆటో వచ్చి ఆగింది.

అందులో నుంచి సత్యమూర్తి దిగాడు.

"అదేమిటన్నయ్యా మళ్ళీ వచ్చావు? " అనడిగింది వైదేహి.

సత్యమూర్తి పక్కకు జరిగాడు.. సత్యమూర్తి వెనకే అమిత. తన మనవరాలు.

"అమితా..." వైదేహి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"బామ్మా..." పరుగున వెళ్ళి బామ్మను వాటేసుకుంది.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం.

శ్మశాన నిశ్శబ్దంకన్నా భయంకరమైన నిశ్శబ్దం. మాటల్లేవు. మనసు ఘోష తప్ప.

కన్నీళ్ళు లేవు... కన్నీటి కన్నా బరువైన వ్యధ తప్ప.

భూపతివర్మ ఆర్ద్రంగా వాళ్ళవైపు చూస్తుండిపోయాడు.

అతనికి మమకారాలు కొత్తగా, వింతగా అనిపిస్తున్నాయి. అతని జమిందారీ జీవితంలో డబ్బు, దర్పం, మీరు అని గౌరవంగా పిలుచుకునే దూరాలు పెంచుకోవడాలు తప్ప ఇలాంటి మమకారాలుండేవి కావు.

అతనికి కొత్త ప్రపంచం కనిపిస్తోంది. అభిమానాలు, ఆప్యాయతలు ఇలా వుంటాయా? అని మనసులో ఎన్నో భావాలు.

★ ★ ★

"నేను ఇంటికి వెళ్ళేసరికి అమిత రాజేశ్వరితో మాట్లాడుతోంది. నువ్వెక్కడున్నావో చెప్పమని రాజేశ్వరిని అడిగింది. పైగా నేను వచ్చేవరకు వుంటానందిట. బామ్మను చూడందే ఇంటికి వెళ్ళనని భీష్మించుక్కూచుందిట.

నీ సంగతి చెప్పగానే వెంటనే నన్ను లాక్కొచ్చింది. నీకోసం దారిలో హోటల్ లో పెరుగన్నం తీసుకువచ్చింది" చెప్పాడు సత్యమూర్తి.

"మరి అదెవరనుకున్నావన్నయ్యా. నా మనవరాలు" అంది మురిపెంగా అమితను దగ్గరకు తీసుకుంటూ.

"మరి నేనిక వెళ్ళనా? ఆటోని వుండమని చెప్పాను" అన్నాడు సత్యమూర్తి.

"అదేంటి అమితను తీసుకెళ్ళవా? "

"నేను వెళ్ళను బామ్మా" అంది అమిత.

"వెళ్ళక... ఇక్కడే వుంటావా? "

"అవును. ఇక్కడే వుంటాను"

"అమితా వద్దమ్మా..."

"బామ్మా ఈరోజు నీతోనే వుంటాను. ఎన్నాళ్ళయింది. నువ్వు చెప్పే కబుర్లు వింటూ వుంటాను. అసలా ఇంటికే వెళ్ళకూడదని అనుకున్నాను"

"తప్పమ్మా... తల్లిదండ్రులకు పిల్లలు శిక్ష వేయకూడదు"

"నీకు నీ పిల్లలు వేయలేదా? "

"అప్పుడు వాళ్లకు, నీకూ తేడా ఏముం టుందమ్మా"

"సరే... రేపు వెళ్దాంలే బామ్మా. ఈరోజు నీతోనే వుంటాను"

"సరే, నేను వెళ్తానమ్మా" అన్నాడు సత్య మూర్తి. సత్యమూర్తి వెళ్ళిపోయాడు.

అమిత హేండ్ బ్యాగ్‌లోనుంచి ఓ పాత పేపరు తీసి కింద పరిచింది.

వైదేహి భూపతివర్మను పరిచయం చేసింది.

"నమస్తేనండీ" అంది రెండుచేతులూ జోడించి అమిత.

"తాతయ్యా అని పిలువమ్మా"

"ఓహ్... అలాగే తాతయ్యా" అంది అమిత.

"నా తల్లే, ఎంత ప్రేమగా పిలిచావమ్మా. నా మనవరాలివి ఎప్పుడైనా ప్రేమగా పిలిస్తే ఏంటో... ఈ ముసలాడికి పనిలే దని విసుక్కునేది" బాధగా అన్నాడు భూప తివర్మ.

"బాధపడకు తాతయ్యా... నేను వున్నా నుగా" అంది అమిత.

"గాడ్ బ్లెస్‌యూ మై చైల్డ్" అంటూ అమి తను దగ్గరకు తీసుకొని ప్రేమగా నుదురు మీద ముద్దుపెట్టుకున్నాడు.

అమిత క్యారీబ్యాగ్‌లో వున్న పెరుగన్నం బయటకు తీసింది. వైదేహి ఆ పెరుగ న్నాన్ని మూడు భాగాలుగా చేసింది.

"ఊహూ చిన్నప్పుడు నన్నెత్తుకొని చందమామ రావె... జాబిల్లిరావే... అంటూ తినిపించావుచూడు... అలా తినిపించు" గారాబంగా అంది అమిత.

వైదేహి పెరుగన్నం చేతిలోకి తీసుకొని అమిత నోట్లో పెట్టింది.

"ఇది ఎవరిముద్దా? " అడిగింది అమిత.

ఒక్కసారిగా వైదేహి మనసులో చిన్న ప్రకంపనలు. చిన్నప్పుడు తను ముద్దలు కలిపిపెడుతూ,

"ఇది నాముద్ద... ఇది నాన్న ముద్ద, ఇది అమ్మ ముద్ద" అంటూ తినిపించేది.

"చెప్పు బామ్మా, ఇది ఎవరి ముద్ద? " అడిగింది అమిత.

"ఇది మీ తాతయ్య ముద్ద" అంది గొంతు గాద్గదికమవుతుండగా.

"బామ్మా..." ఆ చేతిని అలానే పట్టుకొని వుండిపోయింది.

భూపతివర్మకు ఆ దృశ్యం ఎంతో అపు రూపంగా తోచింది. ఆర్ద్రత గొప్పతనం అత నికి ఇప్పుడిప్పుడే తెలుస్తోంది.

వైదేహి చీరకొంగుతో కళ్లు తుడుచుకొని భూపతివర్మవైపు చూసింది. ఎందుకో ఆక్షణం అతన్ని చూస్తే జాలేసింది.

అతని మొహంలో అమ్మ ప్రేమ కోసం ఆరాటపడే పసిబిడ్డే కనిపిస్తోంది.

"ఇదిగోండి నాన్నా... ఇది మీ బిడ్డ ముద్ద" అంది అన్నం ముద్దగా చేసి అతని చేతిలో పెడుతూ.

"చాలు తల్లీ చాలు. ఈ ఒక్కమాటతోనే నాకడుపు నిండిపోయింది" అన్నాడు.

అతని మనసంతా గాలిలో తేలుతున్నట్టు వుంది

అమ్మ ప్రేమా, బిడ్డ అనురాగం కలగలిసి కనిపిస్తోంది వైదేహి.

తను తెచ్చిన వాటర్ బాటిల్ ఓపెన్ చేసింది. మంచినీళ్లు తాగారు.

భూపతివర్మ ఓవైపు వెళ్ళి పడుకున్నాడు. ఒకప్పటి జమీందారు శ్మశానంలో నిద్రపో తున్నాడు.

ఇది విధి రాతా?

కన్న పిల్లలు విధించిన శిక్షా?

★ ★ ★

"బామ్మా" అమిత పిలిచింది.

వైదేహి ఒళ్ళో తల పెట్టుకుంది అమిత. ఆమెకు చాలా విచిత్రంగా వుంది.

ఇలాంటి సంఘటనలూ, సన్నివేశాలూ, సినిమాల్లోనో, కథల్లోనో తారసపడతాయి. కానీ ప్రత్యక్షంగా ఇప్పుడు అనుభవంలోకి

వచ్చింది.

శ్మశానంలో తను, బామ్మ... ఒక కొత్త రకమైన అనుభూతి.

భూపతివర్మ ఓ మూలకు ఒదిగి నిద్రపో తున్నాడు. ఈ శ్మశానంలోనే అతనికి ప్రశాం తంగా నిద్రపడుతున్నట్టుంది.

"బామ్మా"

ఏమిటి అన్నట్టు చూసింది వైదేహి.

"నిన్ను చూస్తుంటే గర్వంగా వుంది బామ్మా... సహజంగా వయసుతో పాటు వచ్చే అభద్రతాభావం, నిరాశ, నిర్లిప్తత నీలో ఏమాత్రం లేవు. పైగా ఓ ఆశయం కోసం కఠినమైన నిర్ణయం తీసుకున్నావు. ఒక రచయిత ఎంతో కష్టపడి గొప్పగా తీర్చి దిద్దిన పాత్రలా అనిపిస్తున్నావు. ఓ శిల్పి నిరంతర శ్రమతో తన ఉలిని శ్రద్ధాసక్తు లతో కదిలిస్తూ చెక్కిన అద్భుత శిల్పంలా అనిపిస్తున్నావు. అద్భుతమైన శిల్పాన్ని చూసి బ్రహ్మదేవుడు ప్రాణం పోస్తే అది నువ్వే అవుతావేమో..."

వైదేహి నవ్వి అడిగింది.

"ఢిల్లీలో నువ్వు నేర్చుకున్నది జర్నలి జమా? అద్భుతంగా కథలు రాసే ప్రక్రియా?"

"నిజం బామ్మా... యూ ఆర్ కరక్ట్" అంది అమిత.

"ఇక నిద్రపో. ఎక్కువసేపు మెలకువగా ఉండకూడదు. రేపొద్దునే ఇంటికి వెళ్ళు"

"అబ్బ... ఇంటిని ఎందుకు గుర్తుచేస్తావు బామ్మా"

"తప్పుదుకదమ్మా. నా మంచి అమితవి కదూ" అంటూ మనవరాలిని ముద్దాడింది.

ఆ మాత్రానికే మురిసి, కన్నీటితో మెరిసి పోయింది అమిత.

అలాగే నిద్రలోకి జారుకుంది అమిత. వైదేహికి మాత్రం నిద్రపట్టడంలేదు.

ధైర్యంగా తను ఒక్కడుగు ముందుకే సింది. ఆ తర్వాత మరో అడుగు... ఆ తర్వాత తను వేసే అడుగులు...

'దేముడా, నాకు ఆటుపోట్లను తట్టుకునే స్థయిర్యాన్ని ఇవ్వు' అంటూ భగవంతుడిని వేడుకుంది వైదేహి.

★ ★ ★

సత్యమూర్తి పొద్దున్నే టిఫిన్ తీసుకుని అక్కడికి వచ్చి అక్కడి దృశ్యాన్ని చూసి స్థాణువయ్యాడు.

వైదేహి, భూపతివర్మలు కలిసి పిచ్చిమొ క్కలు తీసేస్తున్నారు.

"అదేమిటమ్మా... నేను కూలీలను తీసుకు వస్తానన్నానుగా. మరో గంటలో వచ్చేస్తారు" చెప్పాడు టిఫిన్ ప్యాకెట్స్ వాళ్ళకు ఇస్తూ.

ఓ చెట్టుకింద కూర్చుని ముగ్గురూ కలిసి టిఫిన్ చేశారు.

"అమిత వెళ్ళిపోయిందా?" అడిగాడు సత్యమూర్తి.

"వెళ్ళలేదు...నేనే బలవంతంగా పంపిం చాను" అంది వైదేహి.

సత్యమూర్తి కళ్ళు ఎర్రగా వుండడం గమ నించింది. ఇంట్లో ఏదో గొడవ జరిగిందని అర్థమైంది.

"నువ్వు ఇక్కడికి వస్తున్నందుకు మీ అబ్బాయీ, కోడలూ ఏమైనా అన్నారా అన్నయ్యా?" అనడిగింది వైదేహి.

సత్యమూర్తి తడబడ్డాడు.

"ఛ...ఛ... అదేంలేదమ్మా"

"ఖచ్చితంగా వుండే వుంటుందన్నయ్యా. నావల్ల మీకు మరిన్ని సమస్యలు వస్తున్నా యికదూ?"

"అదేం లేదమ్మా" అన్నాడు సత్యమూర్తి.

"త్వరలో మనందరి సమస్యలకూ పరి ష్కారం దొరుకుతుందన్నయ్యా" అంది వైదేహి.

'నేను ఆ ఆశతోనే బతుకుతున్నానమ్మా' అనుకున్నాడు మనసులో సత్యమూర్తి.

ఓ గంట తర్వాత కూలీలు వచ్చారు. వైదేహి ఆధ్వర్యంలో కూలీలు తమ పని ప్రారంభించారు.

మధ్యాహ్నం భోజనం సత్యమూర్తి హోట ల్ నుంచి క్యారియర్ పట్టుకువచ్చాడు.

సాయంత్రం ఆరుగంటలకు అమిత క్యారేజ్ పట్టుకువచ్చింది.

పని చాలా ఫాస్ట్‌గా జరుగుతోంది. అమిత ఏం చేయాలో వైదేహి స్పష్టంగా చెప్పింది.

అమిత కళ్ళకు బామ్మ శ్రీకృష్ణపరమాత్ము డిలా కనిపించాడు.

తనకు గీతోపదేశం చేస్తున్నట్టనిపించింది.

"అమితా... ప్రేమంటే భార్యాభర్తల మధ్య, బామ్మ మనవలమధ్యా, అన్నాత మ్ముళ్ళు, అక్కచెల్లెళ్ళ మధ్యేకాదు. విశ్వజ నీయమైన ప్రేమ కూడా ప్రేమే.

"అన్నార్తులు, అనాథలు, బాధాసర్పద్ర ష్టులు ఈ ప్రపంచంలో ఎందరో వున్నారు. ముఖ్యంగా వృద్ధాప్యంతో చివరిదశలో పోరా డుతూ అనాథలైన వాళ్ళు చాలామంది వున్నారు.

"తల్లిదండ్రులులేని పిల్లలే కాదు, పిల్లల నిర్లక్ష్యానికి గురయ్యే తల్లిదండ్రులూ అనా థలే. ఈ ప్రపంచంలో ప్రేమలేనిచోటు లేదు. కానీ దురదృష్టం ఏమిటంటే ఆ ప్రేమను తరిమికొట్టి ద్వేషాన్ని, అసూయను స్వార్థాన్నీ ఆశ్రయిస్తున్నాం.

"మన ప్రేమకోసం తపించే వాళ్ళకు మనం అండగా వుండాలి. అందుకు నువ్వు కూడా మాకు సహకరించాలి"

బామ్మ చెబుతుంటే చాలా శ్రద్ధగా వింటోంది అమిత.

"బామ్మా... నీలో కొత్త మనిషిని చూస్తు న్నాను" అంది అమిత.

నవ్వి ఊరుకుంది వైదేహి.

★ ★ ★

సత్యమూర్తి ఇంటికి వెళ్ళేసరికి రాజేశ్వరి ఏడుస్తూ వుంది. భర్తను చూసి వెంటనే కళ్ళు తుడుచుకుంది. సత్యమూర్తి మన సులో ఏదో అలజడి.

"ఏమైంది రాజేశ్వరీ? " అడిగాడు ఆందోళ నతో సత్యమూర్తి.

"ఏమీలేదండీ..." అంది కళ్ళు తుడుచు కుంటూనే రాజేశ్వరి.

"ఏదో వుంది. నువ్వు కంటతడి పెట్టడం నేనెప్పుడూ చూడలేదు. ఏం జరిగింది? " అనుమానంగా అడిగాడు సత్యమూర్తి.

"నేను చెబుతాను తాతయ్యా" అంటూ వచ్చింది మనవరాలు.

"నా తల్లే చెప్పమ్మా"

"పింకీ నువ్వెళ్ళమ్మా" అంది ఆదుర్దాగా రాజేశ్వరి.

"మమ్మీ 'మిక్సీ ఎందుకు కరెంటు దండగ. ఇడ్లీకి మినపప్పు రోట్లో రుబ్బొ చ్చుగా' అంది. పాపం బామ్మ... మినపప్పు రోట్లో వేసి వచ్చింది. చేతులు ఎర్రగా కంది పోయాయి. మధ్యాహ్నం బామ్మకు కాఫీ కూడా యివ్వలేదు"

సత్యమూర్తి పిడికిళ్ళు బిగుసుకున్నాయి. భార్య చేతులను చూశాడు. పొక్కులు వచ్చాయి.

కోడలి ఆగడాలు రోజురోజుకూ శృతిమిం చడం గమనిస్తూనే వున్నాడు. ఆరోజు అటో ఇటో తేల్చుకోవాలని నిర్ణయించుకున్నాడు.

కోపంగా కోడలి గదివైపు వెళ్ళాడు. రాజే శ్వరి ఎంత ఆపినా విన్లేదు సత్యమూర్తి.

"నువ్వు చేసిన పనేమీ బాగాలేదు" కోపంగా కోడలితో అన్నాడు.

"ఏం పనండీ" అంది వ్యంగ్యంగా.

"మీ అత్తయ్యతో పప్పు రుబ్బించడం... నేనన్నీ గమనిస్తూనే వున్నాను. అయినా సహిస్తూ వచ్చాను. అత్తా మామలు అన్న ఇంగితం కూడా లేకుండాపోతోంది"

"నోరు సంభాళించుకొని మాట్లాడితే మంచిది. ఇక్కడేమీ డబ్బు చెట్లు మొలవ డంలేదు. వేలకువేలు కరెంటు బిల్లులు... మొగుడి సంపాదన అంతా... అడ్డమైన వాళ్ళకు, కాఫీలకు... తిండ్లకే సరిపోతోంది" ఈసడింపుగా అంది.

సత్యమూర్తిలో ఆవేశం పెరిగిపోయింది.

రాజేశ్వరి భయంగా చూస్తోంది.

అప్పుడే కొడుకు వచ్చాడు.

ఏదో జరుగుతోందని అర్థమైంది.

"అబ్బబ్బ... ఇంటికి రాగానే ఇదో న్యూసెన్స్ అయిపోయింది" అన్నాడు చిరాగ్గా తండ్రి వంక చూస్తూ.

"మీ అమ్మను ఆరళ్ళు పెడుతోందిరా... ఎక్కడైనా కోడలిని అత్త రాచిరంపాన పెడుతుంది. ఇక్కడ..."

"చూశారా... చూశారా... నోటికి ఎంత వస్తే అంత అనేయడమే. ఈ సంసారం నావల్లకాదు. చాకిరి చేసిచేసి నా చేతులు పడిపోతున్నాయి. నేను రేపు మా పుట్టింటికి వెళ్లిపోతాను" అడ్డంగా మాట్లాడటం మొదలెట్టింది.

"ఏంటి నాన్నా... అయినా వయసు రాగానే సరా" అన్నాడు మరింత చిరాగ్గా మొహం పెట్టి.

అయిపోయింది, అంతా అయిపోయింది. కనీసం కొడుకైనా అర్థం చేసుకుంటాడని, కోడలిని అదుపులో పెడతాడని, తల్లిబాధ తెలుసుకుంటాడని, తండ్రి తపన అర్థమవుతుందన్న నమ్మకం... సుడిగాలిలా చిగురుటాకులా కొట్టుకుపోయింది.

"ఇదిగో చెబుతున్నా... అందరికి చాకిరీ చేయడం నావల్లకాదు, నేను కావాలో, మీ అమ్మా, నాన్నా కావాలో తేల్చుకోండి" వార్నింగిచ్చింది.

ఈ సమయం కోసమే ఎదుర్చూస్తోంది. ఒకవిధంగా కావాలనే మామగారిని రెచ్చగొట్టింది.

"అబ్బబ్బ.. నేను ఛస్తేగానీ ఈ ఇంట్లో అందరికీ ఆనందం కలిగేలా లేదు" మరింత కోపంగా అన్నాడు అతగాడు.

ఈ సంభాషణ సత్యమూర్తి వింటూనే వున్నాడు.

అతను వినాలనే అలా అరుచుకుంటున్నారు.

అంటే పరోక్షంగా తమని వెళ్ళమని చెబుతున్నారని సత్యమూర్తికి మనసు చివుక్కుమంది.

మౌనంగా తన గదిలోకి వెళ్ళి తన బట్టలూ, తన భార్య బట్టలు సర్దడం మొదలుపెట్టాడు. ఆ రాత్రంతా అతనికి నిద్ర లేదు.

అతణ్ణి ఇంకా అమితంగా బాధపెట్టింది అర్థరాత్రి జరిగిన ఆ సంఘటన.

నిద్రరాక, అటూ యిటూ తిరుగుతూ వుంటే కొడుకు గదిలో నుంచి సంభాషణ వినిపించింది.

"మీ నాన్న ఇంట్లోనుంచి వెళ్ళిపోతాడంటారా?" అది కోడలు గొంతు.

"మానాన్న గురించి నాకు బాగా తెలుసు. ఆయనకు ఆత్మాభిమానం ఎక్కువ. ముఖ్యంగా అమ్మను మాటంటే వూర్కునే రకం కాదు. మనం అన్నమాటలకు వెళ్ళిపోతారని అనిపిస్తోంది"

"మొత్తం మీద ఇన్నిరోజులుగా పూర్తి చేయలేని పని ఇప్పుడు చేస్తున్నాం"

"ఆఁ... నేను సమయానికి గట్టిగా మాట్లాడి, మనం గొడవపడ్డట్టు నటించమని నీకు చెప్పాను కాబట్టి సీన్ పండింది"

"పోనీలెండి. ఏదో ఒకటి. అన్నట్టు వాళ్లు ఎక్కడికి వెళ్తారు?"

"ఉందిగా వైదేహి ఆంటీ"

"అవునవును. ఈమధ్య ఆవిడగారిని చూసుకొని మీనాన్న చెల్లెమ్మా, చెల్లెమ్మా అని మురిసిపోతున్నాడు" అంటోంది కోడలు.

ఒక్కక్షణం తన గుండెను రెండుభాగాలు చేసిన ఫీలింగ్.

తన కన్నకొడుకు, తనని పంపించడానికి అందమైన నాటకం ఆడాడు.

ఆ క్షణమే ఆ ఇంట్లోనుంచి బయటకు వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు సత్యమూర్తి.

★ ★ ★

వైదేహి అక్కడి పనులను పర్యవేక్షిస్తోంది. భూపతివర్మ మరోవైపు కార్పెంటర్

పనులు చూస్తున్నాడు. వైదేహి దృష్టి కుడి వైపున వున్న జంటమీద పడింది. పిచ్చి మొక్కలను తీసేస్తున్నారా జంట.

ఆమెలో ఏదో అనుమానం. వాళ్ల దగ్గరికి వెళ్లింది. వైదేహి అడుగుల శబ్దం విని వాళ్లు చేస్తున్న పని ఆపి ఇటు తిరిగారు.

"అన్నయ్యా మీరా? " సత్యమూర్తిని ఆ పరిస్థితిలో చూసి అడిగింది.

"అవునమ్మా... ఈరోజునుంచి మీ ఆశ్రమంలో నాకూ, నా భార్యకు చోటు కావాలి. నా భార్యను బతికించుకోవడానికి ఇంకా నా ఒంట్లో శక్తి వుంది" సత్యమూర్తి చెప్పాడు.

వైదేహికి పరిస్థితి అర్థమయింది.

"అవునమ్మా... కొడుకు, కోడలు గొప్ప నటులు కదమ్మా. తమ పాత్రలకు జీవం పోసి మరీ నటించారు. కెమేరాలు లేకపోయినాసరే అద్భుతంగా నటించారు" బాధగా చెప్పాడు సత్యమూర్తి.

రాజేశ్వరి మౌనంగా రోదిస్తోంది.

"పదన్నయ్యా... ఈరోజుంచి మీరూ ఆశ్రమంలో ఒకరు. మనలాంటి వాళ్లకోసమే ఈ ఆశ్రమం వుంది. విలువైన కన్నీళ్లను... గుండె బరువెక్కినప్పుడే మనసైన, మనకు దగ్గరైన వాళ్లు మన మనసును కదిలించే వాళ్లు మనకు దూరమైనప్పుడే ఖర్చు చేయవలసిన కన్నీళ్లను అనవసరంగా వృధాచేయకండి" అంది వాళ్లను ఓదారుస్తూ వైదేహి.

★ ★ ★

వాసంతి పత్రికా కార్యాలయం.

అమిత తన స్కూటీని పార్క్‌చేసి ఆఫీసులోకి అడుగుపెట్టింది. సబ్ఎడిటర్లు కంప్యూటర్లముందు కూచోని ఏవో ఆర్టికల్స్ కంప్యూటర్లలో చూసుకుంటున్నారు.

"ఎక్స్‌క్యూజ్‌మీ... ఎడిటర్‌గారిని కలవాలి" చెప్పింది సబ్ఎడిటర్‌తో అమిత.

"అపాయింట్‌మెంట్ వుందా? " అడిగాడతను.

"లేదు. ఢిల్లీలో ఈవినింగ్ డైలీ ఎడిటర్ గారు పంపించారు" చెప్పింది అమిత.

ఆ సబ్ఎడిటర్ ఛాంబర్‌లోకి వెళ్ళి రెండు నిమిషాల్లో తిరిగొచ్చి "మీరు లోపలికి వెళ్ళండి" అన్జెప్పాడు. అమిత లోపలకి అడుగుపెట్టింది.

"విష్ణుశర్మ... ఎడిటర్" అన్న నేమ్‌ప్లేట్ వుంది.

దాదాపు యాభై సంవత్సరాల వయసు వుంటుందతనికి. తెల్లగా వున్నాడు. బట్టతల అతనికి అదోరకమైన డిగ్నిటిని ఇస్తోంది.

కళ్లజోడులో నుంచి అమితవైపు చూస్తూ... "చెప్పండి" అన్నాడు.

"నా పేరు అమిత... ఢిల్లీలో ఈవినింగ్ డైలీలో ఫ్రీ లాన్సర్‌గా చేశాను"

"అమిత అన్నారు కదూ మీ పేరు. నేనూ కొన్ని ఆర్టికల్స్ చదివాను. చాలా బావున్నాయి"

"థాంక్సు సార్. నేను ఇక్కడికి వచ్చేశాను. మీ పత్రికలో ఫ్రీలాన్సర్‌గా స్పెషల్ స్టోరీస్ రాయాలనీ వుంది"

"ఓహ్... వైనాట్ ష్యూర్... టాలెంటెడ్ పర్సన్స్‌కి వాసంతి ఎప్పుడూ స్వాగతం పలుకుతూనే వుంటుంది"

"వన్స్ ఎగైన్ థాంక్సు సార్"

"ఇట్సాల్‌రైట్... ఇంతకీ ఎలాంటి స్టోరీస్ అటెంప్ట్ చేద్దామనుకుంటున్నారు? " ఎడిటర్ విష్ణుశర్మ అడిగాడు.

బామ్మ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి.

"వృద్ధాప్యం గురించి, వృద్ధుల కన్నీటి కథలు స్టోరీస్‌గా రాద్దామనుకుంటున్నాను సార్. అనాథలైన వృద్ధులు, పిల్లలు వుండి, వాళ్ల నిర్లక్ష్యానికి గురైన వృద్ధులు, ఇలా వాళ్ల వ్యధలను కథనాలుగా రాయాలని అనుకుంటున్నాను"

"వెరీ గుడ్... ఇలాంటి కథలే ఎందుకు అటెంప్ట్ చేయాలని అనుకుంటున్నారు? "

"ఇవి కథలు కాదు సార్. నా దృష్టిలో వ్యథలు. మనిషికి వృద్ధాప్యం అనివార్యం అయితే ఆ వృద్ధాప్యంలో ఎవరి తోడు లేకపోవడం ఓ శాపం. అది మన తలరాత

అని సరిపెట్టకోలేం.

యవ్వనంలో మనకు ఎవరితోడు అవసరం లేకపోయినా ఫర్లేదు. కానీ వృద్ధాప్యంలో ఎవరో ఒకరు తోడు వుండాల్సిందే. మోరల్ సపోర్ట్ లేకుండా బతకడం కష్టం. ఒక్కో కథ ఒక్కో కన్నీటి వ్యధను చెబుతుందని నా నమ్మకం. ఎవరూ లేని వాళ్లు కానీ, అందరూ వుండి, ఆ అందరి నిర్లక్ష్యానికి గురైన వాళ్లు కానీ ఎలా బతకాలి? వాళ్లలోని నిరాశ నిస్పృహలను ఎలా పారదోలాలి? "

ఆవేశంగా మాట్లాడుతున్న అమితను అలానే చూస్తుండిపోయాడు విష్ణుశర్మ.

"వెరీగుడ్. మనం రాసే స్టోరీస్ మీద ముందు మనకు నమ్మకం, సరైన అవగాహన వుండాలి. కీపిటప్ మై బేబీ. నీకు పూర్తి స్వేచ్ఛను యిస్తున్నాను. ఇంత చిన్న వయసులో చాలా పరిణితి సాధించావు" అభినందన పూర్వకంగా అన్నాడు విష్ణుశర్మ.

"ఇదంతా మా బామ్మద్వారా నేర్చుకున్నదే సార్. చిన్నప్పుడు శివాజీకి తల్లి దగ్గరుండి గురువైందట. నాకు అన్నీ మా బామ్మే సార్" చెప్పింది అమిత.

"రియల్లీ... అలాంటి గొప్ప వ్యక్తిని నాకు చూడాలని వుంది. ఇప్పుడావిడ ఎక్కడున్నారు? "

"శ్మశానంలో" చెప్పింది అమిత.

"వ్వాట్"

"యస్సార్" అంటూ బామ్మ గురించి క్లుప్తంగా చెప్పింది.

"ఓహ్... వెరీ శాడ్" అన్నాడు బాధగా విష్ణుశర్మ.

"అందుకే సార్, నేను వృద్ధుల కథలు అటెంప్ట్ చేస్తానని చెప్పింది. ముందు మా బామ్మ కథ తోనే స్టార్ట్ చేద్దామని అనుకుంటున్నాను సార్.

"నేను వృద్ధుల కథలు రాసి ఆ వృద్ధుల మీద సానుభూతి చూపమని అడగదల్చుకోలేదు. ఆ వృద్ధుల పట్ల కనీస కర్తవ్యాన్ని నిర్వర్తించండి. వాళ్లకు మానసికంగా చేయూతనివ్వండి. అని చెప్పాలని తపన"

"వెల్... ప్రొసీడ్ బేబీ. ఈరోజే నీ ప్రయత్నానికి శ్రీకారం చుట్టు. అవసరమైతే ఫొటోగ్రాఫర్‌ని తీసుకువెళ్లు. మంచి పారితోషికం కూడా వుంటుంది"

"థాంక్యూ సార్. పారితోషికాన్ని మా బామ్మ నడిపే 'ఈ వేకువ మీకోసం' ఆశ్రమానికి విరాళంగా యిస్తాన్సర్"

"ఆల్ ది బెస్ట్" చెప్పాడు విష్ణుశర్మ.

అమిత లేచింది.

"మిస్ అమితా"

"అమితా అని మీ కూతుర్ని పిలిచినట్టు పిలవండి సార్"

విష్ణుశర్మ గొంతుకేదో అడ్డం పడింది. బహుశా అది బిడ్డల్లేరని బాధేకావచ్చు

"థాంక్యూ అమితా... బట్... నాకు కూతుర్ని ఎలా పిలవాలో కూడా తెలియదమ్మా. ఎందుకంటే నాకు పిల్లల్లేరు" గొంతు గద్గదికమవుతుండగా చెప్పాడు విష్ణుశర్మ.

"ఓహ్... అయాం వెరీసారీ సర్... ఎనీహౌ... ఇకనుంచి నేనే మీ కూతుర్ని అనుకోండి" అంది మనస్ఫూర్తిగా అమిత.

"థాంక్యూ బేబీ" అన్నాడు ప్రేమపూర్వకంగా ఆమె చేయి నొక్కి వదులుతూ.

★ ★ ★

గుర్ఖా కారుని చూసి పరుగున వెళ్ళి గేటు తీశాడు. కారులో నుంచి దిగాడు విష్ణుశర్మ.

డ్రైవర్ వినయంగా డోర్ తెరిచాడు.

"కారు పార్క్‌చేసి కీస్ ఇచ్చి నువ్వు ఇంటికి వెళ్లు" చెప్పాడు విష్ణుశర్మ.

★ ★ ★

వేదవతి చిన్నపిల్లల బొమ్మలన్నీ షోకేసులో నీట్‌గా సర్దుతోంది.

యాభయ్యేళ్ళ వయసులోనే డెబ్భయిపడిలో పడ్డట్టు వుందామె వాలకం.

ఓ పక్కన గౌనులు, పట్టుపరికిణీలు

యింకోపక్క బొమ్మలు.

విష్ణుశర్మ లోపలికి వచ్చి బొమ్మలు సర్దు తోన్న భార్యవంక చూశాడు.

"వేదా" ప్రేమగా పిలిచాడు. ఆమెను చూడగానే అతని మనసు ఆర్ద్రమైంది.

ప్రతిరోజూ ఈ బొమ్మలను నీట్‌గా వుంచుతుంది. ఒక్కో బొమ్మకు ఒక్కో పేరు పెడుతుంది. పిల్లలు లేరన్న బాధ ఆ దంప తులను వేధిస్తోంది.

డబ్బు, పేరు వున్నా అవి అనుభవించడా నికి వారసులు లేరు.

ప్రేమను పంచి పెట్టే బిడ్డల్లేరు. రాత్రి అయ్యిందంటే ఆ ఒంటరితనం మరింత గుర్తుకువస్తుంది.

భర్త పిలుపు విని వెనక్కి తిరిగి "అరె... యివ్వాళ పెందరాళే వచ్చారే... ఏమిటి విశేషం? " అడిగింది.

విష్ణుశర్మ సోఫాలో కూచుని తల వెనక్కి వాల్చి కళ్లు మూసుకున్నాడు.

"ఒక్క నిముషం... వేడివేడి ఫిల్టర్ కాఫీ తీసుకువస్తాను. మీ అలసట అం క్షణంలో ఎగిరిపోతుంది" చెప్పి కిచెన్‌లోకి నడిచింది వేదవతి.

అన్నట్టుగానే రెండు నిమిషాల్లో వేడివేడి ఫిల్టర్ కాఫీ తీసుకువచ్చింది.

సాసర్‌లో సగం కాఫీ ఒంపి భార్యకు ఇచ్చి కప్పులోని కాఫీ తను తాగసాగాడు. అది వాళ్లకు రోజూ అలవాటు. ఒకే కప్పు కాఫీని అలా సాసర్‌తో షేర్ చేసుకుం టారు.

"ఇవ్వాళ ఆఫీసు విశేషాలేమిటి? పాఠ కులు ఏమంటున్నారు? " అడిగింది కార్పెట్ మీద కూచొని భర్త షూ లేస్ విప్పుతూ.

"అబ్బ షూ లేస్ నేను విప్పుకుంటాన్లేరా" అన్నాడు ప్రేమగా.

"ఊహు... మీకు సంబంధించిన అన్ని పనులు నేను చేస్తేనే నాకు తృప్తి" అంది.

విష్ణుశర్మకు సంబంధించిన అన్ని పనులూ వేదవతే చేస్తుంది.

"ఒక్కోసారి నిన్ను చూస్తే నాకు జెలసీగా వుంటుంది వేదా" అన్నాడు విష్ణుశర్మ.

"ఎందుకు? "

"నేను నీలా మంచి భర్తను ఎందుకు కాలేకపోతున్నానని"

"ఛ...ఛ... మీరెప్పుడూ నాకు మంచి భర్తే" అంది వేదవతి.

వాళ్ళిద్దరి మధ్య సంభాషణ ఎప్పుడూ హృద్యంగా, ఆర్ద్రంగా వుంటుంది.

"ఇవ్వాళ ఆఫీసుకు అమిత అనే ఒక మ్మాయి వచ్చింది"

"అంటే మనకు పిల్లలు వుంటే మన అమ్మాయి వయసంత వుంటుందా? "

అలా అని తృప్తిపడ్డం ఆమెకు అలవాటు.

"అవును... మనకు ఆడపిల్ల వుంటే అంతే వయసు వుండేదేమో... చాలా షార్ప్" అంటూ అమిత గురించి క్లుప్తంగా చెప్పాడు.

"అలాగా... అయితే ఆ అమ్మాయిని తప్పకుండా చూడాలండీ" అంది వేదవతి.

"నేను ఇన్వయిట్ చేశాను. అంతే కాదు... మనం స్వయంగా వాళ్ల బామ్మను కలుద్దాం. నాకో నీకో అమ్మ వుంటే అలానే వుంటుందేమో" విష్ణుశర్మ బాధగా అన్నాడు.

విష్ణుశర్మ తల్లిదండ్రులు చిన్నప్పుడే చని పోయారు.

వేదవతి అనాథశరణాలయంలో పెరిగిన అమ్మాయి. ఇద్దరికీ 'నా' అనే వాళ్లు లేరు.

తల్లిదండ్రులు లేనిలోటు, వాళ్ల ప్రేమను చవిచూడలేకపోయామన్న బాధ వాళ్లని ఎప్పుడూ వెన్నాడుతూనే వుంటుంది.

ఓపక్క కన్నవాళ్ల ప్రేమను పొందలేకపో యామన్న బాధ వేధిస్తుంటే మరోపక్క తమకు కన్నపిల్లల్లేరనే బాధ వెంటాడు తోంది.

ఇద్దరూ ఒకరినొకరు ఓదార్చుకుంటారు.

ఒకరికొకరు అమ్మవుతారు, నాన్నవు తారు. వాళ్లకు వాళ్లే పిల్లలవుతారు.

భార్యాభర్తల మధ్య చక్కని కమ్యూనికేషన్ వుంటేనే ఇది సాధ్యపడుతుంది.

★ ★ ★

ఈ వేకువ మీకోసం ఆశ్రమానికి సంబంధించిన పనులు చురుగ్గా సాగుతున్నాయి. భూపతివర్మ, సత్యమూర్తి, రాజేశ్వరి, వైదేహి... అందరూ కలసికట్టుగా పనిచేస్తున్నారు.

కూలీలతోపాటు వాళ్లు పలుగు, పారా పట్టుకున్నారు. చూస్తుండగానే ఆ శ్మశానం అందమైన ఆకృతిని దాల్చుకుంది. ఓ పక్కన శవాలను తగలబెట్టడానికి, సమాధులకోసం స్థలం కేటాయించారు. మిగతా స్థలాన్ని ఆశ్రమంకోసం కేటాయించారు.

ఆ ఆశ్రమంలో ప్రవేశించేవారు తమ జీవిత చివరిక్షణం వరకు వుండొచ్చు

ఒకవేళ ఆ ఆశ్రమంలోనే కన్నుమూసినా ఆ ప్రాంగణంలోనే దహనం చేయబడతారు.

వైదేహి తన దగ్గరున్న డబ్బు లెక్కచూసుకుంది. ఆశ్రమం చుట్టూ ప్రహరీ కట్టించింది. వెదురుబద్దలతో చిన్నచిన్న కుటీరాలు నిర్మించింది. చెట్లను నాటింది. బోర్ వేయించింది. చూస్తుండగానే సినిమా సెట్టింగులా పని చకచకా పూర్తవుతోంది.

రోజూ అమిత వచ్చి బామ్మను పరామర్శించి వెళ్తోంది. అమిత తన వృత్తిలో సీరియస్‌గా మారింది.

అమిత బస్టాప్‌లో నిలబడింది.

ఆమెకో మార్గం దొరికింది. తన గమ్యం ఏమిటో అర్థమైంది.

బామ్మ తనకు ఆదర్శం. ఆమె తనకు ప్రేరణ.

బస్టాప్‌లో నిలబడ్డ అమిత చుట్టూచూసింది. జనం రద్దీగానే వున్నారు. ఆమె కళ్లు ఎవరెవరినో వెతుకుతున్నాయి.

ఓ మూలకు ఇద్దరు ముసలివాళ్లు కనిపించారు. భార్యాభర్తల్లా వున్నారు. మెల్లగా వాళ్ల దగ్గరికి వెళ్ళింది.

వాళ్ల ఎదురుగా చిన్న బొచ్చెలాంటిది వుంది. అందులో పది రూపాయలు వేసింది.

ఆ వృద్ధ దంపతులు ఆశ్చర్యంగా చూశారు.

తనూ మెల్లగా కిందికి వంగింది.

"మీ పేర్లేమిటి? " అడిగింది.

ఆ ఇద్దరూ తమ పేర్లు చెప్పారు.

"మీరిద్దరూ భార్యాభర్తలా? "

"అవును తల్లీ" అన్నారు వాళ్లు.

"మీకు పిల్లలెవరు లేరా? "

ఆ వృద్ధురాలి భర్త నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు"

"ఈ ప్రపంచంలో పిల్లలు లేనివాళ్లు హాయిగా వుంటారు. ఎంతోకొంత మిగల్చుకొని శేషజీవితం హాయిగా గడుపుతారు"

"పిల్లలున్నవాళ్లయితే"

"యవ్వనంలో సంపాదించినదంతా పిల్లలు తీసుకొని, కన్నవాళ్లను తరిమేస్తున్నారు. అప్పుడు యిలా మాలా ముష్టి ఎత్తుకుంటూ వుంటారు"

"మీరు చూస్తే చదువుకున్నవారిలా వున్నారు"

"చదువు కడుపునింపదుకదా... నాకు పదిరూపాయలు దానంచేసి వివరాలు అడుగుతున్నారంటే మీరు పత్రికలవాళ్లయి వుంటారు"

అతని ఊహాశక్తికి ఆశ్చర్యపోయింది.

"ఇంతకీ మీ పిల్లలు ఎందుకు తరిమేశారు? "

"ఏ పిల్లలైనా తమ తల్లిదండ్రులను ఎందుకు తరిమేస్తారో, మా పిల్లలు మమ్మల్ని అందుకే తరిమేశారు"

"అంటే"

"వృద్ధాప్యంలో మాకు సేవలు చేయడం వాళ్లకు భారం. మేము చేసే ఆస్తి పంపకాలు కావాలి. కానీ మా పెంపకం వాళ్లకు యిప్పుడు పట్టదు"

"మీ పిల్లలు మిమ్మల్ని తరిమేస్తుంటే

మీకు బాధనిపించలేదా? "

"అనిపించింది. మా బాధ...వాళ్లకు సంతోషాన్ని కలిగించింది"

"మీ పిల్లల్ని నిలదీయాల్సింది"

"నిలదీసినా, నిగ్గదీసినా ఏమిటి లాభం... మమ్మల్ని కట్టుబట్టలతో పంపించేశాక"

అమితకు బాధేసింది.

ఆ వృద్ధదంపతుల ఫొటోలు తీసుకుంది.

"అమ్మా... ఒక్కమాట" అన్నాడు అతను.

"చెప్పండి" అంది అమిత.

"దయచేసి మా ఫొటోలు పత్రికల్లో వేయకండి. కావాలంటే మా గురించి రాయండి"

"ఏం...ఎందుకని"

"నా బిడ్డల పరువు పోకూడదు. ఈ ప్రపంచం ముందు వాళ్లు దోషులుగా నిలబడకూడదు"

ఒక్కక్షణం కలుక్కుమంది అమిత మనసు. కన్నప్రేమ ఎంత గొప్పదో అర్థమైంది.

ఇంత గొప్పదైన కన్నప్రేమను నిర్లక్ష్యం చేసే పిల్లలమీద పీకలదాక కోపం వచ్చింది అమితకు. ఆ సాయంత్రమే బామ్మ దగ్గరికి బయల్దేరింది.

★ ★ ★

ఆటోలో దిగిన అమితను చూసి ఆనందంగా ఎదురెళ్లింది బామ్మ.

"ఏంట్రా చిట్టితల్లీ హుషారుగా వున్నావు? " అడిగింది బామ్మ.

"ఊహించుకో బామ్మా" అంది అమిత.

"ఏదైనా పత్రికాఫీసులో ఉద్యోగం దొరికిందా? "

ఒక్కసారిగా షాకయింది. "నీకెలా తెలుసు బామ్మా అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలిగావ్? " అడిగింది.

"నీకు సంతోషాన్నిచ్చేది ఈ బామ్మ, ఆ తర్వాత పత్రికాఫీసులో రిపోర్టర్ ఉద్యోగం"

బామ్మ తెలివితేటలకు మురిసిపోయింది.

"నువ్వు వూహించింది నిజం బామ్మా. వాసంతి పత్రికలో స్పెషల్ స్టోరీస్ రాస్తానని చెప్పాను. ఎడిటరుగారు కూడా ఒప్పుకున్నారు"

"వెరీగుడ్. కంగ్రాచ్యులేషన్స్ తల్లీ" అంది మనవరాలిని ముద్దాడుతూ.

తన చేతిలో వున్న స్వీట్‌ప్యాకెట్ ఓపెన్ చేసి భూపతివర్మకు, సత్యమూర్తికి, అతని భార్యకు, బామ్మకు ఇచ్చింది.

వైదేహి, అమిత బయట ఓ చప్టామీద కూచున్నారు.

"చెప్పు అమితా. ఏదో విషయంలో నువ్వు తీవ్రంగా ఆలోచిస్తున్నావు"



"అవును బామ్మా. ఉదయం ఓ వృద్ధదంపతులను కలిశాను. చదువుకున్నవారిలానే వున్నారు. వాళ్ల కథ విని కదిలిపోయాననుకో"

"ఏ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం అంటారు శ్రీశ్రీ.

అలాగే ఏ వృద్ధుల చరిత్ర చూసినా ఏ గర్వకారణం వుండదు. ఏ కొద్దిమందికో తప్ప, వృద్ధాప్యం వరం కాదు"

"అంటే వృద్ధుల సమస్యలన్నీ ఒక్కటేనా? "

"ఖచ్చితంగా... ఒంటరి బతుకు... దుర్భరజీవితం వాళ్లకు శాపాలు"

"వాళ్ల పిల్లలే వాళ్లను తరిమేశారట"

"ఇది వాళ్ల ఒక్కళ్ల సమస్య కాదమ్మా... ఈ దేశంలో చాలా మంది వృద్ధులు ఎదుర్కొంటున్న సమస్య"

"అదేంటి బామ్మా... పెంచి, పోషించి ఎన్నో కష్టనష్టాలకోర్చి, ప్రయోజకులను చేస్తే ఆ పిల్లలు ఇచ్చే బహుమతి ఇదా? దారుణం కాదా? " అంది ఆవేశంగా అమిత.

"దారుణమే... అది దారుణమని... ఇది ఘోరమని వాళ్లకు తెలియాలంటే మరోతరం రావాలి...వాళ్ల పిల్లలనుంచి వాళ్లకి అలాంటి పరిస్థితి ఎదురైనప్పుడు తప్ప, వాళ్లకు అనుభవంలోకి రాదు"

"ఇలా ఎంతకాలం బామ్మా? " అంది అమిత.

"సాగినంతకాలం"



"దీనికి పరిష్కారం లేదా"

"ఆ పరిష్కారం కోసమే 'ఈ వేకువ మీకోసం' ఆశ్రమం"

అమిత బామ్మవైపు చూసింది. బామ్మ మొహంలో అపరిమితమైన ఆత్మవిశ్వాసం.

"బామ్మా... మా పత్రికలో నేనో సెన్సేష నల్ స్టోరీ రాయబోతున్నాను" అంది.

"ఏమిటది? నువ్వు మార్నింగ్ ఇంట ర్వ్యూ చేసిన దంపతుల గురించా?"

"కాదు... నీ గురించి"

అక్కడ ఒక్కక్షణం మౌనం.

"అమితా"

"అవును బామ్మా... నీ కథతోనే ఈ వృద్ధుల వ్యధానికలు మొదలుపెడతాను"

"కానీ, ఈ స్టోరీ అల్లకల్లోలం సృష్టిస్తుంది"

"ఏదైతే అది కానీ బామ్మా... దయచేసి నన్ను నిరుత్సాహపర్చకు"

"కానీ"

"నాకేమీ చెప్పొద్దు బామ్మా"

"అమితా"

"నేను రాస్తున్నానంతే... రేపు మా వాసంతి పేపరు చూస్తే నీకే తెలుస్తుంది" చెప్పి లేచింది అమిత.

★ ★ ★

ఆరోజు వాసంతి పత్రికలో ఓ బామ్మ కథ పేరుతో ఓ రియల్‌స్టోరీ అచ్చయింది. ఆ పత్రికకు మంచి పాపులార్టీవుంది. అద్భు తమైన రీడర్‌షిప్ వుంది.

ఆ ఆర్టికల్ సెన్సేషన్ క్రియేట్ చేసింది. ఆ పత్రికకు వుండే ఓల్డేజ్ రీడర్స్‌ని విపరీ తంగా ఆకట్టుకుంది.

తను ఆ ఆర్టికల్ రాయడం ఎంతటి యిబ్బందికరమో తెలిసి కూడా అమిత ఆ పని చేసింది.

దాని తాలూకు పర్యవసానానికి కూడా సిద్ధపడింది. ఆరోజు సాయంత్రమే దాని తాలూకు రిజల్ట్ బయటపడింది.

★ ★ ★

అమిత ఇంట్లోకి రావడంతోనే రాజారాం ఉగ్రరూపం దాల్చాడు. ముగ్గురు బాబా యిలు, పిన్నిలు కూడా వున్నారు.

"ఏంటది... నువ్వు చేసిన పనేమిటి? నీకసలు బుద్ధివుండే చేశావా? ఓ బామ్మ కథ పేరుతో మన కుటుంబం పరువు రచ్చ కీడుస్తావా?" మండిపడుతూ పత్రికను అమితముందు గిరాటేస్తూ అన్నాడు రాజారాం.

అమిత తాపీగా ఆ పత్రికను చేతిలోకి తీసుకుని తన గదివైపు వెళ్ళబోయింది.

"నిన్నే అడుగుతున్నది. సమాధానం చెప్పకుండా వెళ్తావేంటి? ఎంత సిగ్గుచేటు? ఎంత నామర్దా... ఆఫీసులో ప్రతీ అడ్డమైన వెధవా నిలదీశాడు" కోపంగా అన్నాడు రాజారాం.

"మమ్మల్ని అయితే చీవాట్లు కూడా పెట్టా రన్నయ్యా" భార్గవ అన్నాడు.

"మా అమ్మానాన్నా వాళ్ళు ఉదయమే అక్షింతలు వేశారు" సుభాష్ భార్య అంది.

"అయినా దీనికిలాంటి బుద్ధి పుట్టిందేమి టన్నయ్యా" మూర్తి తల బాదుకున్నాడు.

"చెప్పవే... ఇంతమందిని బాధపెట్టి నువ్వు సాధించేదేమిటి. అసలు నిన్ను పత్రి కలకు రాయమన్నది ఎవరు? ఢిల్లీ వెళ్ళి కంప్యూటర్ కోర్స్ చేస్తానని చెప్పి నువ్వు చేసిన నిర్వాకం ఇదా?" రాజారాం మండిప డుతూనే ఉన్నాడు.

ఓ బామ్మ కథ పేరుతో వైదేహి స్టోరీ వాసంతిలో పబ్లిష్ అవ్వడంతో చాలామంది రాజారాంని నిలదీశారు. వైదేహి అడుగు బయటపెట్టడానికి కారణం ఆ నలుగురు కొడుకులేనని. ఆ కొడుకులు వాళ్ళేనని పేర్ల తోసహా పడింది.

దాంతో తెలిసినవాళ్ళంతా పలకరించ డమో, చీవాట్లు పెట్టడమో చేశారు.

"నాన్న అన్ని మాటలు అంటుంటే మాట్లాడవేంటి? మన ఇంటి పరువు

రోడ్డున పడేయడానికి సిగ్గులేదా? బాధని పించలేదా? నీ కన్న తండ్రే... నీ బాబాయిలే వాళ్ళు" నీలవేణి కూడా యధాశక్తిగా అరిచింది.

"బామ్మని పంపించినప్పుడు ఆ బాధ బామ్మకు కలగలేదా? వాళ్ళు మాత్రం ఆ బామ్మ పిల్లలు కారా? డబ్బుకోసం ఆమెను వేధించలేదా? " నిలదీసి అడిగింది అమిత.

"అంటే ఏంటే నీ ఉద్దేశం? నీ బామ్మను మేం పీక్కుతిన్నామా? " కోపంగా అంది నీలవేణి.

"ఖచ్చితంగా... అందులో సందేహం ఏమాత్రంలేదు. అయినా బామ్మ తన పేరు మీద ఉన్న ఈ ఇల్లు మీకెందుకివ్వాలి? మిమ్మల్ని చదివించలేదా? మీకోసం తాతయ్యా, బామ్మా తమ సుఖాలు, కోరికలు చంపుకోలేదా? మౌనవ్రతాలూ, నిరసనలతో ఓ తల్లి మనసు గాయపరుస్తున్నప్పుడు బాధనిపించలేదా? ఆ తల్లి నిస్సహాయంగా ఇల్లు వదిలి వెళ్తున్నప్పుడు అయ్యో... ఆమె మా కన్నతల్లే... అని అనిపించలేదా? " మరింత వాడిగా, వేడిగా అడిగింది అమిత.

"అన్నయ్యా... ఇలా అయితే లాభం లేదు. తనకు పెళ్ళి చేస్తే తప్ప దారిలోకి రాదు" భార్గవ అన్నాడు.

"పెళ్ళి ఎప్పుడు, ఎవరితో జరగాలో అప్పుడే జరుగుతుంది. నా పెళ్ళి గురించి మీకా బెంగ అక్కర్లేదు" అంది అమిత.

"చేసిన నిర్వాకం చాల్లేగానీ రేపట్నుంచీ ఇంట్లోనే ఓ మూల కూర్చో" కోపంగా అన్నాడు రాజారాం.

"నాకిష్టమైన జర్నలిజాన్ని వదిలే ప్రసక్తి లేదు. నా స్వేచ్ఛను ఎవరూ నిలదీయొద్దు"

"ఊరుకుంటుంటే రెచ్చిపోతున్నావు. మర్యాదగా చెప్పినట్టు చేయ్" కోపంగా హూంకరించాడు రాజారాం.

అమిత అంతకన్నా వేగంగా లోపలికి వెళ్ళింది. పావుగంటలో సూట్ కేసుతో బయటకు వచ్చింది.

"ఎక్కడికి వెళ్తున్నావు? " ఆ ముసల్దాని దగ్గరికా? " కోపంగా అడిగింది నీలవేణి.

"తల్లిదండ్రులుగా అడిగి వుంటే చెప్పేదాన్ని. నాకు స్వేచ్ఛలేని ఇంట్లో వుండాల్సిన అవసరంలేదు. నేను తప్పు చేయనప్పుడు ఎవరికీ తల వంచాల్సిన అవసరంలేదు.

"మీ పేర్లు పేపరుకు ఎక్కించానని అన్నారు చూడండి. నిజమే... కానీ కన్నతల్లిని రోడ్డుకు ఈడ్చిన మీ ఘనత మాటేమిటి? మీలాంటివాళ్ళు కొందరైనా మారతారని. ఎట్ లీస్ట్ ఆలోచిస్తారనే ఆ పని చేశా. గుడ్ బై" అంటూ ముందుకు కదిలింది.

"వెళ్ళు రెండ్రోజులు కడుపుమాడితే నువ్వే వస్తావు" కోపంగా అన్నాడు రాజారాం.

"థాంక్యూ... నీ కూతురుమీద వున్న నీ నమ్మకం నిజమవ్వకూడదని ఆ దేవుడ్ని కోరుకుంటున్నాను" అంటూ బయటకు నడిచింది.

★ ★ ★

"ఎంత సాహసం చేశావమ్మా. నేను అప్పుడే అనుకున్నాను. ఇలాంటి సమస్య ఒకటి వస్తుందని" అన్నాడు ఎడిటర్ విష్ణశర్మ.

అమిత సూట్ కేస్‌తోసహా నేరుగా వాసంతి పత్రికాఫీస్‌కు వచ్చింది. విషయమంతా చెప్పింది.

"ఇప్పుడు ఏం చేద్దామనుకుంటున్నావమ్మా" అడిగాడు విష్ణశర్మ.

"కొన్నిరోజులపాటు మీ ఆఫీసు కీస్ అడుగుదామని అనుకుంటున్నాను"

"ఆఫీసు కీసా? అవెందుకు? " ఆశ్చర్యంగా అడిగాడు విష్ణశర్మ.

"డే టైం ఎలాగూ రోడ్డుమీద వుంటాను. ఫీల్డ్‌లో తిరుగుతాను. రాత్రిపూట పడుకోవడానికి మన ఆఫీసైతే విశాలంగా వుంటుంది. వెరైటీగానూ వుంటుంది"

"అమితవైపు చూశాడు విష్ణశర్మ.

"చెప్పండి సర్. మీరు గూర్ఖాని పనిలోనుంచి తీసేసి ఆ జీతం నాకు ఇవ్వొచ్చు

కూడా. డే టైం జర్నలిస్టు డ్యూటీ, నైట్ గూర్ఖా డ్యూటీ, రెండు ఉద్యోగాలూ చేసినట్ట వుతుంది. అదనపు రాబడి" నవ్వుతూ అంది అమిత.

"బ్రేవ్... వెరీ బ్రేవ్... విషాదాన్ని కూడా ఎంత చక్కగా ఎనలైజ్ చేయగలవు. కష్టాల్లో వున్న వాడికన్నా, ఆ కష్టాల్లో కూడా చిరునవ్వును ఆహ్వానించగలిగేవాడే గొప్ప వాడు అని ఎక్కడో చదివాను. నువ్వు ఎక్కడో వుండడం ఎందుకమ్మా? హాయిగా మీ బామ్మదగ్గరే వుండచ్చుకదా"

"ఉండొచ్చు.. కానీ ఇప్పటికే బామ్మవల్లే నేనిలా తయారయ్యానని, వెనక బామ్మ ఉందని మావాళ్ళ కోపం. ఆ కోపం మరింత పెరిగి వాళ్ళకూ, బామ్మ మీద ద్వేషం ఇంకా పెరిగిపోవచ్చు"

"ఓహో... అదీ కరెక్టే. పోనీ ఓ పని చేస్తే? "

"చెప్పండి సార్. ఎట్‌లీస్ట్ స్టోర్ రూం కీస్ ఇచ్చినా సరే. రోజూ రాత్రి ఎలుకలతో ఫైట్ చేస్తూ గడిపేస్తాను"

"మా ఇంట్లో వుండు" అన్నాడు విష్ణు శర్మ.

"మీ ఇంట్లోనా? " ఆశ్చర్యంగా అడిగింది అమిత.

"ఏం మా ఇంట్లో వుండకూడదా? "

"ఉండకూడదని కాదుకానీ నావల్ల మీకు లేనిపోని ఇబ్బందులు ఎందుకని? "

"మాకెలాంటి ఇబ్బందులూ వుండవు. రావు. కనీసం కూతురులాంటి నువ్వు ఇంట్లో వుంటే మాక్కాస్త మనశ్శాంతిగా వుంటుంది. నా భార్య నిన్ను తన కూతు రిగా చూసుకుంటుంది"

"కానీ...

"ప్లీజ్... ఇంకా కానీలు వద్దు. నువ్వు నాతోపాటే మా ఇంటికి... సారీ మన ఇంటికి వస్తున్నావు"

కొద్దిక్షణాలు ఆలోచించి,

"ఓకే... కానీ ఒక్కషరతు"

"షరతా? ఏమిటి? "

"నేను మీ ఇంట్లో అదే మనింట్లో వుంటాను. యాజె పేయింగ్ గెస్ట్"

"పేయింగ్ గెస్ట్‌గానా? "

"అవును. అలా అయితేనే ఓకే"

"అదేం లింకమ్మా? "

"నేను మీకు ఆర్టికల్సు రాస్తున్నందుకు రెమ్యూనరేషన్ తీసుకోవడంలేదా? ఇదీ అలాగే"

విష్ణుశర్మ ఒక్కక్షణం ఆలోచించి అలానే అన్నాడు.

"హమ్మయ్య... నాకు షెల్టర్ ప్రాబ్లం లేదు. ఈ విషయం బామ్మతో చెబితే సంతోషిస్తుంది" అంది అమిత.

★ ★ ★

వైదేహి ఒక్కక్షణం మౌనంగా వుండిపో యింది.

"కోపం వచ్చిందా బామ్మా" వైదేహి వెనగ్గా వెళ్ళి ఆమె మెడచుట్టూ చేతులు వేసి అంది.

"కోపం కాదమ్మా... బాధ. నువ్వు తొంద రపడ్డావేమోనని"

"లేదు బామ్మా... తప్పదు. ఇనుమును వంచాలంటే వేడిగా ఉన్నప్పుడే సమ్మెటదె బ్బలు తప్పవు"

"సరే... ఇప్పుడేం చేద్దామని అనుకుంటు న్నావు? " అడిగింది వైదేహి.

"సరేలే... ఇంటింటికీ తిరుగుతూ ఏ ఇంట్లో ఎంతమంది వృద్ధులున్నారు. వారి పరిస్థితి ఏమిటో తెలుసుకుంటా. ఒకవి ధంగా జనాభా సేకరణే అనుకో. వాళ్ళ కథలు ప్రతీవారం రాద్దామని అనుకుంటు న్నాను. ఆ కథలవల్ల కొందరైనా మార తారు. మరికొందరైనా ఆలోచిస్తారు అని నా నమ్మకం" అంది అమిత.

"ఆల్ ది బెస్ట్" అంది మనవరాలి నుదుట ముద్దుపెడుతూ.

★ ★ ★

శేషాచలానికి మనసు మనసులోలేదు.

ఆఫీసునుంచి పెందరాళే బయటపడ్డాడు పర్మిషన్‌తో. కాసేపు ఇరానీ హోటల్‌లో కూర్చుని చాయ్ తాగాడు. అర ప్యాకెట్ సిగరెట్లు కాల్చాడు.

అయినా అతనిలో ఇంకా బాధ తాలూకు రియాక్షన్ బయటకు వెళ్ళిపోలేదు.

భార్య సులోచన గుర్తొస్తోంది.

పెళ్ళయిన అయిదేళ్ళకు ప్రెగ్నెన్సీ వచ్చింది. 'ప్రెగ్నెన్సీ ఎంత అందమైన అనుభవం' ఎప్పుడూ అంటూ వుంటుంది సులోచన.

తన తల్లి మరణించింది. దురదృష్టం ఏమిటంటే సులోచనకు కూడా తల్లిలేదు. సవతి తల్లి ఉంది.

తల్లి చనిపోగానే బిడ్డను చూసుకునేవారు లేరనేకారణం చూపించి రెండోపెళ్ళి చేసుకున్నాడు. కేవలం సులోచన తండ్రికి వున్న ఉద్యోగం, ఆస్తి చూసి ఆ సవతి తల్లి పెళ్ళి చేసుకుంది.

అక్కడ్నుంచి సులోచనకు బాధలే. ఎవరో అనామకుడికి సులోచనను కట్టబెట్టాలని చూసింది.

కానీ తను పరిచయం అవ్వడం అందర్నీ ఎదిరించి పెళ్ళి చేసుకోవడంతో సులోచన కథ సుఖాంతం అయింది.

అయితే తనకిష్టంలేని వ్యక్తిని పెళ్ళిచేసుకుందన్న కారణంతో సులోచన తండ్రిని కూతురి దగ్గరకు వెళ్ళనివ్వలేదు సవతి తల్లి.

నువ్వు నీ బిడ్డను చూడ్డానికి వెళ్తే నేను ఉరేసుకు ఛస్తానని బెదిరించింది. భార్య మాటలకు బెదిరిపోయాడు. ఊళ్లో ఉండి కూతుర్ని చూడలేని దుస్థితి. అందుకే వున్న ఆస్తిపాస్తులు తెగనమ్మి భార్యతో ఎక్కడికో వెళ్ళిపోయాడు.

★ ★ ★

సులోచనకు ఏ లోటూ లేదు.

ప్రాణంగా ప్రేమించే భర్త, అందమైన జీవితం, పిల్లలు లేని లోటు తీరుస్తూ ప్రెగ్నెన్సీ వచ్చింది. కానీ ఉన్నలోటు అమ్మ లేకపోవడం. చిన్నప్పుడే అమ్మ ప్రేమకు దూరమైంది. ఇప్పుడు నాన్న ప్రేమ కూడా కరువైంది.

సులోచన తన బాధ ఎప్పుడూ భర్త ముందు వెళ్ళగక్కలేదు. అయినా భార్య బాధ అతనికి తెలుసు.

భార్యంటే అతనికి అపురూపం.

దానిక్కారణం తనకు భార్య మీద ప్రేమ వుండడంకాదు. భార్య చూపించే ప్రేమకు తను తల వంచడమే అంటాడు. తననేపనీ చేయనీయకుండా తనని అపురూపంగా చూసుకునే భార్యంటే ఏ భర్తకు మాత్రం ప్రేమ వుండదు.

★ ★ ★

రాత్రి పడుకోబోయేముందు సులోచన ఓ కోరిక కోరింది. ఆ కోరిక తీరదని తనకూ తెలుసు. అయినా ఆమెలోని బిడ్డమనసు, ఆమెలోని భార్యమనసు, ఆమెలోని ఆడమనసు ఆగలేక అడిగేసింది.

"ఏమండీ... నాకు ఏవేవో తినాలనిపిస్తోంది. రకరకాల పిండివంటలు చేయించుకోవాలని వుంది. అమ్మే కనుక బతికుంటే అమ్మకు చెప్పుకునేదాన్ని. పక్కింటి స్వాతికి సీమంతం చేశారట వాళ్ళ పుట్టింటివాళ్ళు. మనకు ఎటువైపు బంధువులు లేరుకదండీ" అలా అంటున్నప్పుడు సులోచన కళ్ళు కన్నీళ్ళని వర్షిస్తున్నాయి.

శేషాచలం మనసు చివుక్కుమంది. ఆర్థికంగా తనకేలోటూ లేదు. కానీ ఆర్థికస్థితి ఏదీ తనని ఊరడించలేదు. తనకి తల్లిని తెచ్చిపెట్టగలవా? సులోచనకు సీమంతం చేయించే అమ్మను రప్పించగలవా?

ఆమెకిష్టమైన పిండివంటలు చేసే ప్రియమైన వ్యక్తులు ఎక్కడ దొరుకుతారు?

సులోచన ఎప్పుడూ నగలు కావాలనీ, చీరలు కావాలనీ అడగలేదు. పెళ్లయిన నాటినుంచి ఆమె గొంతు విప్పి తన కోరికను చెప్పలేదు.

"నాక్కావల్సింది మీరు... మీరు" అంటుంది. అలాంటి సులోచనకు సీమంతం చేయాలి. ఎలా? అతని సమస్యకు పరిష్కారం కనుచూపుమేరలో వుందని ఆ క్షణం అతనికి తెలియదు.

★ ★ ★

అమిత రాకతో విష్ణుశర్మ ఇంట్లో వాతావరణమే మారిపోయింది. వేదవతిలో మునపటి నిరాశ నిస్పృహలు లేవు.

తన ఇంట్లో కూతురే తిరుగాడుతోందన్న ఫీలింగ్. అమితను కాళ్లు కింద పెట్టనీయడంలేదు. అనుక్షణం అమితా... అమితా అని పిలుస్తూవుంటుంది.

★ ★ ★

"వేదా... టిఫిన్ వడ్డించు... త్వరగా ఆఫీసుకు వెళ్ళాలి" తొందర చేశాడు విష్ణుశర్మ.

"అబ్బ ఆగండి... అమ్మాయి అమితా .. త్వరగా రా... టిఫిన్ చల్లారుతుంది" వేదవతి పిలిచింది అమితను.

"వస్తున్నా మమ్మీ"

"ఇక్కడ నాకు వడ్డించమంటే అక్కడ తీరిగ్గా కూతుర్ని పిలుస్తావేంటి... తను హాయిగా ఏ పదకొండుగంటలకో వెళ్తుంది" అన్నాడు విష్ణుశర్మ.

"మీకేం... ఏ కామత్‌నుంచో, తాజ్ నుంచో టిఫిన్ తెప్పించుకుంటారు. నా చిట్టి తల్లి ఎండలో తిరగాలి. అయినా ఆ ముదనష్టపు అస్సయిన్‌మెంటేమిటి? ఎవరినైనా రిపోర్టర్‌ని పంపించండి"

"ఇది మరీ బాగుంది. నీ కూతురు ఏరికోరి అలాంటి అస్సయిన్‌మెంట్ తీసుకుంది. అద్సరే ముందు నాకు టిఫిన్ పెట్టు"-

"అమ్మాయి వచ్చాకే"

అమిత ఫ్రెషప్ అయివచ్చింది.

"రామ్మా... రా... నువ్వు వస్తే తప్ప నాకు పుడ్డు పెట్టదట మీ మమ్మీ. ముందొచ్చిన చెవులకన్నా వెనకొచ్చిన కొమ్ములు వాడి అని"

"నా కూతుర్ని ఆడిపోసుకుంటారేంటి... నువ్వు తినమ్మా" అంటూ వేడివేడి ఉప్మా, పెసరట్టు ప్లేటులో పెట్టి అమితకు ఇచ్చింది.

విష్ణుశర్మ ప్లేటులో రెండు ఇడ్లీ వేసింది.

"హు... నాకు టిఫిన్ పెడుతున్నట్టు లేదు. రెండు ఇడ్లీ ముష్టి వేస్తున్నట్టు వుంది. అయినా నాకు ఉప్మా, పెసరట్టు పెట్టొచ్చుగా" అన్నాడు ఉప్మా, పెసరట్టు వంక ఆశగా చూస్తూ విష్ణుశర్మ.

"డాక్టర్ ఆయిల్‌ఫుడ్డు పెట్టొద్దని చెప్ప లేదూ? యింకా నయం యిడ్లీ పెట్టాను సంతోషించండి. రేపట్నుంచి కుడుములు పెడతాను" అంది వేదవతి.

అమిత పెసరట్టు తినబోతూ అది వేడిగా వుండడంతో 'అమ్మా' అంది కాలి.

"అయ్యో ఏమైంది తల్లీ" అంటూ అమిత వేలిని నోట్లో పెట్టుకొని వూదింది.

"ఏంలేదు మమ్మీ... వేడిగా వుండడంతో వేలు చుర్రుమంది అంతే" అంది అమిత.

వేదవతి వెంటనే...

"నేను తినిపిస్తానుండు తల్లీ" అంటూ తనే పెసరట్టు తుంచి అమిత నోట్లో పెట్టింది.

★ ★ ★

కారులో కూచున్నాడు విష్ణుశర్మ.

స్కూటీ రిపేరుకు వెళ్ళడంతో తనూ కారు ఎక్కింది అమిత. దారిలో దిగి స్కూటీ మెకానిక్ దగ్గర్నుంచి తీసుకువెళ్తానంది.

వేదవతి అమితవైపు చూస్తూ చేయి ఊపింది.

"అమితా... నిన్ను వేద విసిగిస్తోందా... తన పాతికేళ్ళ ప్రేమను గుండెల్లోనుంచి తీసి నీకు పంచుతోంది. ఆ ప్రయత్నంలో నీకు యిబ్బంది కలిగితే సారీ" అన్నాడు విష్ణుశర్మ.

"డాడీ ఒక్కక్షణం కారాపండి" అంది అమిత.

కారాపాడు విష్ణుశర్మ.

ఇంకా గేటుదగ్గరికి కూడా వెళ్లలేదు కారు. వేదవతి యింకా చేతులూపుతూ టాటా చెబుతూనే వుంది.

సడన్‌గా అమిత దిగడంతో వేద కంగారుగా ముందుకు అడుగులేసింది.

విష్ణుశర్మ కూడా ఎందుకలా అమిత కారు ఆపమందో అర్థంగాక, తనూ దిగాడు.

అమిత పరుగెత్తుకు వెళ్ళి వేదవతిని వాటేసుకుంది. గుండెల్లో నుంచి దుఃఖం తన్నుకొచ్చేస్తోంది.

పేగు తెంచుకు పుట్టిన బిడ్డ కాకపోయినా కొన్నిరోజుల పరిచయంతో వేదవతి చూపించే ప్రేమముందు పసిపాపే అయింది అమిత.

వెక్కివెక్కి ఏడుస్తోంది అమిత.

"ఏమైంది చిట్టితల్లీ" అంటూ అమితను కంగారుగా అడిగింది వేదవతి.

విష్ణుశర్మకు ఆ దృశ్యం హృద్యమనోహరంగా కనిపించింది.

ఈ ప్రేమ పేరేమిటి?

ఈ పాశానికి అర్థమేమిటి?

ఎవరు చెప్పగలరు ఇది కన్నప్రేమకన్నా గొప్పది కాదని?

★ ★ ★

వాసంతి మేగజైన్‌లో రెండో స్టోరీ వచ్చింది. ఆ స్టోరీ రాజేశ్వరి, సత్యమూర్తిలది. అయితే ఈసారి పేర్లు మార్చి రాసింది.

ఇలాంటి స్టోరీలు రెగ్యులర్‌గా వారం వారం వస్తాయని, యిలాంటి వ్యథల కథలు మీకు తెలిస్తే మాకు రాయండి. అంటూ మాగజైన్‌లో యాడ్ కూడా వచ్చింది.

ఈ రియల్ స్టోరీస్‌కు మంచి రెస్పాన్స్ వచ్చింది. పత్రిక ఇండెంట్ కూడా పెరిగింది.

★ ★ ★

అమిత రోజూ తన సర్వే కొనసాగిస్తూనే వుంది. ప్రజల్లో ఒక విధమైన ఆసక్తి మొదలయింది.

విష్ణుశర్మ ఇంట్లో అమిత కలిసిపోయింది. అమితకు వేదవతి చీరలు, నగలు కొనిపెట్టింది.

అమిత వద్దని వారించినా విన్లేదు.

"నువ్వే నా కూతురివి" అంటూ పొంగిపోతోంది.

ఒక్కోసారి ఆ ప్రేమను చూసి, యింత ప్రేమ తను తట్టుకోగలనా? అని అమితకు అనిపిస్తూ వుంటుంది.

అమిత పేరు పాఠకుల్లో మార్మోగిపోతోంది. వాసంతి సర్క్యులేషన్ కూడా వార వారానికి పెరుగుతూ వుంది.

★ ★ ★

"రామ్మా... నాకు చాలా సంతోషంగా వుంది. క్రమం తప్పకుండా పత్రిక చదువుతున్నాను" అంది వైదేహి.

ఆరోజే అమిత వైదేహి దగ్గరికి వచ్చింది. రెండు వారాలుగా సర్వేవల్ల వెళ్ళలేకపోయింది.

ప్రజలతో కలిసినప్పుడు అమితకు బోల్డు విషయాలు తెలిసాయి. ఇన్నాళ్లు తనకు తెలిసిందే ప్రపంచం అనుకుంది.

ఇప్పుడు ప్రపంచం ఎంత విశాలంగా వుందో?. ఆ ప్రపంచంలోని మనుషుల్లో ఎంత వ్యథ వుందో. కన్నతల్లిదండ్రుల పట్ల పిల్లల మనస్తత్వాలు ఎంత ఘోరంగా వున్నాయో తెలుస్తోంది.

వృద్ధులను కదిలిస్తే వాళ్లు చెప్పే కథల వ్యథలు గుండెల్ని కోసేస్తున్నాయి. వాళ్లందరికీ తను పరిష్కారం చూపించలేకపోవచ్చు కానీ, వాళ్లకు పరిష్కారం చూపించే వాళ్లను తను చూపించగలదు.

అలాంటి బాధా సర్పదష్టులకు, వృద్ధులకు చేయూతనిచ్చే ఆశాకిరణం 'ఈ వేకువ మీ కోసం'. అమితకు బామ్మను చూస్తుంటే గర్వంగా వుంది.

★ ★ ★

"బామ్మా... నువ్విచ్చిన ప్రేరణతోనే నేను యింతగా ఎదిగాను" మనస్ఫూర్తిగా అంది అమిత.

★ ★ ★

ఆశ్రమం పనులు పూర్తికావచ్చాయి. అక్కడొకటి, అక్కడొకటి, కుటీరాలు, పచ్చని చెట్లు, ఆహ్లాదకరమైన వాతావరణం.

కొన్నాళ్లలోనే ఎంతమార్పు.

'ఈ వేకువ మీ కోసం' ఆశ్రమం ప్రారంభం కావడానికి ఆయత్తమవుతోంది.

బ్యాంకు ముందు స్కూటీని ఆపి పార్క్‌చేసి హ్యాండ్‌బ్యాగ్ డిక్కీలో నుంచి తీసుకొని భుజానికి తగిలించుకొని బ్యాంకు



లోపలికి అడుగుపెట్టింది అమిత.

బ్యాంక్ రష్‌గా వుంది. క్యూ కూడా పెద్దగానే వుంది. టైమ్‌లోగా ఆఫీసుకు వెళ్ళాలి. స్పెషల్ స్టోరీ అర్జంట్‌గా ప్రింటింగ్‌కు వెళ్ళాలి. ఆ హడావిడిలో వుంది అమిత.

బ్యాగ్‌లో నుంచి చెక్ తీసి చేతిలో పట్టుకుంది. క్యూ చాలా స్లోగా మూవ్ అవుతోంది. క్షణక్షణానికి అసహనంగా వాచీ చూసుకుంటోంది.

దాదాపు పది నిమిషాలు పట్టింది.

షిట్ అనుకుంది విసుగ్గా.

చెక్‌ను కౌంటర్లో ఇచ్చింది.

సిగ్నేచర్ వెరిఫై చేశాడు. సెల్ఫ్ అని వుంది. ఓసారి అమితవైపు చూశాడు, ఆ కౌంటర్‌లో కూచొన్న విభావర్.

స్టన్నింగ్ బ్యూటీ అనుకున్నాడు.

"హలో" అంది అమిత విభావర్‌లో చలనమేమీ కనిపించకపోయేసరికి.

వెంటనే తేరుకొని అమౌంట్ చూశాడు. అయిదువేలు.

డ్రా లాగి యాభైరూపాయల నోట్ల బండిల్ ఒకటి ఇచ్చాడు. అదే అతను చేసిన పొరపాటు.

యాభైరూపాయల బండిల్ అనుకొని, అమితను చూసిన హడావిడిలో అయిదువందల రూపాయల బండిల్ ఇచ్చాడు.

అమిత కూడా అదేమీ చూడకుండా హడావిడిగా ఆ నోట్లకట్టను బ్యాగులో వేసుకొని బయటకు వెళ్ళింది.

స్కూటీ స్టార్ట్ చేసింది.

★ ★ ★

నెక్ట్స్ వచ్చిన మరొకతను యాభైవేల రూపాయల చెక్ ఇచ్చాడు.

అప్పుడు వెలిగింది విభాకర్ మెదడులో లైటు. తన డ్రాలో అయిదు వందల రూపాయల బండిల్ ఒకటి వుండాలి. వెంటనే కంగారుగా చూసుకున్నాడు. అది లేదు.

ఆ స్థానంలో యాభైరూపాయల బండిల్ వెక్కిరిస్తూ కనిపించింది.

ముచ్చెమట్లు పోశాయి. ఒకటి కాదు. రెండు కాదు. ఏకంగా నలభై అయిదువేల రూపాయల తేడా అక్షరాల.

వెంటనే బయటకు వచ్చి కొలీగ్‌ని బతిమిలాడి క్యాష్ కౌంటర్‌లో కూచోబెట్టి బయటకు పరుగెత్తాడు.

★ ★ ★

# ఏరిన ముత్యాలు

✦ ఇతరులు నీకు ఏది చెయ్యరాదని భావిస్తావో అటువంటి పని ఇతరులకు చెయ్యకు.

– ఉపనిషత్తు

✦ విద్య శరీరానికి వ్యాయామం, మనసుకు ఆహ్లాదం ఇచ్చేదిగా ఉండాలి.

– ప్లేటో

✦ పుష్పానికి పరిమళం ఎంత ముఖ్యమో మనిషికి వ్యక్తిత్వం అంతే అవసరం.

– విక్టర్‌హ్యూగో

✦ కృతజ్ఞతాపూర్వకంగా చేసిన ఒక చిన్న ప్రార్థన అన్నింటికన్నా ఎంతో పరిపూర్ణమైన ప్రార్థన.

– జి.ఐ.లెస్సింగ్

✦ తను చేసిన పొరపాట్లకు ప్రతి ఒక్కరు ఇచ్చే చక్కని పేరు అనుభవం.

– ఆస్కార్‌వైల్డ్

✦ ప్రతిదాంట్లో అందం దాగి ఉందిగానీ ప్రతివారు దానిని గమనించరు.

– కన్‌ఫ్యూసియస్

✦ మౌనంగా ఉండు లేదా నీ మాటలు నిశ్శబ్దం కంటే విలువైనవిగా వుండటానికి ప్రయత్నించు.

– పైథాగరస్

✦ క్రమశిక్షణ అనేది కొలిమిలాంటిది. అందులో తెలివి లేక ప్రజ్ఞ ఒక శక్తిలా తయారవుతుంది.

– జె.డబ్లు.గౌతే

✦ ధైర్యం ఒక గుణం మాత్రమే. కొంతవరకు అది వివేకంతో నిర్దేశింపబడుతుంది.

– ఎఫ్.పివిలోస్

✦ ఏదయిన గొప్ప పని చెయ్యి. రోజంతా దాని గురించి ఆలోచించకు.

– చార్లెస్‌కింగ్లే

✦ బలహీనమైన మనసు శరీరాన్ని బలహీనపరుస్తుంది.

– రూసో

✦ విద్యయొక్క ప్రయోజనం వ్యక్తియొక్క శీలాన్ని నిర్మించేది అయి ఉండాలి.

– హెచ్. స్పెన్సర్

✦ విలువైనదిగా జీవితాన్ని కొలవాలంటే చర్యలు ముఖ్యంకానీ వయసుకాదు.

– షేరిడన్

సేకరణ: ఎ.రాంబాబు

అమిత స్కూటీ కిక్ కొట్టింది. స్టార్టవ లేదు. మరింత అసహనంగా కిక్ కొట్టింది. అయిదారుసార్లు ట్రయ్‌చేశాక స్కూటీ స్టార్టయింది. థాంక్‌గాడ్ అనుకుంటూ స్కూటీని స్టార్ట్ చేసింది. అప్పుడే ఎవరో 'మేడమ్' అని పిలిచినట్టు వినిపించింది.

★ ★ ★

విభావర్ బయటకు వచ్చేసరికి స్కూటీ స్టార్ట్ చేస్తోన్న అమిత కనిపించింది. ఇందాక కౌంటర్లో కనిపించినావిడ ఈవిడా ఒక్కరేనని పోల్చుకున్నాడు.

ఆ స్టన్నింగ్ బ్యూటీనే తన కొంప ముంచ బోయిందని ఫీలవుతూనే 'మేడమ్' అని పిలిచాడు. అప్పటికి స్కూటీ వెళ్ళిపోయింది.

వెంటనే తన స్కూటర్ వైపు పరుగెత్తాడు. కీసుకోసం జేబులో చేయిపెట్టాడు. కీస్ లేవు. వాటిని క్యాష్ కౌంటర్‌లో టేబుల్‌మీద పెట్టినట్టు గుర్తొచ్చింది.

ఇప్పుడు తాపీగా లోపలికి వెళ్తే, ఆ అమ్మాయి వెళ్ళిపోతుంది.

వెంటనే తక్షణ కర్తవ్యం గుర్తొచ్చి అటుగా వెళ్తున్న ఆటోని ఆపి.

"ఏయ్ ఆటో... అర్జంట్‌గా ఆ స్కూటీని ఫాలో అవ్వు" చెప్పాడు లోపల కూచుంటూ.

"నా పేరు ఏయ్ ఆటో కాదు. బోనగిరి" అన్నాడు ఆటోశాల్తీ.

"అబ్బ.. నీ పేరు ఏదో ఒకటి లేవయ్యా... నాకు బిపి రెయిజవ్వకముందే ఆ స్కూటీని ఫాలో అవ్వు. ఇప్పటికే స్కూటీ చాలా దూరం వెళ్లింది"

"అంత అర్జంటా? అయితే మీటర్‌మీద పది ఎక్స్ట్రా"

విభావర్‌కు ఏడుపు తన్నుకొచ్చేసింది.

"మీటర్‌మీద కాకపోతే ఆటోమీద పది కాకపోతే పాతిక పెడతాను లేవయ్యా. ముందు ఆ స్కూటీని ఫాలో అవ్వు" అన్నాడు.

"నిజంగా మీటర్‌మీద పాతికిస్తావా?" అనుమానంగా అడిగాడు ఆటోడ్రైవర్.

విభావర్ కోపంగా ఆటోడ్రైవర్‌వైపు చూడ్డంతో ఆటోని స్టార్ట్ చేశాడు.

అప్పటికే స్కూటీ చాలాదూరం వెళ్ళింది. సినిమాలోలా చేజింగ్ మొదలైంది. స్కూటీ ఈజీగా పద్మవ్యూహాన్ని ఛేదించినట్టుగా ఫాస్ట్‌గా వెళ్తోంది.

ఆటో ఆకారం దృష్ట్యా ఫాస్ట్‌గా వెళ్లలేకపోతోంది.

"త్వరగా వెళ్లవయ్యా. స్కూటీ కనిపించడంలేదు" ఆందోళనగా అన్నాడు విభావర్.

"ఆ స్కూటీమీద వున్న లడ్కీ నీకేమవుద్ది?" ఆటో డ్రైవ్‌చేస్తూనే అడిగాడు.

వస్తోన్న కోపాన్ని తమాయించుకున్నాడు విభావర్. ఆటో సడన్‌గా ఆగింది.

"మధ్యలో ఆపావేమిటయ్యా?" కోపంగా అడిగాడు విభావర్.

"నామీద గుస్సా చేస్తారేంటి సార్. పెట్రోల్ అయిపోతే ఆటో ఆగిపోక, పీటీ ఉషలా పరుగెడుతుందా?"

"షిట్. పెట్రోల్ వున్నదీ లేనిదీ ముందే చూసుకోవద్దా?"

"నాకేం తెలుసు... అయినా నా ఆటోలో పెట్రోల్ వుందా? లేదా? అని మీరు అడగకపోయారా?" ఆటోవాలా ఎదురు మాట్లాడాడు.

ఆటో పెట్రోల్ బంకు దగ్గర ఆగింది. ఆటో దిగాడు. ఇప్పుడు ఎక్కడికి వెళ్లగలడు? బ్యాంకుకు వెళ్ళి అడ్రస్ చూసి ఇంటికి వెళ్ళడమే అనుకున్నాడు.

ఆటోవాడికి డబ్బులిచ్చాడు.

★ ★ ★

సడన్‌గా స్కూటీ ఆగింది.

ఓ పక్కగా స్కూటీని ఆపింది. వెహికిల్ ఎందుకు ఆగిందో అర్థంకాలేదు. అప్పుడు డౌట్ వచ్చింది. తను పెట్రోల్ కొట్టించి రెండ్రోజులు అయ్యింది, ఈమధ్య బాగా తిరిగింది. పెట్రోల్ అయిపోయి

వుంటుంది.

ఆ అనుమానం రావడంతోనే టాంక్ ఓపెన్‌చేసి చూసింది. ఒక్కచుక్క కూడా లేదు. పక్కనే వున్న పెట్రోల్ బంకు దగ్గరికి నడిపించింది. టైం చూసుకుంది.

మరోసారి షిట్ అనుకుంది. బంక్ ముందు క్యూ.

ఛీ... ఇక్కడా క్యూనే... అనుకుంది. ఓ ఆటోవాలా ప్యాసింజర్‌తో డిస్కస్ చేస్తున్నాడు.

"ఏయ్ ఆటో త్వరగా వెళ్లవయ్యా" విసుక్కుంది.

★ ★ ★

ఒక్కసారిగా విభావర్ ఎలర్టయ్యాడు.

ఈ గొంతు ఎక్కడో విన్నట్టుంది? అనుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో అమిత కూడా ఆ ప్యాసింజర్ శాల్తీని చూసి ఈ మనిషిని ఎక్కడో చూసినట్టుంది? అనుకుంది.

సడన్‌గా గుర్తొచ్చింది అమితకు.

అదే సమయంలో విభావర్‌కు కూడా గుర్తొచ్చింది. వెంటనే గట్టిగా యురేకా అని అరిచేశాడు. అందరూ వింతగా చూశారు.

★ ★ ★

పగలబడి నవ్వుతోంది అమిత.

విభావర్ మొహమంతా ఎరుపురంగు పులుముకుంది. "నేను యింత సీరియస్‌గా నా ట్రాజెడీ చెబితే నవ్వుతారేంటండీ. నేనెంత కంగారుపడిపోయానో తెలుసా. ఒకేసారి యాభై అయిదువేల తేడా వచ్చేసరికి" అన్నాడు.

విభావర్ అమితను గుర్తుపట్టగానే సంతోషంతో యురేకా అని అరిచేసి అమిత దగ్గరికి వెళ్లి తనెందుకింత సంతోషంగా అరిచిందీ చెప్పాడు.

అంతా విని పగలబడి నవ్వింది అమిత.

"ఇలాంటి ఫీట్లు, సినిమాల్లో చూస్తాం... ఇప్పుడు రియల్‌గా చూశానంది అమిత.

"ఇప్పుడలానే వుంటుంది కానీ నాకెంత టెన్షనో చెప్పలేను" అని టైం చూసుకొని "అయ్యో చాలా లేటయింది. నేను వెళ్తానండీ" అన్నాడు.

"ఓహ్... అలానే" అంది అమిత.

ఇద్దరు ఓ హోటల్‌లో కూచొని కాఫీ తాగారు.

"నేను వెళ్తానండీ" మరోసారి అన్నాడు విభావర్.

"అలాగేనండీ"

"ఆ డబ్బు యిచ్చేస్తే నేను వెళ్తానండీ" సిగ్గుపడుతూ అన్నాడు.

"ఓహ్... అయామ్ సారీ" అంటూ హ్యాండ్‌బ్యాగ్‌లో నుంచి అయిదు వందల రూపాయల బండిల్ తీసిచ్చింది.

విభావర్ అందులో నుంచి పది నోట్లు తీసి అమితకు ఇచ్చి మిగితా డబ్బు తను తీసుకున్నాడు.

"నేను డ్రాప్ చేయనా?" అడిగింది అమిత.

"అబ్బే వద్దులెండి" అన్నాడు ఇబ్బందిగా ఫీలవుతూ విభాకర్.

"ఫర్లేదు చెప్పండి"

"అబ్బే వద్దండి"

"ఓ.కె.బై" అంది అమిత.

"బై" అంటూ ముందుకు కదిలాడు విభావర్.

★ ★ ★

స్కూటీ స్టార్ట్ చేస్తుంటే.

"హలో..." అన్న మాట వినిపించి వెను తిరిగి చూసింది.

"మీరా?" అంది విభావర్‌ని చూసి.

"అవునండి... యిందాక మీరు లిఫ్ట్ ఇస్తానన్నారు కదూ"

"డ్రాప్‌చేస్తానన్నాను" అంది అమిత.

"డ్రాప్ చేస్తారా?" అడిగాడు సిగ్గుపడుతూ విభావర్.

"యిందాక వద్దన్నారుగా"

"మీరు ఫోర్స్‌చేస్తారేమోనని చూశాను"

అమితకు నవ్వొచ్చింది.

"సరే రండి" అంది.

★ ★ ★

బ్యాంకు దగ్గర అతన్ని డ్రాప్‌చేసింది. తన విజిటింగ్ కార్డ్ ఇచ్చాడు విభావర్.

"ఓహ్... ఇప్పుడు నేను నా విజిటింగ్ కార్డ్ ఇవ్వాలి కదూ" అంటూ తన విజిటింగ్ కార్డు హ్యాండ్‌బ్యాగులోనుంచి తీసి ఇచ్చింది.

"థాంక్యూ వన్స్ ఎగైన్... డ్రాప్ చేసినందుకు... నా డబ్బు నాకు సురక్షితంగా అందించినందుకు" అన్నాడు విభావర్.

"వెల్‌కమ్" అని చెప్పి స్కూటీ స్టార్ట్‌చేసింది.

స్కూటీ కనుమరుగయ్యేవరకూ అలానే చూస్తుండిపోయాడు విభావర్.

లవ్ ఎట్ ఫస్ట్‌సైట్ అంటే ఇదేనా? అతనిలో డైలమా?

ఒక చిన్న సంఘటన తన జీవితాన్ని మరో మలుపు తిప్పుతుందని విభావర్‌కు ఆ క్షణం తెలియదు.

★ ★ ★

వాసంతి పత్రికలో రాసిన స్టోరీస్‌కు మంచి రెస్పాన్స్ వచ్చింది. అమిత రోజూ ఉత్తరాల స్పందన చూస్తూనే వుంది. కొంత మంది వృద్ధులు పెద్దపెద్ద పదవుల్లో వుండీ రిటైరై కొడుకుల నిర్లక్ష్యానికి గురైన మాజీ అధికారులు వాసంతి పత్రికకు ఉత్తరాలు రాశారు.

వాసంతి పత్రికలో 'ఈ వేకువ మీకోసం' ఆశ్రమం గురించి వివరాలు ప్రచురించారు. దానికి ఊహించని స్పందన వచ్చింది.

అమిత అన్ని ఉత్తరాలను నిశితంగా పరిశీలించింది. వైదేహి సూచనమేరకు స్వయంగా ఆ వృద్ధులను కలిసింది. వాళ్ల పరిస్థితిని చూసింది. మొదటి విడతగా ఓ పదిమంది 'ఈ వేకువ మీకోసం' ఆశ్రమంలో జాయినయ్యారు.

వైదేహి మనసులో ఏం ఆలోచనవుందో అమితక్కూడా అర్థంకావడంలేదు. కానీ ఒక్కటి ఖచ్చితంగా అర్థమైంది. బామ్మ ఏది చేసినా అందులో అర్థం, పరమార్థం వుంటుందని.

★ ★ ★

శేషాచలం స్వగృహఫుడ్స్ లోపలికి అడుగుపెట్టాడు. రాత్రి సులోచన తనకు సున్నివుండలు తినాలని చెప్పడం గుర్తుంది.

"సున్నివుండలు కావాలి" చెప్పాడు శేషాచలం.

"సారీ సార్... అయిపోయాయి" షాపతను చెప్పాడు.

మరో షాపులో ట్రయిచేశాడు. నాలుగైదు స్వగృహ ఫుడ్స్ తిరిగాడు. ఎక్కడా దొరకలేదు.

చివరికి ఓ హోటల్‌లో పావుకేజీ ప్యాక్ చేయించి తీసుకువెళ్లాడు.

★ ★ ★

"ఎలా వున్నాయి?" రాత్రి ఇంటికి వచ్చాక పడగ్గదిలో తనే స్వయంగా సున్నివుండల ప్యాక్ ఓపెన్‌చేసి భార్య నోట్లో పెట్టి అడిగాడు.

"ఇంట్లో చేసిన వాటిలా లేవు. పైగా షుగర్ తక్కువగా వున్నట్టు అనిపిస్తోంది. ఫ్రెష్‌గా కూడా లేవు" అంది సులోచన.

"సారీ" అన్నాడు శేషాచలం.

వెంటనే తను చేసిన తప్పేమిటో అర్థమైంది. తనకోసం ప్రేమగా తీసుకువచ్చిన వాటిని తను వెంటనే మొహం మీదే బాగా లేవని అనేసింది.

"నేనే మీకు సారీ చెప్పాలి. పాపం కష్టపడి నా కోసం తీసుకువచ్చారు"

"ఛ...ఛ... అదేం లేదు... రేపు నాకు తెలిసిన స్వగృహ ఫుడ్స్‌లో కనుక్కుంటాను" అన్నాడు శేషాచలం.

"వద్దులెండి. ఎందుకో మిరపకాయ బజ్జీలు తినాలని అనిపిస్తోందండి" అంది పొట్టమీద చేయి వేసుకుంటూ సులోచన.

"అయితే ఒక్క నిముషం వుండు" అంటూ లేచి బట్టలు వేసుకున్నాడు.

"ఇప్పుడా... ఇప్పుడేమీ వద్దండీ" అంది కంగారుగా సులోచన.

"ఏం కాదులే" అంటూ చెప్పులేసుకొని బయటకు నడిచాడు.

టైం చూసుకుంది. రాత్రి పదిన్నర ఒక్కసారిగా తనమీద తనకే కోపం వచ్చింది సులోచనకు. ఛ... ఇంత రాత్రివేళ భర్తను బయటకు పంపింది.

భర్తకోసం హాలులో కూచుంది.

క్షణాలు... నిమిషాలు... అరగంట... గంట గడిచింది. సులోచనలో కంగారు పెరిగింది.

ఏమైంది. యింతసేపు ఎక్కడికి వెళ్ళినట్టు. అయ్యో దేవుడా. మనసులో ఆందోళన.

పన్నెండవుతుండగా వచ్చాడు శేషాచలం. అతని చేతిలో మిరపకాయ బజ్జీల పొట్లం.

వేడివేడిగా వున్నాయి.

"ఇంతసేపు ఎక్కడికి వెళ్ళారండి" భయంగా అడిగింది.

"మన వీధి చివర దొరుకుతాయేమోనని వెళ్ళాను. అప్పటికే కట్టేశారు. పక్కవీధిలో ట్రైయ్ చేశాను. దొరకలేదు. క్రాస్‌రోడ్స్‌లో అయితే గ్యారంటీగా దొరుకుతాయని బయల్దేరాను.

ఆటో దొరకలేదు. వెళ్ళేప్పుడు నడుచుకుంటూ వెళ్లాను. అప్పుడే బండి తీస్తున్నాడు. ఓ పది రూపాయలు ఎక్కువ యిస్తాననేసరికి వేడివేడిగా మిరపకాయ బజ్జీలు వేసిచ్చాడు. లక్కీగా ఆటో దొరికింది. తిను" అంటూ పొట్లం విప్పాడు. లోపల మిరపకాయ బజ్జీలు వేడిగా వున్నాయి.

ఉల్లిపాయ సన్నగా తరిగి ఇచ్చాడు.

ఒక్కక్షణం ఏమీ మాట్లాడలేదు. భర్తను చుట్టేసింది.

"ఏయ్ సులోచనా... ఏంటిది? "

"నన్ను కాసేపు యిలానే వుండనీయండి. అర్ధరాత్రుళ్లు తాగొచ్చి భార్యను చితకబాదే వాళ్లను, కట్నంకోసం భార్యలను వేధించేవాళ్లను చూశాను. కానీ ఇలా" ఆమెకు దుఃఖం తన్నుకొచ్చేస్తోంది.

"ఏయ్ పిచ్చా... ఏమిటిది? నువ్వు నాకోసం నేను నీకోసం? మనం ఒకరికోసం మరొకరు బతుకుదాం. ముందా బజ్జీలు తిను. వేడివేడిగా ఎంత బావున్నాయో" అన్నాడు శేషాచలం.

భార్యాభర్తల అనుబంధానికి యింతకన్నా గొప్ప ఉదాహరణ మరేముంటుంది?

★ ★ ★

"హలో... శేషాచలంగారు. ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నారు? " విభావర్ అడిగాడు శేషాచలాన్ని.

విభావర్ శేషాచలం ఒకే పోర్షన్‌లో పక్క పక్క ఇళ్లలో వుంటారు. విభావర్ ఒంటరిగా వుంటున్నాడు. మంచి స్నేహితులు.

"ఏంలేదు... మా ఆవిడ గురించే ఆలోచిస్తున్నాను"

"ఏమిటి... సులోచనగారికి ఏమైంది? " ఆదుర్దాగా అడిగాడు విభావర్.

"ఏమీలేదు. తనకెవరూ లేరనే ఫీలింగ్. అసలే ప్రెగ్నెన్సీ కదా. ఈ టైంలో ఎవరైనా తోడు వుంటే బావుండని.. ఆమెకు తల్లి లేదు. నాకూ లేదు. చిన్నచిన్న కోరికలు. డబ్బుతో అన్ని సమస్యలను పరిష్కరించుకోలేము కదా"

"పోనీ... మీకు దగ్గరి బంధువులు ఎవరూ లేరా? "

"బంధువులతో సంబంధాలు లేవు. మాతో అవసరమైతే తప్ప వాళ్లు రారు"

"పోనీ... మీరే వెళ్లకూడదా. సులోచనగారి డెలివరీ అయ్యేవరకు తోడు వుండమని చెప్పండి. మీమీద ప్రేమతో కాకపోయినా ఇప్పుడు మీరు మంచి పొజిషన్‌లోనే వున్నారు కాబట్టి తప్పకుండా వస్తారు"

ఆ ఆలోచన శేషాచలానికి నచ్చింది.

★ ★ ★

"ఏంటండీ ఆలోచిస్తున్నారు?" అడిగింది సులోచన.

"మన బంధువుల లిస్టు గురించి" అన్నాడు శేషాచలం.

"మన బంధువుల లిస్టా?"

"అవును... నాకు పిన్ని వరసకు దూరపు బంధువు ఒకావిడ వుంది. ఇంకా ఇద్దరు, ముగ్గురున్నారు"

"అయితే ఏమిటి?"

"వాళ్ళలో ఎవరో ఒకరిని రమ్మంటాను. మా పిన్ని పెద్దావిడ... ఆవిడను ఇక్కడకు తీసుకువస్తే నీకు తోడుగా వుంటుంది. మనకు పెద్దదిక్కుగా కూడా వుంటుంది.

కనీసం కొన్నిరోజులపాటు అయినా వుండమని అడుగుతాను. వెళ్ళేటప్పుడు ఏదో ఒకటి ఇచ్చి పంపించొచ్చు"

ఆ ఆలోచన సులోచనకు కూడా నచ్చింది.

"మనకు పెద్దదిక్కు వున్నట్టు వుంటుంది. త్వరగా ఆ పని చూడండి" అంది సులోచన.

తనింట్లో ఓ పెద్ద దిక్కు వుంటే ఎంత బావుంటుంది. సులోచనకు అలాంటి కోరిక చాలా రోజులుగా వుంది.

శేషాచలం వెంటనే ఆ పనిలో మునిగిపోయాడు.

★ ★ ★

విభావర్ అద్దంముందు నిలబడి తయారవుతున్నాడు. అద్దంలో తన ప్రతిబింబం కనపడ్డం మానేసింది. అదేమిటి కొంపదీసి నేను దెయ్యంగా మారానా? దెయ్యాల ప్రతిబింబాలు అద్దంలో కనిపించవుగా అనుకున్నాడు తనలో తనే విభావర్.

ఆ తర్వాత తన ప్రతిబింబం స్థానంలో ఓ ఆడ ప్రతిబింబం కనిపించసాగింది.

ఈ శాల్తీని ఎక్కడో చూసినట్టుందే అనుకున్నాడు. మెల్లమెల్లగా ఆ ప్రతిబింబాన్ని పోల్చుకునే ప్రయత్నం చేయసాగాడు.

కళ్ళు, ముక్కు, శంఖంలాంటి మెడ, ఆ పలువరుస, చిర్నవ్వూ... వెంటనే ఆ ప్రతిబింబాన్ని పోల్చేశాడు. ఆ ప్రతిబింబం అమిత.

అంటే తన మనసులో ఆమె వుండిపోయింది. ఆ ఆలోచన రావడంతో తనలోతనే సిగ్గుపడిపోయాడు.

ఈ మధ్య విభావర్ ఆలోచనలు అన్నీ ఇలానే వుంటున్నాయి. బ్యాంకుకు వచ్చే ఆడకస్టమర్లలో అతను అమితనే చూడసాగాడు.

ఆమె ఎప్పుడైనా బ్యాంకుకు రాకపోతుందా? అని అనుకోసాగాడు. అయితే ఈమధ్య అయిదువేల రూపాయలు యాభై నోట్లకట్ట ఇచ్చేప్పుడు మాత్రం చాలా జాగ్రత్తగా వుంటున్నాడు.

అమిత ఆలోచనలు అతనికి అమితానందాన్ని ఇస్తున్నాయి. తను ప్రేమలో నిండా మునిగిపోయాడని అర్థమైంది.

ఎలాగైనా ఇవాళ అమితను కలవాలని నిర్ణయించుకున్నాడు. తనను గుర్తుపట్టకపోతే ఎలా? ఏదేమైనా అమితను కలవాల్సిందే అని డిసైడైపోయాడు.

★ ★ ★

తన స్కూటర్‌ని పత్రికాఫీసు ముందు పార్క్ చేసి లోపలికి వెళ్ళాడు.

"ఎవరు కావాలండీ?" ఓ సబ్‌ఎడిటర్ అడిగాడు.

"అమితగారు"

"వన్ సెకండ్..." అంటూ అతను ఇంటర్‌కమ్ బటన్ నొక్కి మేడమ్ మీకోసం ఎవరో వచ్చారు అని చెప్పాడు. తర్వాత విభావర్ వైపు తిరిగి,

"మీ పేరేమిటండీ?" అని అడిగాడు.

"విభావర్"

"విభావరట మేడమ్"

ఒక్క క్షణం ఆగి "మీరు రైట్‌సైడ్ క్యాబిన్‌లోకి వెళ్ళండి" అని చెప్పాడు.

★ ★ ★

విభావర్‌ని చూసి వెంటనే గుర్తుప

ట్టింది.

"హలో... మీరా రండి" అంది.

విభావర్ ఆమె ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

ఏం మాట్లాడాలో తోచలేదు.

"చెప్పండి" అంది.

ఏం చెప్పాలో తోచలేదతనికి.

అతను ఫ్రీగా మూవ్ అవ్వడంలేదని అర్థమైంది. బాయ్‌ని పిలిచి కాఫీ తీసుకురమ్మంది.

అయిదు నిమిషాల్లో కాఫీ కప్పులతో ప్రత్యక్షమయ్యాడు బాయ్.

కాఫీ తాగాక అంది అమిత.

"ఇప్పుడు చెప్పండి?"

"మీరెందుకు వచ్చారని అడగరుగా?" భయంగానే అన్నాడు విభావర్.

"నేను అడగనుగానీ మీరే చెప్పండి?" వస్తోన్న నవ్వును ఆపుకుంటూ అంది అమిత.

"ఎందుకని అడిగితే... చెప్పలేను"

"పోనీ చెప్పనక్కర్లేదులెండి" అంది అమిత అతని ఇబ్బంది గమనించి.

"ఆ... ఇప్పుడు చెబుతా" అన్నాడు ఒక్కసారిగా.

"చెప్పండి" అంది.

"మీరోసారి మా ఇంటికి రావాలండీ" అన్నాడు.

"నేనా? మీ ఇంటికా? ఎందుకు?"

"అదిగో మళ్ళీ ఎందుకు? ఏమిటి అని అడుగుతున్నారు"

"సరే... వస్తాన్లెండి. మీ అడ్రస్ అదే మీ ఇంటి అడ్రస్ ఇవ్వండి" అంది అమిత.

తన ఇంటి అడ్రస్ క్లియర్‌గా చెప్పాడు.

"సీరియస్‌గానే వస్తానంటున్నారా?" కన్‌ఫర్మ్ చేసుకోవడంకోసం అడిగాడు.

"సీరియస్‌గానే చెబుతున్నాను" అంది అమిత.

కాసేపు వుండి విభావర్ వెళ్ళిపోయాడు.

విభావర్ ప్రవర్తన విచిత్రంగా అనిపించింది. ఏదో ఓ కార్నర్‌లో అతను ఆమెను అట్రాక్ట్ చేశాడు.

★ ★ ★

"అమ్మాయి వెళ్ళి ఎన్ని రోజులైందో గుర్తుందా?" అడిగింది నీలవేణి.

"గుర్తుంది ఏం చేయను? వెళ్ళి బతిమిలాడి తీసుకురానా?" చికాగ్గా అన్నాడు రాజారాం.

కూతురు లేనిలోటు తెలుస్తూనే వుంది. అతనికి అమిత అంటే ఇష్టమే. ఒక్కర్తే సంతానం కాబట్టి గారాబంగా పెంచాడు.

రోజూ కళ్ళముందు కదలాడే కూతురు కనిపించకపోవడం అతనికీ వెలితిగానే వుంది. అదీగాక కూతురు ఏ అత్తారింటికో, చదువుకోసమో దూరంగా వుండడం వేరు.

కేవలం తనమీద కోపంతోనే వెళ్ళిపోయింది. ఇదే ఊళ్ళో వుంటూ పరాయిదానిలా మారిపోయింది. రెండ్రోజులక్రితం కూతుర్ని రోడ్డుమీద చూశాడు.

పలకరించాలన్న కోరికను బలవంతాన అణుచుకున్నాడు. అతనికి ఇగో అడ్డం వచ్చింది. అతనిలో క్రమక్రమంగా ఆత్మ పరిశీలన మొదలవుతూ వస్తోంది. ఏదైనా మనం కోల్పోయినప్పుడే దాని విలువ మనకు తెలిసివస్తుంది.

"ఏమండీ అమ్మాయిని చూడకుండా నేను వుండలేనండీ. ఏదోవిధంగా నయానో, భయానో మనమ్మాయిని తీసుకురండి"

"ఎలా తీసుకురాను నీలవేణి. అదేం చిన్నపిల్లా... అయినా చిన్నదానికి దానికే అంత పౌరుషం వుంటే కన్నవాళ్ళం మనకు ఎంతుండాలి?" అన్నాడు ఉక్రోషంగా రాజారాం.

కానీ అతని మనసులో ఆ గాంభీర్యం దూదిపింజెలా తేలిపోతోంది.

"ఇల్లంతా బోసిగా వుందండీ... ఒకప్పుడు అత్తయ్యతో, మామగారితో, అమితతో ఈ ఇల్లు ఎలా కళకళలాడుతూ వుండేదో?" అనుకోకుండా అనేసింది నీలవేణి.

రాజారామ్ మాట్లాడలేదు. మాట్లాడడానికి అతని దగ్గర మాటలు కరువయ్యాయి. ఎందుకోసమో ఈ తాపత్రయం అన్న విశ్లేషణ మొదలయ్యింది.

తెలిసిన బంధువులు అమిత ప్రసక్తి తీసుకువస్తే ఇబ్బందిగా వుంటుంది. మీ అమ్మాయికి సంబంధాలు చూస్తున్నారా? అని ఎవరైనా అంటే ఏం సమాధానం చెప్పాలో



అర్థంకావడంలేదు. అతను చాలా ఇబ్బందికర పరిస్థితిలో పడిపోయాడు. ఆ ఇబ్బందులనుంచి అతను బయటపడాలని అనుకుంటే అతనిలో ఆత్మవిశ్లేషణ మొదలవ్వాలి.

వైదేహి కుటీరంలోనుంచి బయటకు వచ్చింది. వెన్నెల వెలుతురు ఆ కుటీరం మీద పడి వెండిలా మెరిసిపోతోంది.

ఆ ఆశ్రమం అంతా పవిత్ర పుణ్యక్షేత్రంలా అనిపిస్తోంది. కొన్నాళ్ళ క్రితం సమాధులతో, కాలుతున్న చితిమంటలతో, పిచ్చిమొక్కలతో భయానకంగా కనిపించిన ఆ ప్రదేశం ఇప్పుడు ముగ్ధమనోహరంగా వుంది. ఋషులు తపస్సు చేసుకునే మునివాటికలా వుంది. చల్లటిగాలి ఆ ప్రాంతాన్ని పరామర్శిస్తోంది. పూలచెట్లు పలకరిస్తున్నాయి.

అందరూ నిద్రపోయారు. వైదేహికి నిద్ర రావడంలేదు. నిద్ర అందరికీ వరం. నిద్ర రాకపోవడం వైదేహికి శాపం.

కళ్ళు మూసి ఆ కనురెప్పల లోపల తన భర్త ప్రతిరూపాన్ని చూడాలనే కోరిక నెరవేరడంలేదు. ఆలోచనలు... మనసును కుదిపేసే జ్ఞాపకాలు. భర్త స్మృతులు ఆమెకు వేనవేల ఆనందశ్రుతులు. భర్త తన ఎదురుగా వుండి మాట్లాడుతున్న ఫీలింగ్.

"ఏమిట్రా... ఏమిటాలోచిస్తున్నావు? నిద్ర రావడంలేదా. పడుకో. ఎన్నాళ్ళిలా నిద్ర లేకుండా వుంటావు. నువ్వు నిద్రపోతే నేను కలలోకి వస్తాను. నువ్వు నవ్వితే నీ పెదవులమీదికి చిరునవ్వునై వస్తాను. నువ్వు శ్వాసిస్తే ఉచ్ఛ్వాసమై వస్తాను.

నువ్వు నిశ్వసిస్తే నిశ్వాసమై పోతాను. చివరికి నువ్వు కంటతడి పెడితే కన్నీటి చుక్కనై కదిలి నేలరాలి నీకోసం ఆత్మార్పణమైపోతాను"

వైదేహి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. భర్త ఆలోచనలు మృదుమధురమైపోయాయి. ఏరా అన్న పిలుపులో ఎన్ని వేనవేల, లక్షల, కోటానుకోట్ల మమతానురాగాలు ప్రోది చేసుకుని వున్నాయి.

ఆ పిలుపు వింటే చితినుంచి లేచి చిటికిన వేలు పట్టుకొని తను మళ్ళీ తన భర్తతో సప్తపది నడవదూ!... ఆ పిలుపులోని మాధుర్యం ఎవరికి తెలుసు. అది అనుభవైకవేద్యం.

అలా అలా ఆలోచిస్తూ అరుగుమీద కూర్చుని అలా ఒక్కక్షణం కళ్ళు మూసుకుంది.

ఆ పాటి నిద్ర చాలు అన్నంత ఇదిగా నిద్రపట్టేసింది వైదేహికి.

★

# ఏరినముత్యాలు

* రోజూ చూస్తున్న నీ పొరుగువాడినే ప్రేమించలేని నీవు ఏ రోజూ కనిపించని ఆ దేవుడ్ని ఎలా ప్రేమించగలవు?

  – ఏసుక్రీస్తు

* మనలో వుంటే సహజశక్తులే మన ఆరోగ్యానికి నిజమైన ఔషధాలు.

  – హిపొక్రేట్స్

* దేవునిలో వున్న అందాన్ని ఊహించగల్గినపుడు సృష్టిలో వున్న అందాన్ని చూడటం తేలిక అవుతుంది.

  – భగవద్గీత

* దక్షిణ ఇవ్వడమంటే వైరాగ్యాన్ని అలవర్చుకోవడం, భక్తి జ్ఞానాలను పొందడం.

  – సాయిబాబా

* ఇతరుల కళ్లతో చూసి మన అభిప్రాయాలు మార్చుకొంటే మనం నాశనమైపోతాం.

  – ఫ్రాంక్లిన్

* బతకటం గొప్పకాదు ఆదర్శంకోసం ఆత్మార్పణచేయటం గొప్ప.

  – పొట్టిశ్రీరాములు

* నీకు ఏదీ తెలియదని అర్థమైనప్పుడే అన్నీ తెలుసుకునేందుకు సిద్ధపడతావు.

  – మదర్‌థెరిస్సా

* న్యాయం కోసం కోర్టుకు వెళ్లడమంటే పిల్లికోసం ఆవును వదులుకోవడం లాంటిది.

  – చైనా సామెత

* చాలామంది స్త్రీలు అసలు ప్రేమించరు. ఒక మగవాణ్ణి ఎన్నుకొంటారు, అతన్ని ప్రేమించికాదు, అతని ప్రేమను పొందటం కోసమే

  – అల్ఫాంజా

* తనకుతాను గురువైన వ్యక్తి లోక గురువు కాగలుగుతాడు.

  – జిడ్డు కృష్ణమూర్తి

* ఆచరణ మానవజాతికి ఉత్తమ పాఠశాల. వారు మరొక చోట నేర్చుకోలేరు.

  – ఎడ్మండ్‌బర్గ్

* అధికారంలో ఉన్నట్లయితే స్నేహితుల్ని కోల్పోయినట్లే.

  – హెన్రీబ్రూక్స్ఆడమ్స్

* చెడు పని చేయకుండా ఉండటమే మంచిది. ఎందుకంటే మనిషి తర్వాత పశ్చాత్తాపపడవలసి వస్తుంది.

  – ధర్మపథ

సేకరణ: ఆచంట సుబ్రమణ్యం

శేషాచలం నాలుగురోజులపాటు ఆఫీసుకు సెలవు పెట్టాడు. వరుసకు పిన్ని అయ్యే బంధువుకోసం వెతికాడు. చివరికి ఆ అడ్రస్ దొరికింది.

తననుతాను పరిచయం చేసుకున్నాడు. అతని ఉద్యోగం, అతని ఆర్థిక స్థితిగతులు వెంటనే అంచనా వేసిందావిడ.

"ఇన్నాళ్ళకు గుర్తొచ్చామా బాబూ? " అంటూ వెంటనే ప్రేమ ఒలకబోసింది.

శేషాచలం చేతిలో ఖరీదైన స్వీటు ప్యాకెట్లు ఉన్నాయి. వాటిని పిన్ని చేతికి ఇచ్చాడు. ఆమె మొహం మతాబులా వెలిగింది.

"ఇవ్వన్నీ ఎందుకుబాబూ? మీ అమ్మ నాకు అక్కయ్య వరుస అవుతుంది. వరుసేమిటి? అక్కయే అనుకో. నీకోసం చాలా చోట్ల వాకబు చేశాను. కానీ నీ అడ్రస్ దొరకలేదు. పోనీలే బాబూ. ఇప్పటికైనా కలిశాం" అంది.

ఆ మాత్రానికే పొంగిపోయాడు శేషాచలం.

ఆవిడ మాత్రం శేషాచలం చేతికున్న ఉంగరాలను, మెడలో వున్న గొలుసును చూస్తోంది.

"పిన్నీ... నీతో ఓ విషయం మాట్లాడాలని వచ్చాను" అన్నాడు మొహమాటంగా.

"అయ్యో... ఎంతమాట. చెప్పు నాయనా? " అంది ఆవిడ.

"మీ కోడలు ఇప్పుడు గర్భవతి. కొన్నాళ్ళపాటు తనకు తోడు కావాలి"

పిన్ని ఒక్కసారి శేషాచలం మొహంలోకి చూసింది. ఆమె ఓ అంచనాకు వచ్చింది.

"అలాగా... పాపం. దాందేముందిలే బాబూ. కానీ ఏం చెప్పమంటావు? మీ బాబాయిని స్టాఫ్ ఎక్కువయ్యారని ఉద్యోగంలోనుంచి తీసేశారు. ఇంట్లో ఇప్పుడు నేనే మగదిక్కును అయ్యాను.

"మీ బాబాయికి ఏమీ చేతకాదు. నెలకు రెండుమూడు వేలైనా లేనిదే ఇల్లు గడవదు. పోనీ పెద్దదానికి ఇల్లు అప్పగించి వద్దామన్నా ఏదో నేను నా పాట్లుపడి ఆ డబ్బు తీసుకువస్తే తప్ప ఇల్లు గడవదు" ఆమె తన బాధాయణం మొదలుపెట్టింది.

"ఎంతమాట పిన్నీ. నువ్వు మా ఇంటికి వచ్చి సులోచనకు కొన్నాళ్ళు తోడుగా వుండాలేగానీ, ఆమాత్రం సర్దలేనా? నెలకు రెండు వేలు నేను సర్దుతానులే పిన్నీ"

వెంటనే ఆవిడ మొహం విప్పారింది.

"అయ్యో... నీ దగ్గర డబ్బు తీసుకోవడమా? " ఇబ్బందిగా మొహం పెట్టి అంది ఆవిడ.

"మనలో మనకు తేడాలేమిటి పిన్నీ? "

"నీదెంత మంచి మనసు బాబూ. మీ అమ్మది కూడా నీలానే వెన్నలాంటి మనసు"

శేషాచలం జేబులోనుంచి పర్సుతీసి రెండువేలు తీసి పిన్నిచేతికి ఇచ్చాడు.

ఇబ్బందిగా తీసుకున్నట్టు నటిస్తూ తీసుకుని "మనం ఒక గంటలో బయల్దేరుదాం. ఈలోగా పిల్లలకు చెప్పవలసిన జాగ్రత్తలు చెబుతాను. పనిలోపనిగా మీ బాబాయితో కూడా చెబుతాను" అంటూ లోపల గదిలోకి వెళ్ళింది.

శేషాచలానికి సంతోషంగా ఉంది. తను తన భార్య కోరిక తీరుస్తున్నాడు. అది చాలు.

★ ★ ★

లోపలి గదిలోనుంచి పిన్నిమాటలు పెద్దగా వినిపిస్తున్నాయి.

"ఏమిటీ... మీ ఖర్చులకు మరీ అయిదు వందలు కావాలా? ఇంకా నయం, నేను అబ్బాయిని ఎలా అడగ్గలను? ముగ్గురూ ఆడపిల్లలే. మగపిల్లాడులేడు. మీ సాదరు ఖర్చులకు కూడా నేనే ఇవ్వాలా? "

ఆ మాటలు గట్టిగానే వినిపిస్తున్నాయి.

శేషాచలానికి వినిపించాలనే ఆవిడ మాట్లాడుతోందని అతనికి తెలియదు.

వెంటనే మరో అయిదువందలు తీసి చేతిలో పెట్టుకున్నాడు. తయారై ఓ సంచీ

తీసుకుని బయటకు వచ్చి అతని చేతిలో డబ్బుచూసి "అరెరె... నువ్వు అంతా విన్నావా? ఏం చేయను బాబూ. అంతా నా ఖర్మ" అంది బాధ నటిస్తూ.

"ఫర్లేదు పిన్నీ" అంటూ ఆ అయిదు పిన్ని చేతిలో పెట్టాడు.

ఆవిడ తన కూతుళ్ళను పరిచయం చేసింది.

"మీ అన్నయ్య. మీ పెళ్లిళ్లకు బెంగ అవసరంలేదు. మీకు అన్నయ్య వున్నాడుగా" అంది.

వాళ్ళు చాలా హుషారుగా తలలు ఆడించారు. శేషాచలంతోపాటు ఆవిడ బయటకు నడిచింది.

★ ★ ★

ఆ ఇంట్లో భార్యాభర్తలిద్దరి మధ్య సంభాషణ జరుగుతోంది.

సత్యమూర్తి కొడుకు, కోడలు మధ్య సంభాషణ అది.

"ఇవాళ్ళే అపాయింట్ మెంట్ ఆర్డర్ వచ్చింది. ఎప్పుడో అటెండ్ అయిన ఇంటర్వ్యూ. లక్కీగా వచ్చింది. జీతం నాలుగువేలకు పైమాటే" అది భార్య గొంతు.

"కంగ్రాట్స్. ఇంకేమిటి. ఈ నెల నుంచి మనకు రెండు ఆదాయాలు" అతను ఉత్సాహంగా అన్నాడు.

"కానీ... మన పాప"

"పాపకేమైంది? "

"పాపను చూసుకునేవాళ్ళు లేరుగా"

"ఓ పన్చేద్దాం. ఎవరైనా పనిమనిషిని పెడదాం"

పొద్దున్నే వంట చేయడానికి, బట్టలు ఉతకడానికి"

"దానికీ ఓ పనిమనిషి పెడదాం. తప్పదు మరి. ఆదాయం వచ్చినప్పుడు కొంత ఖర్చు పెట్టాలిగా"

అయిన ఆవిడలో ఇంకా ఏదో ఆలోచన.

ఈ సమయంలో అత్తగారు, మామగారు వుంటే బావుండని అనేది ఆమె ఆలోచన.

అయితే అది రియలైజేషన్‌తో వచ్చిన ఆలోచన కాదు.

అవసరంతో వచ్చిన ఆలోచన. వాళ్ళు తమకు పనికి వచ్చేవాళ్ళుకదా అన్న స్వార్థంతో వచ్చిన ఆలోచన.

ఈ వేకువ మీ కోసం ఆశ్రమంలో పదిమందివరకు చేరారు. ఆరుగురు స్త్రీలు, నలుగురు పురుషులు. ఆ పదిమంది పరిస్థితి పరిశీలించాకే చేర్చుకుంది వైదేహి.

అందులో కొందరు కొడుకులు, కోడళ్ల నిర్లక్ష్యానికి గురైన వాళ్లు కాగా మరికొందరు



ఎవరూ లేని అనాథలు.

పొద్దున్నే కాయగూరలు తరగడం, టిఫిన్ చేయడంలాంటి పనులు వైదేహి, రాజేశ్వరి కలిసి చేస్తున్నారు. ఆశ్రమంలో కూరగాయల చెట్లు పెంచుతున్నారు.

ఆశ్రమానికి సరిపడ కూరగాయలు అందులో పండుతున్నాయి.

భూపతివర్మ కూడా తనకు చేతనైన పని చేస్తూనేవున్నాడు.

వైదేహి ఆశ్రమంలోకి వచ్చిన వాళ్ళకు మొదటిరోజే చెప్పింది. ఇది ఒకే కుటుంబం

అని. ఒకే కుటుంబంలా కలిసివుండాలని.

★ ★ ★

ఎర్లీమార్నింగ్.

ఇంకా పూర్తిగా తెల్లవారనేలేదు. మంచు కురుస్తోంది. వైదేహి నిద్ర లేచింది. మిగతా అందర్నీ నిద్ర లేపింది.

భూపతివర్మ, సత్యమూర్తి, రాజేశ్వరి అందరూ లేచారు.

"అలా మార్నింగ్‌వాక్‌కు వెళ్ళొద్దాం" చెప్పింది వైదేహి అందరికి.

"మార్నింగ్ వాకా?" కొంతమంది ఆశ్చర్యంగా అడిగారు.

"అవును. ఈ వయసులో జాగింగ్ చేసే శక్తి మనకు వుండదు. సరదాగా మనం అలా కాసేపు నడిచివద్దాం" చెప్పింది వైదేహి.

"ఈ వయసులోనా?"

"నడక ఆరోగ్యానికి మంచిది. మనసుకు ఉత్తేజాన్ని, ఉల్లాసాన్ని కలగజేస్తుంది. అలా కబుర్లు చెప్పుకుంటూ నడుద్దాం" అంది.

వైదేహి మాట కాదనలేక చలికి వణుకుతూనే మార్నింగ్‌వాక్ మొదలుపెట్టారు.

మంచు కురుస్తోంటే, మంచులో తడుస్తూ ఆ వయసులో కూడా నడుస్తుంటే ఆ దృశ్యం మనోహరంగా వుంది.

వైదేహి వాళ్ళను ఉత్సాహపరుస్తూ నడుస్తోంది. దాంతో వాళ్ళకు హుషారొచ్చింది. మొదట ఇబ్బందిగా అనిపించినా, కొద్ది దూరం నడిచేసరికి హుషారొచ్చింది.

దాదాపు పావుగంటసేపు వాకింగ్ చేశారు. రోడ్డుకు ఓ వైపు కాసేపు విశ్రాంతి తీసుకొని మళ్ళీ నడక మొదలెట్టారు. అలా అరగంటపాటు నడిచి ఆశ్రమానికి తిరిగివచ్చారు. చిత్రంగా వాళ్ళకు ఏ ఒంటినొప్పులు లేవు. పైగా ఎంతో హుషారుగా వున్నారు.

మొన్నమొన్నటివరకు ఎవరు ఎవరో ఎవరికీ తెలియదు. అయినా అంతా కలిసిపోయారు. వైదేహి అందరికీ వేడివేడి ఫిల్టర్ కాఫీ ఇచ్చింది. ఆ కాఫీ గొంతులో పడగానే అందరికీ పోయిన ప్రాణం లేచి వచ్చినట్టయింది.

కొందరికైతే కళ్ళలో నీళ్ళు తిరిగాయి. కన్నబిడ్డలు కూడా ఇలా మమ్మల్ని మార్నింగ్ వాక్‌కు తీసుకెళ్ళివుండరు. కోడళ్లు ఇలా ఒక్కరోజైనా ప్రేమగా కాఫీ ఇవ్వలేదు.

ఆరుబయట కూచొని అందరూ వేడివేడి కాఫీ తాగుతుంటే అలా ప్రశాంతంగా వుంది.

వైదేహి గొంతు సవరించుకుంది.

"ఇది మన కోసం మనం ఏర్పాటు చేసుకున్న ఆశ్రమం. ఇక్కడంతా కలిసివుందాం. మన రక్తసంబంధం కాకపోవచ్చు. ఏ బంధుత్వమూ లేకపోవచ్చు. అందరిదీ స్నేహబంధం. అంతకుమించి మానవతా సంబంధం.

ఎవరికి చేతనైనపని వాళ్ళు చేయొచ్చు. తీరికవేళల్లో అప్పడాలు చేయొచ్చు. వడియాలు పెట్టవచ్చు. అవి మనకు ఉపయోగపడ్డమే కాదు. మార్కెట్‌లో కూడా అమ్మకోవచ్చు.

ఈ వయసులో మనకు మనమే తోడు. మనల్ని మనమే బతికించుకుందాం. మీరు చేయవలసిన పనులు చాలా వున్నాయి. మీకు ఇష్టమైతేనే చేయవచ్చు. ఎవరి బలవంతం, ఒత్తిడి వుండవు" చెప్పింది వైదేహి.

"మీరు మాకు తల్లిలాంటివారు. అయినవాళ్ళే మమ్మల్ని వదిలించుకోవాలని చూశారు. అలాంటి మమ్మల్ని చేరదీశారు. మనమంతా ఒక్కటే" అందరూ ముక్తకంఠంతో అన్నారు.

వైదేహి మొహం సంతోషంతో వెలిగిపోయింది.

★ ★ ★

ఆశ్రమంలో సందడి మొదలయింది. ఒకరు కాయగూరలు తరుగుతుంటే మరొకరు సాయం చేస్తున్నారు. ఇంకొకరు టిఫిన్ తయారుచేసే పనిలో వున్నారు.

భూపతివర్మ పనులను పర్యవేక్షిస్తు న్నాడు. రోజుకో టిఫిన్ చేయాలని నిర్ణయిం చుకున్నారు. వారానికోసారి ఇష్టమైన పిండి వంటలు. జీవితంలో మనం ఏదీ కోల్పోకూ డదు. అన్నది వైదేహి భర్తనుంచి నేర్చు కున్న పాఠం.

★ ★ ★

ఆ ఆశ్రమం ముందు కారాగింది.

ఆ కారు వెనుక మరో కారు. వరుసగా నాలుగు కార్లు ఆగాయి.

ఆ కార్లలోనుంచి ఓ పదిమందిదాకా దిగారు. ఖరీదైన దుస్తుల్లో వున్నారు.

వైదేహి ఎవరన్నట్టు సత్యమూర్తి వంక చూసింది. సత్యమూర్తి తనకు తెలియదు అన్నట్టు తల అడ్డంగా ఊపాడు.

భూపతివర్మ వాళ్ళని చూసి మొహం చిట్లించాడు.

"ఎవరు నాన్నా వాళ్ళు? " భూపతివర్మ మొహాన్ని గమనిస్తూ అడిగింది.

"నేను చచ్చినా తలకొరివి పెట్టమన్న నా కొడుకులు" కోపంగా అన్నాడు భూపతివర్మ.

ఆ పదిమందిలో నలుగురు వచ్చి భూప తివర్మ కాళ్ళను తాకబోయారు.

"ఈ వినయాలు ఎందుగ్గానీ, వచ్చిన పని చెప్పండి" నిర్మొహమాటంగా అన్నాడు భూపతివర్మ.

"అదేమిటి నాన్నగారు... వాళ్ళు ఎంత యినా మీ పిల్లలు" అంటూ వైదేహి లేచి.

"పదండి. లోపలికి వెళ్ళి మాట్లాడు కుందాం" అంది.

"అమ్మా వైదేహీ! నీకేమీ తెలియదమ్మా" అంటూ తన కొడుకులవైపు చూసి "వెళ్ళండి. మీకు, నాకు ఇంకా ఏం మిగిలి వుందని వచ్చారు? " అన్నాడు భూపతివర్మ.

"అదేమిటి నాన్నగారూ అలా అంటారు. మీరేమిటి ఇక్కడ వుండడమేమిటి. మీరె వరు? భూపతివర్మగారు. జమిందారు భూపతివర్మ ఒక ఆశ్రమంలో వుండ డమా? "

"నన్ను ఈ రోడ్డుమీదికి గిరాటేసినప్పుడు ఈ బాధ ఏమైంది? "

"నాన్నగారూ... తెలిసో, తెలియకో తప్పు చేశాం. మా తప్పును సరిదిద్దుకుందామని వచ్చాం"

"మీరా... తప్పుని సరిదిద్దుకుంటారా? పులి కాయగూరలు తింటుందన్నా నమ్మొచ్చు. కానీ మీరు మారారంటే నేను నమ్మను", అన్నాడు భూపతివర్మ.

"ముందు మనం లోపలికి వెళ్దాం" అంటూ వైదేహి వాళ్ళను లోపలికి తీసుకువె ళ్ళింది.

అందరికీ ఫలహారాలు ఏర్పాటు చేసింది. వాళ్లంతా వైదేహి వైపు చూస్తూ వున్నారు. వాళ్ళలో వాళ్ళే గుసగుస లాడుకుంటు న్నారు.

భూపతివర్మ మాత్రం సీరియస్‌గానే వున్నాడు. తన కొడుకులు తన మీద ప్రేమతో వచ్చారంటే అతనికి నమ్మకం కల గడంలేదు.

కాఫీ ఫలహారాలు పూర్తయ్యాక వైదేహి బయటకు నడవబోయింది.

"అమ్మా వైదేహి నువ్వెక్కడికి వెళ్తు న్నావు? " అడిగాడు భూపతివర్మ.

"మీరు మాట్లాడుతూ వుండండి నాన్నా" అంది బయటకు వెళ్ళబోతూ. తండ్రీ కొడు కుల మధ్య వుండకూడదని అనుకుంది వైదేహి.

"నువ్వు ఇక్కడే వుండమ్మా. నీకు తెలి యని రహస్యాలు ఏమీలేవు"

భూపతివర్మ కొడుకులు తండ్రివైపు ఇబ్బందిగా చూశారు.

"చెప్పండి. మీరు ఎందుకు వచ్చారో చెబితే మంచిది" అన్నాడు భూపతివర్మ.

"నాన్నగారూ మరేమీ లేదు. మిమ్మల్ని తీసుకువెళ్దామని"

"ఎందుకు? "

"మీ కోసం ఇక్కడ మీ పేరుమీద ఓ ఫైవ్‌స్టార్ హోటల్ కడదామని అనుకుం

టున్నాం. త్వరలో ఇక్కడ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్ ఏర్పడుతుంది. ఈ స్థలానికి మంచి డిమాండ్ వుంది. ఈ ఫైవ్‌స్టార్ హోటల్‌కు మీరే హానరరీ ఛైర్మన్"

అప్పుడు అర్థమైంది భూపతివర్మకు కొడుకులు ఎందుకు వచ్చారో.

"అంటే, ఈ స్థలం కూడా మీ స్వంతం చేసుకోవడం కోసమే వచ్చారా? "

"అదేమిటి నాన్నగారు మీ కోసమే"

"వద్దు... నాకు ఇంక ఏమీ చెప్పవద్దు. నాకు అర్థమైంది. మీరు ఎందుకు వచ్చారో"

వైదేహి వాళ్ళ మాటలు వింటూ వుండిపోయింది.

"నాన్నగారూ లాయర్లు కూడా వచ్చారు. మీరు ఒప్పుకుంటే"

భూపతివర్మ వాళ్ళవైపు చూసి "దయచేసి మీరు వెళ్ళిపొండి. ఇది నా కష్టార్జితం. ఆల్రెడీ నేను దీన్ని మరొకరికి అమ్మేశాను"

"సార్... మీరు రాతపూర్వకంగా అమ్మలేదుగా. అవసరమైతే వాళ్ళకు మరికాస్త ఎక్కువ అమౌంట్ ఇచ్చేద్దాం"

"చూడండి. మీరు న్యాయవాదులు, అన్యాయవాదులుగా మాట్లాడకండి. ఈ భూపతి వర్మ మాట ఇచ్చాడంటే అది నోటుకన్నా విలువైనది"

"నాన్నగారు మేం మీ పిల్లలం. ఎంతైనా రేపు మీకు కావల్సినవాళ్ళం"

భూపతివర్మ కొడుకుల వంక కోపంగా చూశాడు.

"తండ్రి ఉన్నాడన్న విషయం ఇప్పుడు గుర్తొచ్చిందా? అయినా మన మధ్య తండ్రీ కొడుకుల అనుబంధం మన జమీం దారితోపాటే పోయింది. దయచేసి వెళ్ళిపొండి. మళ్ళీ ఎప్పుడు రాకండి" తీవ్ర స్వరంతో చెప్పాడు వర్మ.

చేసేది లేక వాళ్ళు వెనుదిరిగారు.

★ ★ ★

"అమ్మా వైదేహి వెంటనే లాయర్‌ని పిలిపించు" చెప్పాడు భూపతివర్మ.

"ఎందుకు నాన్నా" అడిగింది వైదేహి.

"నేను ఎప్పుడు పోతానో నాకే తెలియదు. నేను పోయేలోగా ఈ స్థలాన్ని నీ పేరుమీద రాస్తాను. ఒకవేళ నాకు ఏదైనా జరిగితే ఈ ఆస్తి కోసం నా పిల్లలు ఎంతకైనా తెగిస్తారు" అన్నాడు భూపతివర్మ.

"ముందు మీరు విశ్రాంతి తీసుకొండి. మీరు బాగా డిస్టర్బ్ అయ్యారు" అంది వైదేహి.

"నేను ఇప్పటికే ఆలస్యం చేశాను. ముందు లాయర్‌ని పిలిపించు తల్లీ" చెప్పాడు వర్మ స్థిరంగా.

వైదేహి రెండు చేతులు జోడించింది.

"మిమ్మల్ని నాన్నా అని పిలిచే అదృష్టం నాకు దక్కింది. మీరు నాకే కాదు, మాలాంటి చాలామందికి తండ్రిలాంటి వారు. మీ మంచి మనసుకు శిరసు వంచి నమస్కరిస్తున్నాను" అంది వైదేహి.

"కేవలం ఒకే ఒక్కదానివి. ఇంత పెద్ద బృహత్కార్యాన్ని నీ భుజాన వేసుకున్నావు. నీ గొప్పదనం ముందు నీ సేవాతత్పరత ముందు నేను చేసేపని ఏ పాటిది తల్లీ" అన్నాడు భూపతివర్మ.

వైదేహి ఏం మాట్లాడలేకపోయింది.

భూపతివర్మ లాయర్‌ని పిలిచేవరకు పూర్కోలేదు. అతనికి మనసులో మనసు లేదు.

లాయర్‌ని పిలిపించి తన పేరుమీద వున్న తన స్వార్జితమైన ఈ స్థలాన్ని వైదేహి పేరుమీద రాయించాడు.

★ ★ ★

భూపతివర్మ ఆరుబయట పచార్లు చేస్తున్నాడు. వైదేహి అక్కడికి వచ్చింది.

"రామ్మా... ఏమిటీ నువ్వు కూడా నిద్ర పోలేదా? నిద్ర రావడంలేదా తల్లీ? " అడిగాడు భూపతివర్మ.

"లేదు నాన్నగారు. ఈరోజు ఒకందుకు నాకు బాధగా వున్నా మరొకందుకు సంతోషంగా వుంది"

"ఎందుకమ్మా"

"మీ పిల్లలు మారి మిమ్మల్ని తీసుకుపోవడానికి వచ్చారని సంతోషపడ్డాను"

"వాళ్ళు మారతారని నేను అనుకోనమ్మా"

"కేవలం ఇదంతా నా వల్లనే జరిగింది కదా నాన్నా"

"లేదమ్మా"

"మాకోసం మీరు ఎంత సాహసం చేశారు నాన్నా. మీ పిల్లలకు కూడా దూరమయ్యారు"

"మీరు చేసిందేమీలేదు తల్లీ. ఎప్పుడో నన్ను వాళ్ళు దూరం చేశారు. ఇప్పుడు ఈ స్థలానికి విలువ పెరిగిందని లేని ప్రేమను చూపించి ఈ స్థలాన్ని ఆక్రమించుకోవాలన్న ఆలోచన వాళ్ళది"

"మీరు కలత చెందుతున్నట్లు వున్నారు కదూ"

"నా బిడ్డలు నన్ను తరిమేసినప్పుడు నాలోని కలత పారిపోయింది. నిండా మునిగినవాడికి చలేమిటమ్మా"

వైదేహికి ఏం మాట్లాడాలో అర్థంకాలేదు.

"మీరెళ్ళి పడుకోండి నాన్నా" అంది వైదేహి.

"కాసేపు అలా చల్లగాలికి తిరిగి పడుకుంటాన్లే"

వైదేహి తన గదిలోకి వెళ్ళింది.

★ ★ ★

వైదేహికి నిద్ర రావడంలేదు.

భర్త జ్ఞాపకాలు ఆమెని వెన్నాడుతున్నాయి. తను ఏం చేస్తుంది? తను చేసే ఈ యజ్ఞం ఎలాంటి యజ్ఞఫలితాన్ని ఇవ్వబోతోంది.

ఒక్కక్షణం మనవరాలు అమిత గుర్తొచ్చింది. తనకోసం ఎంత కష్టపడుతోంది. ఈ ప్రేమలు, పాశాలు ఓవైపు, ఆస్తికోసం స్వార్థంతో ప్రేమ, పాశాలను కాలరాసే పైశాచిక మనస్తత్వాల మనుషులు. మరోవైపు... ఈ రాగద్వేషాలమధ్య మనుషుల జీవన్నాటకం ఎలావుంటుంది?

అలా ఆలోచిస్తూనే వుండిపోయింది. ఈరోజు తనకెందుకు నిద్రరావదలేదు? ఓసారి బయటకు వచ్చింది. ఆశ్రమం అంతా కలియతిరిగింది. ఇంకా భూపతివర్మ అటూఇటూ పచార్లు చేస్తూనే వున్నాడు.

అతని మానసికపరమైన అంతర్మథనం ఆమెకు అర్థమైంది. కన్నబిడ్డల స్వార్థం మరోసారి విశ్వరూపం దాల్చడంతో అతనెంత కృంగిపోయాడో మరోసారి అర్థమైంది. ఆమె మనసు ఆర్ద్రమైంది.

మౌనంగా తన గదిలోకి వెళ్ళింది. ట్రంకుపెట్టె తీసి తన భర్త ఫొటో తీసి గుడెలకు హత్తుకుంది. భర్త వేసుకున్న దుస్తులు, వాడిన వస్తువులు ఒక్కొక్కటీ తీసి తృప్తిగా చూసుకుంది.

వైదేహి తనకు నిద్ర రానప్పుడు భర్త జ్ఞాపకాలను అలా స్పృశిస్తూ ఉంటుంది. అరగంట తర్వాత అన్నీ ట్రంకుపెట్టెలో సర్దింది.

తెల్లారి తను చేయవలసిన కార్యక్రమాలు ఒక్కొక్కటీ గుర్తు చేసుకుంటూ అలానే నిద్రలోకి జారుకుంది.

★ ★ ★

సులోచన ఆలోచనలో పడింది.

శేషాచలం పునరాలోచనలో పడ్డాడు. తమకో తోడు కావాలని సులోచన భావించింది. కానీ ఆ తోడు తనకు చిక్కులు తెచ్చిపెడుతుందని ఊహించలేదు.

మొదటి నాలుగైదు రోజులూ ప్రేమగానే చూసుకుంది సులోచనను ఆవిడ.

ఆ తర్వాత చికాకు మొదలెట్టింది. శేషాచలం ఉన్నప్పుడు లేనిప్రేమ ఒలకబోయడం, శేషాచలం ఆఫీసుకు వెళ్ళగానే చీదరించుకోవడం... దానికితోడు తన పిల్లలను కూడా ఇక్కడికే రప్పించుకుంది.

ఏమనలేని మొహమాటం శేషాచలంది భర్త ఆలోచన, మనసూ తెలిసిన సులోచన కూడా మౌనంగా భరించింది.

పొద్దున్నే పిల్లలకోసం టిఫిన్ చేయడం,

వాళ్లు టిఫిన్ తిన్నాక మిగిలినది సులోచన తినవలసిన పరిస్థితి వచ్చింది.

ఆ పిల్లకు వచ్చేప్పుడు మొదట్లో పళ్ళు అవీ పట్టుకువచ్చేవాడు. అవి తినడమే కాకుండా సులోచన కోసం తెచ్చిన పళ్ళు కూడా తినేవాళ్ళు.

పొద్దున్న శేషాచలం ఆఫీసుకు వెళ్తుంటే "మీ చెల్లెలుకు చుడీదార్ కావాలట బాబూ. చెప్పవేంరా నీకో అన్నయ్య ఉన్నాడు. తన చెల్లెలు ఏది కావాలన్నా క్షణాల్లో తెచ్చిపెడ తాడు. ఆ విషయం మరిచిపోతే ఎలా?" అనేది.

దానితో చచ్చినట్టు సాయంత్రం చెల్లెలుకు చుడీదార్ తెచ్చేవాడు.

మర్నాడు రోజు ఇంకో చెల్లెలికి గౌను, ఇంకో రోజు ఇంకోటి...

ఆ తర్వాత బాబాయి కూడా వచ్చాడు. ఆ ఇల్లు ధర్మసత్రంలా మారింది.

అప్పటివరకూ విశాలంగా కనిపించిన ఆ ఇల్లు ఇప్పుడు ఇరుకైపోయింది.

క్షణం కూడా ప్రశాంతంగా వుండడం లేదు పిల్లల అల్లరి, వాళ్ళ తిట్లు, పైగా ఆవి డగా సణుగుళ్ళు రెక్కలు ముక్కలవుతు న్నాయంటూ.

చివరికి ప్రైవసీ మిస్సయింది. సులోచన భర్తతో మనసు విప్పి మాట్లాడి చాలారోజు లైంది. రోజురోజుకీ ఆ ఇల్లు నరకంలా మారిపోయింది.

తను పిన్నిని తీసుకువచ్చి పొరపాటు చేసానేమోనన్న ఫీలింగ్ కలిగింది శేషాచలా నికి. విభావర్ ఇవ్వన్నీ గమనిస్తూనే వున్నాడు.

★ ★ ★

బ్యాంకునుంచి వచ్చి ఫ్రెషప్ అయి బయట కుర్చీ వేసుకుని కూర్చున్నాడు విభా వర్.

వేడివేడి ఫిల్టర్ కాఫీ తాగాలన్న కోరిక బలంగా కలిగింది. ఇప్పుడు కాఫీ తాగా లంటే హోటల్‌కు వెళ్ళాలి.

అప్పుడప్పుడు సులోచన కాఫీ చేసి ఇచ్చేది. అలా ఆలోచిస్తూ వుండగానే శేషా చలం వచ్చాడు. అతని మొహం పీక్కుపో యింది.

సులోచనతో ప్రైవసీగా వుండడానికి కూడా కుదరడంలేదు. పైగా ఈమధ్య పిన్ని కూరగాయలకనీ, వాటికనీ వీటికనీ రోజూ డబ్బు అడుగుతూనే వుంది.

ఈ సమస్యనుంచి ఎలా బయటపడాలో అర్థంకావడంలేదు.

కాసేపలా రిలాక్సవుదామని బయటకు వచ్చాడు.

★ ★ ★

"రండి శేషాచలంగారూ... చాలా బిజీగా వున్నట్టున్నారు" అన్నాడు విభావర్.

శేషాచలం తన బాధంతా చెప్పుకున్నాడు. సరిగ్గా అప్పుడే విభావర్ అడ్రస్ వెతు క్కుంటూ ఎట్టకేలకు అడ్రస్ దొరకబట్టుకుని వచ్చింది అమిత.

విభావర్ అమితను చూసి షాకయ్యాడు. ఆమె రాకను ఎక్స్పెక్ట్ చేయలేదు.

శేషాచలానికి పరిచయం చేశాడు. శేషా చలం వెంటనే గుర్తుపట్టాడు.

ఒక్కక్షణం అతను ఉద్వేగంలో పడిపో యాడు.

"మీ పేరు పత్రికలో చూడ్డం తప్పించి డైరెక్ట్‌గా మిమ్మల్ని చూడ్డం ఫస్ట్ టైం. అయామ్ వెరీ హేపీ. నేను వాసంతి పత్రి కకు రెగ్యులర్ రీడర్‌ని. మీరు వ్రాసే న్యూస్ స్టోరీస్ అంటే నాకు చాలా ఇష్టం. అవి గుండెలు కదిలించేలా వుంటాయి" అన్నాడు మనస్ఫూర్తిగా శేషాచలం.

"చూశారా... మీరు మా ఇంటికి రావడం వల్ల ఓ అభిమానిని కలుసుకోగలిగారు" అన్నాడు విభావర్.

అమిత నవ్వి ఊరుకుంది.

"సారీ... గెస్ట్‌కు కాఫీ ఇవ్వలేను. కానీ పది నిమిషాలు వెయిట్ చేసే ఓపిక వుంటే సందుచివర వున్న అయ్యర్ హోటల్‌కు

# ఏరినముత్యాలు

☆ ఎల్లప్పుడూ సంతోషంతో నవ్వుతూ ఉండు. అది నీ అనేక ప్రార్థనలకన్నా దైవానికి నిన్ను దగ్గరకు చేరుస్తుంది.

– స్వామివివేకానంద

☆ పెద్దపెద్ద పనులు చెయ్యడానికి ప్రయత్నించి విఫలమవడంకన్నా చిన్నచిన్న పనులు చేసి సఫలత పొందడం మంచిది.

– పీటర్ మార్షల్

☆ మానవుల చర్యలు చూసి నేను నవ్వను. వారిని చూసి దుఃఖించను. వాళ్లను అసహ్యించుకోను. అయితే వారిని అర్థం చేసుకుంటాను.

– బరూచ్‌స్పికోజ

☆ నీకు కోపం వచ్చినప్పుడు మాటలకు ముందు పది అంకెలు లెక్కించు. నీకు తీవ్రమైన ఆగ్రహం కలిగినప్పుడు వంద అంకెలు లెక్కించు.

– థామస్ జాఫర్‌సన్

☆ విజయాలను పొందిన మనిషిలా కాక మంచి విలువలుగల మనిషిగా రూపొందడానికి ప్రయత్నించు.

– ఐన్‌స్టీన్

☆ కొత్తగా కనుగొన్న విషయం ఒక మొక్క వంటిది. అప్పటి కప్పుడే దాని గొప్పదనం తెలియదు.

– రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్

☆ తలనొప్పి తెప్పించే విధంగా కొందరు టీచర్లు పాఠాలు చెప్తారు. మంచి టీచర్లు బోధపరుస్తారు. ప్రతిభగల టీచరు చాకచక్యంగా అభ్నీ చేసి చూపుతూ హావభావాలతో విద్యార్థులను ఆకర్షిస్తాడు. గొప్ప టీచరు విద్యార్థులకు స్పందన కలిగిస్తాడు.

– విలియమ్ ఆర్థర్‌వర్డ్

☆ గొప్పగొప్ప పనులన్నీ బలం వలన జరగలేదు. ఓర్పు వలన జరిగాయి.

– శామ్యూల్ జాన్సన్

☆ ఒక తెలివైన వ్యక్తి అవకాశాలు లభించేవరకూ కూర్చోకుండా, అవకాశాలు సృష్టించుకొంటాడు.

– జార్జిఇలియట్

☆ ఒక మంచి పని చెయ్యడం దేవుని వైపు ఒక అడుగు వెయ్యడం వంటిది.

-- జె.జి.హోలాండ్

☆ ఇతరులంతా తమ కాలాన్ని వృధా చేసుకొంటున్న సమయంలో కొందరు సోమరితనాన్ని విడనాడి ముందుకు వెళ్లి తాము అనుకొన్నది సాధిస్తారు.

– హెన్రీఫోర్డ్

సేకరణ: కొడిమెల శ్రీరామమూర్తి

పరుగెత్తుకెళ్ళి కాఫీ తీసుకురాగలను" అన్నాడు విభావర్.

"భలేవారే... నేను కాఫీ పంపిస్తాను" అన్నాడు శేషాచలం.

ఈలోగా సులోచన అక్కడికి వచ్చింది. శేషాచలం సులోచనను అమితకు పరిచయం చేశాడు.

"అయామ్ వెరీ హేపీ... మీలాంటి గ్రేట్ పర్సనాలిటీని కలుసుకున్నందుకు చాలా సంతోషంగా వుంది" అంది సులోచన.

"మీలాంటి వారి అభిమానమే నాకూ, మా పత్రికకూ కావాలి" అంది అమిత.

సులోచన కాఫీ తీసుకువస్తానని లేచింది. శేషాచలానికి తన ఇంట్లోకి అమితను ఇన్వైట్ చేయాలని వుంది. కానీ అక్కడి వాతావరణం, హడావిడీ గుర్తొచ్చి ఆగిపోయాడు.

"ఏంటీ... ఏదో ఆలోచిస్తూ వుండిపోయారు? ఎనీ ప్రాబ్లం? " అడిగింది అమిత.

వెంటనే విభావర్, "మీ పత్రికలో మీ సమస్య- మా జవాబులాంటి శీర్షిక ఏమైనా వుందా? " అనడిగాడు.

"ఎందుకు? "

శేషాచలం మొత్తం పరిస్థితి వివరించి చెప్పాడు.

"సులోచనకు తోడుగా వుంటుందని మా పిన్నిని తీసుకువచ్చాను. ఇప్పుడు వాళ్ళకి మేం తోడు వుండాల్సివస్తోంది" అంటూ తన బాధంతా వెళ్ళబోసుకున్నాడు.

ఒక్కక్షణం మౌనంగా వుండిపోయింది అమిత.

తర్వాత ఆమె ఓ ఆలోచనకు వచ్చింది.

"ఇప్పుడు మీ ప్రాబ్లం ఏమిటి? మీకో తోడు కావాలి. మీ భార్య డెలివరీ అయ్యేవరకూ మీకో అమ్మ, ఆవిడకో అత్తగారు, అదే పెద్దదిక్కు కావాలి అవునా? "

"అవును. కానీ ఆ వచ్చేవాళ్ళు ఎలా వుంటారో? ఎవర్నని పిలుస్తాం. ఎవరినని తోడు వుండమని చెబుతాం"

"మీకా ప్రాబ్లం అక్కర్లేదు. ఆ సమస్య నాకు వదిలేయండి" అంది తేలిగ్గా అమిత.

"అంటే...? "

"పేయింగ్ మదర్. పేయింగ్ గెస్ట్‌లా అనుకోండి. కాకపోతే ఆ ప్రేమకు మీరు కొంత అమౌంట్ పే చేయాలి. అఫ్‌కోర్స్ ప్రేమ మాత్రం సిన్సియర్‌గా లభిస్తుంది. మీరు చెల్లించే డబ్బు మరికొందరు నిస్సహాయులకు ఉపయోగపడుతుంది"

"మీరు చెప్పేది నాకు అర్థంకావడంలేదు" అన్నాడు శేషాచలం.

"రేపు మా బామ్మను తీసుకువస్తాను. ఆవిడ మీకు పూర్తిగా ఎక్స్‌ప్లైన్ చేస్తుంది" చెప్పింది.

"కాస్త కన్‌ఫ్యూజన్‌గా వుంది" అన్నాడు. అయినా అతనికి నమ్మకం కుదిరింది.

తన సమస్యకు పరిష్కారం దొరుకుతుందన్న నమ్మకం అది.

అతనో నిర్ణయానికి వచ్చాడు.

ముందు పిన్ని గొడవ వదిలించుకోవాలి.

మరుసటిరోజే క్లియర్‌గా చెప్పాడు.

"పిన్నీ... ఇవిగో మీకు, బాబాయ్‌కి, పిల్లలకు బట్టలు. అలాగే ఈ అయిదు వేలూ ఉంచండి. మేం కొన్నాళ్ళు ఢిల్లీ వెళ్ళాలని అనుకుంటున్నాం"

పిన్నికి విషయం అర్థమైంది.

"అయ్యో... కోడలుకు సేవలు చేద్దామనుకున్నాను. అవసరమైతే కబురు చేయి బాబూ" అంది.

ఆ విధంగా ఆ సమస్యనుంచి గట్టెక్కాడు శేషాచలం.

★ ★ ★

ఉదయం తొమ్మిది గంటలు.

ఆఫీసుకు రెడీ అవుతున్నాడు శేషాచలం. ఇన్నాళ్ళకు అతనికి కాస్త హుషారుగా ఉంది.

పిన్ని బాధ తప్పిందన్న సంతోషం అతని మొహంలో ప్రస్ఫుటమవుతోంది.

"ఏమండీ... మీతో మనసు విప్పి మాట్లా

డాలన్నా ఇన్నిరోజులూ కుదర్లేదు" అంది సులోచన అతని క్రాఫ్‌ని చేతివేళ్ళతో సరి చేస్తూ.

"పోనీ... ఇప్పుడు ఆ సమస్య తీరిపో యిందిగా. నిజం చెప్పాలంటే నాకూ అలాంటి ఫీలింగే కలిగింది. పిన్ని అలా చేస్తుందనుకోలేదు" అన్నాడు.

సరిగ్గా అప్పుడే...

తలుపుమీద చిన్న శబ్దం.

శేషాచలం వెళ్ళి తలుపుతీశాడు.

ఎదురుగా వైదేహి, అమిత.

"ఓహ్... మీరా రండి... రండి" అంటూ వాళ్ళిద్దర్నీ సాదరంగా ఆహ్వానించాడు శేషా చలం.

కాఫీ తాగాక వైదేహి అసలు విషయం లోకి వచ్చింది.

"మీ ఆవిడ ప్రస్తుతం గర్భవతి, ఆవిడకు ఈ సమయంలో ఓ తోడు అవసరం. కేవలం మొక్కుబడిగా కాకుండా ఓ అమ్మలా, ఓ అత్తలా ఇంటికి పెద్దదిక్కులా ఆవిడవెంట వుండాలి. మీకు అభ్యంతరం లేకపోతే ఆ బాధ్యత నేను తీసుకుంటాను. రోజూ ఉదయంనుంచి సాయంత్రం మీరు వచ్చేవరకూ వుంటాను. మీ ఆవిడ పండంటి బిడ్డను ప్రసవించేవరకూ నాదీ పూచీ" చెప్పింది వైదేహి.

"నాకు ఇదంతా ఆశ్చర్యంగా వుంది" అన్నాడు శేషాచలం.

"ఏదీ... ఇలా నేను వచ్చి అడగడమా? "

"కాదు... కాదు. పేయింగ్ మదర్‌గానో లేదా పెద్దదిక్కుగానో మీరు ఓ ఉద్యోగంలా భావించి వుండడం"

"పెద్దరికం పేరుతోనో, చుట్టరికం పేరు తోనో ప్రేమను నటించేకన్నా ఫ్రాంక్‌గా ప్రేమను ఇలా కొద్దిపాటి డబ్బు ఖరీదుకట్టి సిన్సియర్ ఎఫెక్షన్‌ని అందించడం తప్పుకా దుకదా...

"ప్రేమ వ్యాపారంకాదుకదా అని మీకు అనిపించవచ్చు. నిజమే... ఇది వ్యాపారం కాదు. కానీ ఇది మాకు ఓ రకమైన ఉపాధి. ఓ తల్లిలా, అత్తలా మీ కుటుంబా నికి దగ్గరై, ప్రేమను... అఫ్‌కోర్స్ సిన్సియర్ ప్రేమను పంచినందుకు, మీనుంచి తీసుకునే డబ్బు నిస్సహాయులైన వృద్ధుల జీవనానికి ఉపయోగపడుతుంది.

"మీలాంటివాళ్ళు ప్రేమరాహిత్యంతో పెద్ద వాళ్ళ ప్రేమకోసం తపిస్తూ వుంటే మాలాంటివాళ్ళు కన్నబిడ్డల నిర్లక్ష్యంతో అల మటిస్తూ వుంటారు...

"అలాంటివాళ్ళని ఆదుకోవడానికి నావంతు కృషి నేను చేస్తున్నాను. కేవలం అలాంటివాళ్ళను ఆదుకుంటేనే సరిపోదు. వాళ్ళలోని నిరాశ, నిస్పృహలను పారద్రో లాలి. అందుకోసం అవసరమయ్యే నిధు లను ఈవిధంగా సమకూర్చుకోవాలని అను కుంటున్నాం"

"మేం తీసుకునే డబ్బు మేం చూపించే ప్రేమకు ప్రతిఫలం కాదు. ఒకవిధంగా మీ తల్లిదండ్రుల అవసరాలకు మీరిచ్చే డబ్బే అనుకోవచ్చు. ఒక్కటిమాత్రం నిజం... మేం చూపించే ప్రేమలో కృత్రిమత్వం మాత్రం ఉండదు"

వైదేహి వివరణ... విశ్లేషణాత్మక వాగ్ధాటి చూసి ముచ్చటపడిపోయాడు శేషాచలం.

వైదేహి తమ ఆశ్రమం గురించి పూర్తిగా చెప్పుకొచ్చింది.

"తెలియకుండా నేను ఏదైనా మాట జారి మీ మనసు నొప్పిస్తే క్షమించండి" అన్నాడు శేషాచలం.

"మనిషిలో అనుమానం ఉండకూడదు. అది వున్నప్పుడు నివృత్తి చేసుకోవడం ఉత్తమం. నీకు అభ్యంతరం లేకపోతే ఈ క్షణమే నేను ఈ ఇంటికి పెద్దదిక్కుని అవు తాను" అంది వైదేహి.

శేషాచలం, సులోచన వచ్చి వైదేహి పాదా లకు నమస్కరించారు.

శేషాచలం పర్సులోనుంచి డబ్బు తీసి ఇచ్చాడు. అందులోనుంచి తనకు అవసర

మైన మేర డబ్బు తీసుకుంది వైదేహి.

"ఇది ఈ నెలకు నేను తీసుకునే ప్రతి ఫలం" అంది వైదేహి.

సులోచనకు ఇదంతా గమ్మత్తుగా వుంది. చిత్రంగా తోస్తోంది.

అమిత బామ్మ దగ్గర శలవు తీసుకొని వెళ్ళిపోయింది.

శేషాచలం ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

★ ★ ★

"చూడమ్మా... నా దగ్గర భయం, బెరుకూ, ఇబ్బందీ వద్దు. నాకు కూతురు లేదు. నలుగురూ కొడుకులే. నా కోడళ్ళం దరికీ ఈ చేతులతోనే పురుడు పోశాను" తన జ్ఞాపకాలను గుర్తు చేసుకుంటూ అంది వైదేహి.

సులోచన వైదేహి చెప్పేది వింటోంది. వైదేహి ఓ పక్క సులోచనతో మాట్లాడ్తూనే అన్ని పనులూ చకచకా చేసేస్తోంది.

సులోచన ఇష్టాలు, ఆమెకు ఏమేమి తినా లనిపిస్తోందో అవన్నీ క్షణాల్లో గ్రహించే సింది. సరదాగా కబుర్లు చెబుతూ చకచకా వేడివేడి అన్నం రెడీ చేసింది.

గర్భిణీలు తీసుకోవాల్సిన జాగ్రత్తలు చెప్పింది. కాసేపు వాకింగ్ చేయించింది. తనకు తెలిసిన విషయాలు చెప్పింది.

ఇలా టైం తెలియకుండా గడిచిపో యింది. మధ్యాహ్నం సులోచన కాసేపు కునుకుతీసింది.

సాయంత్రం నాలుగు అవుతుండగా సులోచన లేచేసరికి వైదేహి ఏదో ఇంగ్లిష్ మేగ్జైన్ చదువుతోంది.

"కాఫీ తాగుతావా? " అడిగింది వైదేహి.

"నేను కలుపుకుంటాన్లెండి" అంది సులో చన.

"నెంబర్ వన్... అండీలు వద్దు. హాయిగా అత్తయ్యా అని పిలువు. నెంబర్ టు. నీకు కాఫీ ఏదో వంటమనిషిగా కలిపి ఇస్తానని అనడంలేదు. అత్తయ్యగా నా కోడ లికి కాఫీ ఇవ్వడం తప్పుకాదు. రేపు నా కోడలు నాకు కాఫీ ఇవ్వదా? "

సులోచన మనసు గాలిలో తేలిపో యింది. ఇలాంటి మాటలకోసం ఇలాంటి ప్రేమతో కూడిన మందలింపు కోసమే ఆమె తపన, ఎదురుచూపు.

"అయితే నేను మీకు సాయం చేస్తాను" అంది సులోచన.

ఇద్దరూ కిచెన్ రూమ్‌లోకి వెళ్ళారు. సులోచన పాలు వేడి చేసింది. ఈలోగా ఫిల్టర్ రెడీచేసి మిరపకాయ బజ్జీలు వేయ డానికి కావలసిన సరంజామా తయారుచే యసాగింది వైదేహి. మధ్యాహ్నం మాటల ప్రస్తావనలో తనకు మిరపకాయ బజ్జీలు తినాలని వుందని అంతకుముందు జరిగిన ప్రహసనం గురించి చెప్పింది సులోచన.

కాఫీ తాగుతుండగా అడిగింది సులోచన.

"మీకు రీడింగ్ హాబీనా? "

"కాదు... అవసరం. ఈ ప్రపంచంలో పుస్తకాన్ని మించిన నేస్తం లేదు. మనకు మంచి విషయాలు చెప్పేది, చెడు గురించి తెలియచేసేది పుస్తకాలే.

అప్పుడప్పుడు ఆ పుస్తకాల్లోనుంచి నేను ప్రేరణ పొందుతూ వుంటాను. జీవితానికి కానీ, ఇతరుల జీవితానికి కానీ ఆ పుస్త కంలో ఏదైనా ప్రేరణ కనిపిస్తుందేమోనని చూస్తాను"

మిరపకాయలు చీరుతూ చెప్పుకుపో తోంది వైదేహి.

"చాలామందికి వృద్ధాప్యం అంటే భయం. మనసుని ఆహ్లాదంగా ఉంచుకుంటే ఏ భయాలూ మన దరి చేరవు. హైద్రాబాద్‌కు చెందిన 'హెరిటేజ్ సీనియర్ క్లబ్' పదమూ డురోజులపాటు నిర్వహించిన విదేశీయా త్రలో పదిహేను వృద్ధజంటలు పాల్గొన్నా యట. అరవై సంవత్సరాల పైబడ్డ వృద్ధులు కూడా ఈ విహారయాత్రలో పాల్గొన్నారు.

"తమ వయోభారంతో కుంగిపోకుండా తమ జీవితకాలపు అనుభవాల స్మృతుల్లో

మరిన్ని తీపిగుర్తులు ఆస్వాదించాలని వాళ్ళు ఈ విదేశీయాత్రకు బయల్దేరారు.

"మాజీ గ్రూప్ కెప్టెన్ నానావాడేకర్, రోషన్ పటేల్‌తో పాటు పదిహేను వృద్ధ జంటలు ఈ విహారయాత్రలో పాల్గొన్నాయి.

"కారణం... మనసు ఆహ్లాదంగా ఉంచుకోవడం. వయసును మనసుతో జయించడం. మనల్ని మనం ఆహ్లాదంగా ఉంచుకుంటే ఏ నిరాశా మన దరిచేరదు.

"ప్రేమ, నిజాయితీ, నిబద్ధత... మనల్ని ఉన్నత స్థానాల్లో నిలబెడతాయి. అవే మనల్ని కాపాడుతాయి కూడా.

"ఇలాంటి విషయాలు మాలాంటి వృద్ధులకు ఎంతో స్ఫూర్తినిస్తాయి. నాకు తెలిసిన విషయాన్ని, నేను నేర్చుకున్న విషయాన్ని ఇతరులకు చెప్పి, వాళ్ళకు స్ఫూర్తి కలిగించాలనేది నా ఉద్దేశం" చెప్పింది వైదేహి.

సులోచనకు వైదేహి అంటే ప్రేమతో పాటు గౌరవం కూడా కలిగింది.

పావుగంటలో మిరపకాయ బజ్జీలు తయారయ్యాయి.

"అమ్మాయ్... నువ్వు పది నిమిషాల్లో రెడీ అవ్వు. ఫ్రెష్‌గా ఆరుబయట కూర్చుని మిరపకాయ బజ్జీలు తినడంలో వున్న ఆనందాన్ని ఎంజాయ్ చెయ్యొచ్చు. అఫ్‌కోర్స్ మీ ఆయన వచ్చాక మరోసారి ఎంజాయ్ చేయొచ్చు. నేను ఈలోగా ఉల్లిపాయ తరిగి పెడతాను. మిరపకాయ బజ్జీల్లో ఉల్లిపాయ కాంబినేషన్ బావుంటుంది" చెప్పింది వైదేహి.

"మీరు మాలో ఒకరిగా కలిసిపోవడం చూస్తుంటే నా మనసు చెమ్మగిల్లుతోంది" అంది సులోచన.

"మనం మన వయసును అవసరాన్నిబట్టి కుదించుకోవడమో, పెంచుకోవడమో చేయాలి.

"చిన్నపిల్లలతో మన వయసుకు తగ్గట్టు ప్రవర్తిస్తే వాళ్ళకు మనమీద భయంతప్ప, ప్రేమ, చనువు, దగ్గరితనం తాలూకు ఫీలింగ్ కలగదు.

"మనం కాసేపు ఫ్రెండ్స్‌మి.

"మరి కాసేపు అత్తాకోడళ్ళం.

ఇంకాసేపు తల్లీకూతుళ్ళం" అంది వైదేహి.

సులోచనకు చెప్పలేనంత సంతోషం వేసింది. పది నిమిషాల్లో ఫ్రెషప్ అయి వచ్చింది.

బయట కుర్చీలు వేసింది.

★ ★ ★

శేషాచలం ఇంటికి వచ్చి ఆ సన్నివేశం చూసి ముచ్చట పడిపోయాడు.

సులోచన, వైదేహి ఇద్దరూ కుర్చీల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ మిరపకాయ బజ్జీలు తింటున్నారు.

తనకు పెళ్ళయ్యాక సులోచన అంత సంతోషంగా అదీ వేరే వ్యక్తులతో వుండగా ఎప్పుడూ చూడలేదు.

అసలు తన ఉనికిని కూడా మరిచిపోయి ఎంజాయ్ చేస్తున్నారు.

భర్తను గమనించి "రండి... రండి" అంది.

"ముందు హాయిగా ఫ్రెషప్ అయి రా. తర్వాత వేడివేడి మిరపకాయబజ్జీలు తిందువుగాని. ఆలస్యమైతే మిరపకాయ బజ్జీలు అయిపోయే ప్రమాదం వుంది" హెచ్చరించింది వైదేహి.

అయిదంటే అయిదే నిమిషాల్లో హడావిగా ఫ్రెషప్ అయి వచ్చాడు.

ముగ్గురూ కాసేపు సరదాగా మాట్లాడుకున్నారు.

"మిరపకాయ బజ్జీలు చాలా బావున్నాయి" అన్నాడు.

"అత్తయ్యే చేశారు" చెప్పింది సులోచన.

"అప్పుడే అత్తాకోడళ్ళు అయ్యారా?" అన్నాడు శేషాచలం.

"అమ్మా కూతుళ్ళం కూడా అవుతాం" అంటూ టైం చూసుకుంది.

"నేను వెళ్ళొస్తాను బాబూ... మళ్ళీ రేపు ఉదయం వస్తాను. 'వస్తానమ్మా" అంది వైదేహి.

వైదేహి వెళ్ళిపోయింది.

సులోచన వైదేహి వెళ్తున్నవేపే చూస్తుండిపోయింది.

సత్యమూర్తికి కొడుకు గుర్తొచ్చాడు. కోడలు గుర్తొచ్చింది. మనవరాలు గుర్తొచ్చింది.

ఇన్నేళ్ళ అనుబంధాన్ని ఆ కొడుకు ఎలా తెంచుకోగలిగాడు? అని ఆశ్చర్యం, వ్యధ... రెండూ ఒకదానితో మరొకటి పోటీపడి



కలుగుతున్నాయి.

"ఏమిటండీ కొడుకు, కోడలు గురించి ఆలోచిస్తున్నారా? " అడిగింది రాజేశ్వరి.

"అవును రాజేశ్వరీ. వాళ్ళు ఇంత కఠినంగా ఎలా మారారా? అని ఆలోచిస్తున్నాను"

ఇప్పుడు దానిగురించి ఆలోచించి బాధ పడ్డం ఎందుకు? భర్తను ఓదార్చింది రాజేశ్వరి.

అదే సమయంలో అక్కడ...

సత్యమూర్తి కోడలు...

★ ★ ★

కూతురికోసం మొత్తం వెతికింది. ఎక్కడా కనిపించలేదు. ఆమెలో ఆదుర్దా పెరిగింది. ఈమధ్య కూతురిలో కనిపించే నిర్లిప్తత ఆమెకు అర్థమవుతూనే వుంది.

ఇప్పుడేం చేయాలి? భర్తకు ఫోన్ చేయాలా? తనే మొత్తం వెతకాలా? స్కూల్‌నుంచి వచ్చిన కూతురు అప్పుడే ఎక్కడికి వెళ్తుంది. అన్ని గదులూ వెతికింది. ఎక్కడా కనిపించకపోయేసరికి ఆమెలో ఆదుర్దా మరింత ఎక్కువైంది.

పక్కింటికి వెళ్ళి వాకబు చేసింది. వాళ్ళు తమకు తెలియదన్నారు. మేడపైకి వెళ్ళి చూసింది. అక్కడా లేదు. పింకీకి స్నేహితులు కూడా ఎక్కువగా లేరు.

కొద్ది సమయంలోనే ఆమెలో వేన వేల అనుమానాలు... లక్ష సందేహాలు... కోటి భయాలు.

వెంటనే ఆఫీసుకు ఫోన్ చేసింది. అతనిలో కంగారు. పది నిమిషాల్లో వచ్చాడు.

"ఏమైంది? " ఆందోళనగా అడిగాడు భర్త.

"స్కూల్‌నుంచి వచ్చి యూనిఫామ్ మార్చుకుంది. "మొహమంతా డల్‌గా వుంది, మొహం కడుక్కురా. టిఫెన్ చేద్దువుగాని అన్నాను. నేను కిచెన్‌లోనుంచి వచ్చి చూసేసరికి లేదు. మొత్తం వెతికాను. ఎక్కడా కనిపించలేదు" అంది భయం నిండిన కంఠంతో.

"అదేమిటి సరిగ్గా వెతికావా? " అతని కంఠంలో భయం తొంగిచూసింది.

"వెతికానండి" ఏడుస్తున్న గొంతుతో అంది.

ఆమె గొంతులో భయం స్పష్టంగా కనిపిస్తోంది. వెంటనే ఏం చేయాలో ఇద్దరికీ తోచలేదు. తెలిసిన వాళ్ళింటికి వెళ్ళి వాళ్ళకేం చెప్పాలి? ఎలా చెప్పాలి? గుండె

దాటిన దుఃఖం గొంతుదాటి తన్నుకొచ్చే స్తోంది. పూజ గదికి వెళ్ళింది. దేవుడి ముందు మోకరిల్లింది.

"నా కూతురు నాకు క్షేమంగా దొరికేలా చూడు స్వామీ... నీ కొండకు నడిచి వస్తాను" అని మొక్కుకుంది. ఆమె కన్న పేగు కదిలింది. ఆమె గుండెలు అలిసిపో యాయి. కొద్దిసేపట్లోనే ఆమెకు బిడ్డలేని లోటు తెలుస్తోంది.

తన కూతుర్ని ఎవరైనా కిడ్నాప్ చేశారా? ఆమెలో కొత్త భయం చోటుచేసుకుంది. పత్రికల్లో ఎన్ని వార్తలు చూడ్డంలేదు. బయట ఆడుకుంటున్న పాపను ఎవరైనా కిడ్నాప్ చేసి వుండొచ్చుగా?

అదే విషయాన్ని భయపడుతూనే భర్తకు చెప్పింది.

ఒక్క క్షణం పాలిపోయిన మొహంతో భార్యవంక చూసి అన్నాడు. "నీకు ఇలాంటి పిచ్చి భయాలు ఎందుకొస్తాయి. మన పాపకు ఏమీకాదు. నువ్వు అనవసరంగా లేనిపోని భయాలు పెట్టుకోకు. అంతా వెదుకుదాం. కాదంటే పోలీస్ రిపోర్ట్ ఇద్దాం"అన్నాడు భార్యకు ధైర్యం చెబుతు న్నట్లు. భార్యకైతే అలా చెప్పాడుకానీ, అత నికీ లోలోపల భయంగానే వుంది.

పాపకోసం వెతుకుతూనే వున్నారు. అయినా వాళ్ళకు పాప జాడ తెలియలేదు. ఈ విషయం మెల్లమెల్లగా స్నేహితులకు, బంధువులకు తెలిసింది. వాళ్ళు కూడా వెత కడం మొదల్లుపెట్టారు. అంతా చిత్రంగా వుంది. మొహం కడుక్కుని రావాల్సిన పాప ఎక్కడికి వెళ్ళింది.

రాత్రయింది... ఆ ఇంట్లో కళాకాంతులు లేవు. గోడకు చేరగిలబడి ఏడుస్తూ కూర్చుని వుంది. అతని పరిస్థితీ అలానే వుంది. వెంటనే ఏం చేయాలో తోచని పరి స్థితి.

ఏదైనా విషాదం జరిగినప్పుడు రకరకాల ఆలోచనలు వస్తుంటాయి. ఆమెకు అలాంటి ఆలోచనలే వచ్చాయి. పక్కింటావిడ చెప్పింది, వీధి చివర ఓ బాబా వచ్చాడని, అతను అంజనం వేసి చూసి అంతా చెబు తాడని...

ఏ పుట్టలో ఏ పాము వుందో, తన బిడ్డ ఎక్కడ తప్పిపోయిందో ఆ బాబాకు తెలు స్తుందేమో. వెంటనే భర్తను అక్కడికి బయ ల్దేరదీసింది. అతనికి ఇలాంటివి నమ్మకం వుండవు. అయినా ఇలాంటి పరిస్థితుల్లో ఆర్గ్యుమెంట్లు అసహ్యంగా వుంటాయి. తండ్రిగా తనకు కూతురిమీద ప్రేమ లేదను కుంటారు.

అందుకే భార్యతోపాటు అతనూ వీధి చివర విడిది చేసిన బాబా దగ్గరికి బయల్దే రాడు.

★ ★ ★

అక్కడంతా రద్దీగా వుంది. ఓ పక్క కొబ్బరికాయలు అమ్మే షాపు వెలిసింది. ఇంకో పక్క కర్పూరం, అగరొత్తులు, మరో వైపు నిమ్మకాయలు ఓ చిన్నసైజు అంగ డిలా మారింది.

అతనికి అంత బాధలోనూ నవ్వొచ్చింది. ఇలాంటి బాబాల భాగోతం పత్రికలు ఎంత బయటపెట్టినా జనం వస్తూనే ఉంటారు. కొన్నిరోజుల క్రితం అతను ఓ పత్రికలో ఇలాంటి దొంగ బాబాల గురించి, దొంగ స్వాముల గురించి వచ్చిన వార్తలు చదివాడు.

ప్రజల్లో ఎవేర్‌నెస్ పెంచడానికి పత్రికలు, టీవీ ఛానెల్స్ ఎంత కృషి చేసినా జనం మాత్రం ఇలాంటి బాబాలను, స్వాములను పెంచి పోషిస్తూనే వున్నారు.

అయితే అప్పుడే అతనికో సత్యం తెలి సింది. ఆ సత్యం బలహీనత... లేదా భయం. కష్టాల్లో వున్నవాళ్ళు ఆ కష్టాలు తీరేమార్గం కోసం ప్రయత్నాలు మొదలుపె డతారు. ఆ ప్రయత్నంలో వాళ్లకు చిన్న గడ్డిపోచ దొరికినా ఎంతో ఆనందంగా ఫీల వుతారు.

మానసికానందం వారికి కష్టాలకు పరిష్కారం దొరుకుతుందనే భరోసా కలిగిస్తుంది. ప్రజల కష్టాలను, సమస్యలను దొంగబాబాలు, స్వాములు క్యాష్ చేసుకుంటారు. అభయం ఇస్తారు. అంతా మేమే చూసుకుంటాం అంటారు. అతనికి అర్థం కానిదొక్కటే. వీళ్ళకే గనుక అంత గొప్ప శక్తి వుంటే ఇలా ముడుపులు స్వీకరిస్తూ, డబ్బు దండుకుంటూ ఎందుకు వుంటారు.

ఈ దేశాన్ని బాగుచేసే మంత్రదండం వాళ్ళ దగ్గరే వుంటే ఇన్ని కష్టాలు... కన్నీళ్ళు, రోగాలు, రొష్టులు ఎందుకు?

తల విదిల్చాడు. ఇప్పుడు తనకు కావలసింది కాసింత ఓదార్పు కలిగించే భరోసా, వెంటనే బాబా వుండే విడిది దగ్గరికి వెళ్ళాడు.

"ఏంటీ సమస్య?" ఆరుబయట కుర్చీ వేసుకుని కూర్చున్నతను అడిగాడు.

"మా పాప కనిపించడంలేదు. ఎక్కడుందో బాబాగారిని అడుగుదామని"

"ఓహో... మిస్సింగ్ కేసు అన్నమాట" పోలీస్ స్టేషన్‌లో రైటర్ భాష వాడాడు.

అవునన్నట్లు తలూపాడు. అతను వెంటనే లోపల్నుంచి ఓ రశీదు పుస్తకంలాంటిది పట్టుకువచ్చాడు. అందులోనుంచి ఓ పేపరు చించి, దాంట్లో "మీ వివరాలు, తప్పిపోయిన మీ పాప వివరాలు రాయండి. అంటే ఎత్తు, పొడుగు, రంగు, ఎప్పటినుంచి తప్పిపోయింది? ఎన్నేళ్ళు ఉంటాయి... లాంటి వివరాలు"

అవన్నీ ఎందుకు? అతనికి అర్థంకాలేదు. పక్కనే వున్న అతని భార్య భర్త భుజం మీద గిల్లి "ముందు అతను చెప్పినట్లు చేయండి" అంది.

అతను ఆ వివరాలు అన్నీ రాసిచ్చాడు.

"వెళ్ళి అక్కడ ఓ కొబ్బరికాయ, ఆ పక్కనే వున్న షాపులో కర్పూరం, అగరొత్తులు, నిమ్మకాయలు కొనుక్కొచ్చి కుడిపక్కన వున్న దర్శనం కౌంటర్‌లో ఇవ్వండి" చెప్పాడు.

అతను వెళ్ళి అతను చెప్పినట్టు అన్నీ కొనుక్కొచ్చాడు. అయితే బయట ధరలకు, ఇక్కడి ధరలకు చాలా వ్యత్యాసం గమనించాడు.

అక్కడో బోర్డు కూడా గమనించాడు 'బయటనుంచి తెచ్చిన పూజాసామగ్రి నిషిద్ధం' అంటూ.

కుడిపక్కన వున్న దర్శనం కౌంటర్‌లో వాటిని ఇవ్వగానే అతనో రసీదులాంటిది ఇచ్చి "వంద రూపాయలు ఇవ్వండి" అన్నాడు.

ఎందుకు? అని అడగలేదు. అతనికి సగం అర్థమై మిగతా సగం అర్థం చేసుకోగలిగాడు.

వంద రూపాయలు ఇచ్చి రశీదులాంటిది తీసుకున్నాడు.

"మీరు వెళ్ళి ఆ పక్కనేవున్న గద్దెమీద కూర్చోండి. మీ టోకెన్ నెంబర్ పదమూడు. మేమే పిలుస్తాం" చెప్పాడు.

★ ★ ★

గంట తర్వాత బాబా గదినుంచి పిలుపు వచ్చింది. అతని వయసు నలభైదాటి వుంటుంది. గడ్డం, మీసాలు బాగానే పెంచాడు. పెద్ద కుంకుమబొట్టు, మెడలో రుద్రాక్షలు. అతని మొహంలో కాగడా పెట్టి వెతికినా దైవత్వం కనిపించలేదు.

"ఎందుకు వచ్చావురా బిడ్డా... నీ బిడ్డ తప్పిపోయింది కదరా బిడ్డా" అన్నాడు ఆ బాబా.

"అవును స్వామీ" అతను చెప్పాడు.

"చూశారా... బాబా ఎంత కరెక్ట్‌గా చెప్పారో" ఆమె సంతోషపడింది.

"తప్పిపోయిన నీ బిడ్డ మూడున్నర అడుగులు వుంటుంది కదరా బిడ్డా" మళ్ళీ అడిగాడు ఆ బాబా.

"అవును స్వామీ" ఈసారి ఆమె అంది భక్తి ప్రపత్తులతో.

"తెల్లని తెలుపురా... ముద్దు పేరు

ఆంగ్లంలో 'ఎ'తో మొదలవుతుందిరా"

ఆ బాబా అప్పుడప్పుడు కళ్ళు మూసుకుని తెరిచి తన చేతివంక చూసుకొని చెబుతున్నాడు.

అతనికి అర్థమైంది. తను ఇందాక బయట రాసిచ్చిన కాగితం అతని కుడిచేతిలో వుంది. అంత బాధలోనూ అతనికి నవ్వొచ్చింది. అతని భార్యమాత్రం ఆ బాబా ముందు మోకరిల్లింది.

"వస్తుందిరా బిడ్డా... నీ బిడ్డ వస్తుంది. నీ దగ్గరికి నడిచి వస్తుంది. శాంతి చేయించరా, పూజ జరిపించరా... అమ్మవారిని ప్రసన్నం చేసుకోవాలి... నాలుగు మండలాలు పూజ చేయాలిరా"

"అంటే స్వామీ" అమాయకంగా అడిగింది ఆమె.

"నాలుగు వారాలు" చెప్పాడు బాబా.

మండలం అంటే నలభై రోజులని ఆ బాబాకు చెప్పాలని అనిపించినా సందర్భం కాదని వూరుకున్నాడు.

అతనికి అర్థమైంది ఆ బాబావల్ల ఉపయోగంలేదని. అలా అని ఆ విషయం భార్యతో చెప్పినా నమ్మదు.

"బయట మావాడు వుంటాడు... పూజకు సిద్ధం కండి. డబ్బు కట్టండి... మీ బిడ్డ పేరుమీద మేం పూజ జరిపిస్తాం. వెళ్ళి రండి శుభం భూత్"

లేచాడు అతను... శుభం భూయాత్‌ని అతను శుభం బూత్ అని పలకడం గమనించాడు. కనీసం వాక్శుద్ధి కూడా లేదు.

భార్యకోసం ఓ అయిదువందలు అడ్వాన్స్‌గా వదిలించుకున్నాడు.

★ ★ ★

"చూశారా బాబా ఎంత బాగా చెప్పారో... కానీ పాప ఎప్పుడు దొరుకుతుందో చెప్పలేదు కదండీ" అంది ఆమె.

"దొరుకుతుంది. మనం మరి కాసేపట్లో పోలీస్‌స్టేషన్‌కు వెళ్తున్నాం. అక్కడ రాందాసు అని నా ఫ్రెండ్ వున్నాడు. ఇన్‌స్పెక్టర్... మన పాపను అతను వెతికిపెడ్తాడు. ఖచ్చితంగా మన పాప ఎక్కడ వున్నా దొరుకుతుంది" చెప్పాడు అతను.

ఆమె అలాగే అన్నట్టు తలూపింది. అతడికి తన స్నేహితుడు రాందాసు గుర్తొచ్చాడు.

★ ★ ★

రాందాసుకు ఇన్‌స్పెక్టర్‌గా మంచిపేరు వుంది. అతనంటే నేరస్థులకు సింహస్వప్నం. అతను అమాయకుల జోలికి వెళ్ళడు. లంచాలు అలవాటులేదు. నిర్దోషుల పక్షానే నిలుస్తాడు. ఈ ప్రపంచంలో అతను భయపడేది ఒక్క అతని భార్యకే.

నిజం చెప్పాలంటే భార్య అంటే అతనికి భయం కూడా కాదు. అసహ్యం... ఆ అసహ్యంతోనే అతను భార్యకు భయపడుతూ వుంటాడు.

"ఏంటీ... త్వరగా బయల్దేరుతున్నారు?" అని భార్య ప్రమీల మొగుడిముందు నిలబడి అడిగింది.

"స్టేషన్‌కు వెళ్తున్నాను" రాందాసు చెప్పాడు.

"రాత్రి ఆలస్యంగా వచ్చారేంటి?" ఆరా తీస్తున్నట్లు దీర్ఘం తీస్తూ అడిగింది.

"ఓ కేసు విషయంగా ఆలస్యం అయ్యింది" చాలా ఓపిగ్గా చెప్పాడు. అతనికి భార్యతో గొడవపడ్డం ఇష్టం వుండదు. కోపంతో తను ఓ మాట అనడమో, చేయి చేసుకోవడమో చేస్తాడు. ఆ చికాకు తను స్టేషన్‌లో ప్రదర్శిస్తే? అతనెప్పుడూ ప్రశాంతంగా వుండడానికే యిష్టపడతాడు.

"రాత్రి మీరు ఆశ్రమం దగ్గర కనిపించారుట" అడిగింది అతని మొహం వంకే చూస్తూ.

"ఎవరు చెప్పారు?" ప్రశాంతంగానే అడిగాడు.

"ఎవరు చెబితే ఏమిటి... వాళ్ళను లాకప్‌లో వేసి కొడతారా?" అంది వ్యంగ్యంగా.

లాకప్‌లో వేసి కొట్టాల్సింది నిన్ను. మనసులో అనుకున్నాడు రాందాసు.

"అలాంటిదేమీలేదు" చెప్పాడు సౌమ్యంగానే.

"నిన్న మీ పర్సులో వందనోట్లు పది వుండాలిగా... రెండు తగ్గాయేంటి? "

రోజూ రాత్రుళ్ళు పర్సు చూడ్డం, భర్త జేబులు వెతకడం ఆమెకు వున్న అతి చెడ్డ అలవాటు. దానికి రెండు కారణాలు మొదటిది భర్తమీద అనుమానం, రెండోది ఆ డబ్బు అతను తన తల్లికి ఇస్తున్నాడేమోనని.

రాందాసుకు తల్లి అంటే పంచప్రాణాలు. చిన్నతనంలోనే తండ్రి చనిపోతే తనే కష్టపడి పెంచింది. అందరూ తమ పిల్లలను డాక్టర్లను, ఇంజనీర్లను చేయాలని బలవంతంగా తమ అభిప్రాయాలను పిల్లలమీద రుద్దుతారు. అతని తల్లిమాత్రం అలాంటిదేమీ చేయలేదు.

"అమ్మా నాకు పోలీస్ ఆఫీసర్ కావాలని వుంది అని అనగానే కొడుకును పోలీస్ ఆఫీసర్‌ని చేసింది. అందుకోసం రెక్కలు ముక్కలు చేసుకుంది.

రాందాసు భార్యకు అత్తగారంటే పడదు. తన ప్రేమను కూడా తల్లికే పంచుతాడనే దురభిప్రాయం. పైగా తనూ, తన భర్త, తన పిల్లలే వుండాలని... అనే పైశాచిక స్వార్థం.

ఆమె చేతిలో వుండే ఆయుధాలు రెండే రెండు. ఒకటి నోరు, గయ్యాళితనం. రెండోది బెదిరింపు. సాధ్యమైనంతవరకూ నోరు తెరిచి అరుస్తుంది. ఆ నోరువల్లే భయపడుతూ వుండాలని ఆమె అభిప్రాయం.

రాందాసు ఇన్‌స్పెక్టర్ అయినా అతనెప్పుడూ గొడవలకు దూరం. చుట్టుపక్కలవాళ్లకు తనో ఇన్‌స్పెక్టర్ అని కూడా తెలియనంత జాగ్రత్త పడతాడు.

తన నోరే తన మొగుడ్ని అదుపులో పెడుతుందనేది ప్రమీల నమ్మకం. తను ఏం సాధించుకోవాలన్నా తను ఎవర్ని సాధించాలన్నా తన నోటినే ఆయుధంగా మారుస్తుంది.

అత్తగారిని ఆ విధంగానే సాధించడం మొదలుపెట్టింది. ముందు చిన్నచిన్న గొడవలు, చీటికీమాటికీ అత్తమీద ఒంటికాలి మీద లేచేది. రాందాసు ముందు అత్తాకోడళ్ళ గొడవల్లో తల దూర్చడం ఎందుకని సైలెంటయ్యాడు. కానీ అది అత్తాకోడళ్ళ గొడవ కాదని, కోడలు అత్తని రాచి రంపాన పెట్టడం అని అర్థమైంది.

ఎన్నోసార్లు భార్యకు చెప్పి చూశాడు. అత్తాకోడళ్ళ మధ్య తను నలిగిపోతున్నట్లు చెప్పాడు. అయినా ప్రమీల గయ్యాళితనంలో మార్పులేదు.

కావాలనే కూరలో ఉప్పు ఎక్కువ వేస్తుంది అత్తకు బి.పి. అని తెలిసినా. తినకపోతే తనను నలుగురిలో నిలబెట్టి కోడలు బాగా చూసుకోవడం లేదని అనడానికే తినడం లేదంటుంది. ఆ ఉప్పు కలిపిన కూర తింటే తనకి పడదు.

టీ... కాఫీల్లో పంచదార ఎక్కువ వేయడం, అన్నం రాత్రిది పెట్టడం ఇవ్వన్నీ భరించలేకపోయింది. రాందాసు తల్లి కొడుకు తమ మధ్య నలిగిపోకూడదని భరించింది. ఇక భరించడం ఆమెవల్ల కాలేదు.

రాందాసు భార్యను బెదిరించాడు, బతిమాలాడు. నోరు పెద్దది చేసుకోవడమో, చస్తానని బెదిరించడమో చేస్తుంది. ఆ పరిస్థితుల్లో తల్లి ఆశ్రమంలో చేరింది. ఒక విధంగా రాందాసుకు అదే సంతోషంగా వుంది. ఆశ్రమంలోనైనా తల్లి సుఖంగా వుంటుంది. అది చాలు తనకు. అప్పుడప్పుడు ఆశ్రమం వెళ్ళి చూసి వస్తుంటాడు.

ఆ విషయంలో కూడా అతనికి సాధింపులు ఎక్కువయ్యాయి. రోజూ మీ అమ్మ దగ్గరకి వెళ్ళి వస్తున్నావంటుంది. డబ్బులు ఇస్తున్నావంటుంది. ఇదంతా ఒకవిధంగా టార్చరే అయింది.

తనమీద తనకే జాలి కలిగింది. పోలీసాఫీసర్‌గా ఎందర్నో టార్చర్ చేసిన తను ఈ విధంగా ఏ నేరమూ చేయకుండా టార్చర్‌కు గురికావడం ఏమిటనిపించింది.

పోలీసుల థర్డ్ డిగ్రీ కూడా తన భార్య పెట్టే టార్చర్‌కన్నా మెరుగే అనిపించింది.

★ ★ ★

"ఏమిటి మాట్లాడరేంటి? " అడిగింది భర్తనుంచి ఏ సమాధానమూ రాకపోవడంతో

"నాకు మనుషులతోనే మాట్లాడ్డం అలవాటు" అన్నాడు మౌనంగా రాందాసు.

"అంటే మీ ఉద్దేశ్యం ఏమిటి? నేను మనిషిని కాననా? "

"అది నీకే తెలియాలి" అంటూ షూ వేసుకునీ, లేసు కట్టుకొని, హేట్ తీసుకొని బయటకు నడిచాడు.

"మరి నేను జంతువునైతే మీ అమ్మ ఏమిటో" రాందాసు బయటకు వెళ్తుంటే వెనకనుంచి వినిపించింది.

రాందాసు పళ్ళ బిగువున కోపం ఆపుకున్నాడు.

"మీ అమ్మ గాడిద అన్నమాట" అంది అతనికి వినిపించేలా.

రాందాసు కోపం నషాలానికి అంటింది. వెంటనే కోపంగా వెనక్కి తిరిగివచ్చి తన చేతిలో వున్న స్టిక్ పైకెత్తాడు.

"కొడతారా... కొట్టండి. నేను అనుకుంటూనే వున్నాను. అది నూరిపోసింది" అంది ఏడుపు మొదలెట్టి.

"అది అంటున్నావు? ఎవరు? " కోపంగా అడిగాడు రాందాసు.

"ఇంకెవరూ... మొగుడూపెళ్ళాలు ప్రశాంతంగా వుండకూడదనుకునే రాక్షసి. వుందిగా మీ అమ్మ"

"ప్రమీలా..." గట్టిగా అరిచాడు రాందాసు.

"నామీద ఎందుకు అరుస్తారు. వెళ్ళి మొగుడూపెళ్ళాల మధ్య తగవులు పెట్టే మీ అమ్మమీద అరవండి"

"ప్రమీలా నువ్వు ఎక్కువగా మాట్లాడుతున్నావు. అనవసరంగా అమ్మ ప్రస్తావన తీసుకురావద్దు" సాధ్యమైనంత శాంతంగా అన్నాడు.

"ఎందుకు తీసుకురావద్దు. ఆ మహాతల్లే కదా. మొగుడూపెళ్ళాల మధ్య గొడవలు పెట్టేది. ఆశ్రమంలో తను కూర్చుంటుంది. ఇంక పనేముంటుంది. కొడుక్కి ఫోన్ చేసి రప్పించుకుంటుంది. జల్సాకేం తక్కువ, ఏళ్ళు మీద పడ్డాయి. లాభం ఏమిటి"

రాందాసుకు సహనం నశించింది. తల్లి ఎప్పుడూ ప్రమీల గురించి పల్లెత్తు మాట అనదు. పైగా "కోడలు పిచ్చిది, తెలియక ఏదో అంటుంది. నువ్వేమీ పట్టించుకోకు. నేను రాలిపోవడానికి సిద్ధంగా వున్న పండుటాకును" అనేది.

అలాంటి తల్లిని ఇష్టమున్నట్లు నానా దుర్భాషలాడుతుంటే భరించలేకపోతున్నాడు.

"ఆ ముసల్ది ఎప్పుడు పోతుందో, నాకీ దరిద్రం ఎప్పుడు వదులుతుందో" అంటూ రాగం మొదలుపెట్టింది.

రాందాసు భరించలేకపోతున్నాడు.

ఆవేశం కట్టలు తెగింది. కన్న తల్లిని నిర్దయగా మాటలతో అవమానిస్తుంటే అతనిలో రక్తం సలసలా మరుగుతోంది. అయినా నిభాయించుకున్నాడు. స్టిక్ టీపాయ్‌మీద పెట్టి రెండు చేతులు జోడించాడు.

"ప్రమీలా... నీకు దండం పెడతాను. అమ్మ గురించి ఏమీ అనకు... తనెప్పుడు నిన్ను ఒక్కమాట అని ఎరగదు. నీకిష్టం లేదన్నావు. తను వెళ్ళిపోయింది. నన్ను కని, పెంచి పెద్దచేసి ప్రయోజకుడ్ని చేసింది. ఆమెను ఏమీ అనకు. ఈ చివరి దశలోనైనా ఆమెను ప్రశాంతంగా వుండనివ్వు" అన్నాడు రాందాసు.

"అహా... అంటే నేనక్కడికి గయ్యాళిని

అయినట్టు మీ అమ్మ మహా సాధ్వీమణి అయినట్టు. ఏం నాటకం. ఆ ముసల్ది ఆశ్రమం నుండే డ్రామా నడిపిస్తుందన్న మాట" అంది మరింత గొంతు పెంచి.

రాందాసు సహనం కోల్పోయాడు. టీపా య్‌మీద వున్న స్టిక్ తీసి భార్య వీపుమీద కొట్టాడు.

పెద్ద అరుపు అరిచింది ప్రమీల. వెంటనే ఉక్రోషంతో మరింత రెచ్చిపోయింది.

"ఆ ముసలి దెయ్యం కొడుకుని రెచ్చగొ ట్టింది. దాని చేతులు విరిగిపోనూ" అంటూ మొదలుపెట్టింది. రాందాసు ఆవేశంలో అందినచోటల్లా కొట్టాడు. మొట్టమొదటిసా రిగా అతను భార్యమీద చేయిచేసుకున్నాడు.

స్టిక్ విరిగిపోయింది. పిల్లలు స్కూల్‌కు వెళ్లారు కాబట్టి ఈ గొడవ పిల్లలవరకూ వెళ్లలేదు. కోపంతో స్టేషన్‌కు బయల్దేరాడు.

అతను చాలా డిస్టర్బ్ అయ్యాడు. ఏదైతే జరక్కూడదని అనుకున్నాడో అది జరి గింది. సహనం కోల్పోయాడు.

అతడు స్టేషన్‌కు వెళ్ళగానే తనకోసం ఎదురుచూస్తూ స్నేహితుడు కనిపించాడు. రాందాసును చూడగానే ఆ స్నేహితుడు ఎదురొచ్చాడు. అతని కళ్లు ఎర్రగా ఉబ్బి వుండడం గమనించాడు.

★ ★ ★

"రాందాసూ... నీ సాయం కోసం వచ్చాను" ఉపోద్ఘాతం ఏమీ లేకుండానే అన్నాడు.

"ఏమిటి...ఏమైంది? " అడిగాడు స్నేహి తుడి కంగారుచూసి. సెంట్రీని పిలిచి రెండు వేడివేడి టీ తీసుకురమ్మని చెప్పి...

"మా పాప పింకి కనిపించడంలేదురా" భోరున ఏడుస్తూ చెప్పాడు.

"అదేమిటి... ఎక్కడికి వెళ్ళింది. సరిగ్గా వెతికావా? ఎప్పట్నుంచి కనిపించడం లేదు? " రాందాసు అడిగాడు.

"నిన్న సాయంత్రం నుంచి"

"మరి నిన్నంతా ఏం చేశావు? బంధు వుల స్నేహితుల ఇళ్లలో కనుక్కున్నావా? "

"అంతా కనుక్కున్నాను. ఎక్కడా లేదు. చివరికి ఓ బాబా దగ్గరికి కూడా వెళ్లాను"

విచిత్రంగా స్నేహితుడివైపు చూశాడు. "బాబా దగ్గరికి వెళ్లావా? నీకసలు మతి వుందా? మేము చేయాల్సిన పని వాళ్లు చేస్తారా? అలా అయితే మేమంతా మా స్టేషన్లకు తాళాలు వేసి, దొంగలను పట్టుకో వడానికి బాబాల దగ్గర క్యూ కట్టేవాళ్లం... సర్లే... ఇంతకీ పాప ఫొటో వివరాలు తెచ్చావా? "

అతను తన బిడ్డ వివరాలు, ఫొటో తీసి ఇన్‌స్పెక్టర్ రాందాసుకు ఇచ్చాడు.

ఈలోగా టీకుర్రాడు టీ తెచ్చాడు.

"ముందు టీ తాగు... స్థిమితపడు... మీ పాప ఎక్కడికి పోదు. నేను వెతికి పెడ తాను కదా... లక్కీగా మీ పాప కేసు నా ఏరియాలోకే వచ్చింది. మిగతా స్టేషన్లకు కూడా ఇన్‌ఫామ్ చేస్తాను." టీ తాగాక స్నేహితుడి భుజం తట్టి ధైర్యం చెప్పాడు.

"థాంక్స్‌రా... దురదుష్టం ఏమిటంటే నీలాంటి స్నేహితుడ్ని ఇలాంటి పరిస్థితుల్లో కలవడం... అన్నట్టు మీ ఆవిడ ఎలా వుంది. అమ్మ బావుందా? " అడిగాడు.

రాందాసుకు ఏం చెప్పాలో తెలియదు. పరస్పర విరుద్ధమైన ప్రశ్నలు... జవాబులు అంతే... ఏం చెప్పగలడు?

స్నేహితుడ్ని సాగనంపి హెడ్ కానిస్టేబు ల్‌ని పిలిచి ఆ ఫొటో చూపించి, ఏం చేయాలో చెప్పాడు.

★ ★ ★

సత్యమూర్తి చెట్లకు నీళ్లు పెడుతున్నాడు. రాజేశ్వరి ఆకుకూరలు తెంపుతూ వుంది. సరిగ్గా అప్పుడే ఆశ్రమంలోకి ఓ పాప వచ్చింది. చెట్లకు నీళ్లు పెడుతున్న సత్య మూర్తి ఎదురుగా కనిపించిన పాపను చూసి షాకయ్యాడు. వెంటనే భార్యవైపు చూసి...

"రాజేశ్వరీ ఎవరొచ్చారో చూడు" అని

చెప్పాడు ఆశ్చర్యానందాలతో.

రాజేశ్వరి ఆశ్రమం గేటువైపు చూసి నోటమాట రాలేదు. అది ఆనందమో, ఆశ్చ ర్యమో, అపనమ్మకమో.

"పింకీ..." అంటూ వడివడిగా నడుచు కుంటూ వెళ్ళి మనవరాలిని అక్కున చేర్చు కుంది.

పింకి మొహం వాడిపోయి వుంది. బట్టలు నలిగిపోయి వున్నాయి. ఒళ్లంతా కాలిపోతూవుంది.

సత్యమూర్తి ఆశ్రమం బయట చూశాడు. ఎవ్వరూ లేరు. అతనిలో అనుమానం.

"అమ్మా పింకీ... అమ్మా, నాన్నా ఏరీ? " అడిగాడు మనవరాలిని.

"వాళ్లు రాలేదు తాతయ్యా" చెప్పింది పింకి.

"వాళ్లు రాలేదా? మరి నువ్వు" అనుమా నంతో అడిగింది రాజేశ్వరి.

"నేనొక్కర్తినే వాళ్లకు చెప్పకుండా వచ్చాను నాన్నమ్మా" అంది పింకి నాన్న మ్మని గట్టిగా కరుచుకొని.

"చెప్పకుండా వచ్చావా? " భయంగా, కంగారుగా అడిగాడు సత్యమూర్తి.

"అవును తాతాయ్యా... ఎప్పుడు నాన్నమ్మ దగ్గరికి వెళ్తానన్నా మమ్మీ తిడుతుంది. అందుకే వాళ్లకు చెప్పకుండా వచ్చాను" అంది పింకి.

"ఎప్పుడు? " అడిగింది మనవరాలి వాలకం చూస్తూ.

"నిన్న"

"నిన్ననా... మరి నిన్నటినుంచీ"

"నాకు మీ ఆశ్రమం అడ్రస్ తెలియదు కదా... అందుకే అడుక్కుంటూ వచ్చాను. రాత్రి బస్టాండ్ దగ్గర నిద్రొచ్చింది. బస్సెక్కి బస్సులో పడుకున్నాను. నన్నెవరు చూళ్లే దు. పొద్దున డ్రైవర్ అంకుల్‌కు ఆశ్రమం పేరు చెప్పాను. ఎలా వెళ్లాలో చెప్పి బస్సె క్కించాడు"

"నాతల్లే" మనవరాలిని గుండెలకు హత్తు కుంది.

సత్యమూర్తికి ఒక్కక్షణం ఏం చేయాలో తోచలేదు. పింకి ఒళ్లు కాలిపోతుంది.

"నానమ్మా... అకలేస్తోంది" అంది పింకి.

"నా తల్లే... బిడ్డ ఎంత ఆకలితో వుందో" అంటూ మనవరాలిని ఎత్తుకొని కిచెన్‌వైపు నడిచింది.

కిచెన్‌లోకి వెళ్ళి మనవరాలికి టిఫిన్ తెచ్చేలోగా పింకి కళ్లుతిరిగి పడిపోయింది. భర్తను కంగారుగా పిలిచింది. రాజేశ్వరి, వైదేహి మిగతా వాళ్లంతా వచ్చారు. వైదేహి డాక్టర్‌కు ఫోన్‌చేసింది.

క్షణాలమీద డాక్టర్లు వచ్చారు. వైదేహి దగ్గరుండి అన్నీ సరిగ్గా జరుగుతున్నాయో లేదో అని పర్యవేక్షిస్తోంది. పాపకు సంబం ధించిన వివరాలేమీ అడగలేదు. ముందు పాప ప్రాణం ముఖ్యం.

★ ★ ★

రాందాసు కళ్లు మూసుకొని వున్నాడు. అతనికి చాలా చికాగ్గా వుంది. ఉదయం జరిగిన సంఘటన అతని కళ్లముందు కని పిస్తోంది. మొదటిసారిగా తను భార్యమీద చేయిచేసుకున్నాడు.

తనెంత సంస్కారహీనంగా ప్రవర్తిం చాడు. భార్య మీద చేయి చేసుకోవడం ఎంత హేయమైన పని. తను చాలా తొందరపడ్డాడు. కానీ ఆ క్షణంలో పిచ్చి ఆవేశం తనని భార్యమీద చేయివేసేలా చేసింది. తల్లిని ఎన్నిసార్లు అవమానించినా భరించాడు. ఏ తప్పుచేయకుండా తల్లిని దూషిస్తుంటే భరించలేకపోయాడు. అతనికి తనమీద తనకే కోపంగా వుంది. తనకుతనే ఏదైనా శిక్ష విధించుకోవాలి.

అతను ఏపనీ స్థిమితంగా చేయలేకపోతు న్నాడు. వెంటనే ఇంటికి వెళ్లాలనిపించింది. భార్యకు నచ్చచెప్పాలి. ఆమె తప్పేమిటో తెలియాలి. అలా ఆలోచిస్తూ వుండగానే ఇంటిదగ్గర్నుంచి ఫోన్ వచ్చింది. ఆ ఫోన్

కాల్ రిసీవ్‌చేసుకున్నాక అతని మొహంలో రంగులు మారాయి. వెంటనే జీపులో ఇంటికి బయల్దేరాడు.

భార్యకు సీరియస్‌గా వుందని ఇంటి పక్కవాళ్లు ఫోన్‌చేశారు. భార్యకి ఏమైంది? తను కొట్టిన దెబ్బలవల్ల ఏదైనా ప్రమాదం... అతను పరిపరి విధాలుగా ఆలోచిస్తున్నాడు.

★ ★ ★

"మన పింకి మనకు దొరకదా" ఏడుస్తూ



అడిగింది భార్య.

"పింకి మనకు ఖచ్చితంగా దొరుకుతుంది. ఇన్‌స్పెక్టర్ కూడా చెప్పాడు. వాడు నాకు మంచి స్నేహితుడు. మిగతా పోలీస్ స్టేషన్లకు కూడా ఇన్‌ఫామ్ చేసి పాపను త్వరగా వెతికి తెచ్చిస్తామని చెప్పాడు" అన్నాడు భార్యను ఓదారుస్తూ అతను.

"నాకు కళ్లు మూసినా తెరిచినా పాపే కనిపిస్తోంది. ఎప్పుడూ నట్టింట్లో ఆడుతూ పాడుతూ తిరిగే పిల్ల... ఎంత పని జరిగిందండి" అంది కళ్లొత్తుకుంటూ.

"నువ్వేం బాధపడకు. మన పాపకు ఏమీ కాదు"

భార్యకు ధైర్యం అయితే చెప్పాడు కానీ అతను ధైర్యం కోల్పోయి వున్నాడు. అతనికి ఎటూ పాలుపోవడంలేదు. ఏ సమస్యకూ పరిష్కారం కనిపించడంలేదు. తను ఏ జన్మలో ఎవరికి అపకారం చేశాడా... అని వాపోతున్నాడు కానీ, ఈ జన్మలోనే కన్నతల్లిని బయటకు గెంటేసాననే విషయం స్ఫురణకు రావడంలేదు. అదే అతను చేసిన పొరపాటు. అతనిలో ఆ పశ్చాత్తాపం కలిగి వుంటే తన బిడ్డ తన తల్లి దగ్గరే వుండొచ్చనే విషయం తెలిసేది.

రాందాసు ఇంటికి వెళ్లేసరికి భార్యను హాస్పిటల్‌కు తీసుకువెళ్లినట్టు తెలిసింది. ఇంటిపక్కన వుండే వాళ్లు భార్యను హాస్పిటల్‌కు తీసుకువెళ్లారు. వెంటనే హాస్పిటల్‌కు బయల్దేరాడు.

భార్యకు ఏమైందీ అర్థంకాలేదు. తను భార్యను కొట్టడంవల్లే ఇదంతా జరిగిందా? అలా ఆలోచిస్తూనే అతను హాస్పిటల్‌కు బయల్దేరాడు.

★ ★ ★

డాక్టర్లు భార్యను పరీక్షిస్తున్నారని తెలిసింది. రకరకాల టెస్టులు చేస్తున్నారు. ఎంతో గంభీరంగా కనిపించే అతను పూర్తిగా డీలా పడిపోయాడు. అతనిలో ఒక్కసారిగా ధైర్యం వచ్చి చేరింది. ఇంటిదగ్గర పిల్లలు స్కూల్‌నుంచి వచ్చి కంగారుపడుతూ వుంటారేమో. వెంటనే తన ఇంటిపక్కనే వున్నవాళ్లకు ఫోన్‌చేసి ఒకవేళ పిల్లలు వస్తే చూసుకోమని చెప్పాడు.

దాదాపు అతను గంటసేపు టెన్షన్‌గా గడిపాడు. డాక్టరు అతన్ని లోపలికి పిలిచాడు.

★ ★ ★

డాక్టర్ మొహంలో కూడా ఆందోళన చూసిన రాందాసు మరింత టెన్షన్‌కు గురయ్యాడు.

"సారీ మిస్టర్ రాందాసు" అన్నాడు గంభీరంగా మొహం పెట్టి.

"ఏమైంది డాక్టర్‌గారూ...ఎనీ ప్రాబ్లం ఏదైనా సీరియసా? "

"అవును... చాలా పెద్ద సమస్యే. ఇన్నాళ్లు మీ ఆవిడకు చిన్నచిన్న అనారోగ్యాలే అని నెగ్లెట్ చేస్తూ వచ్చారు. ఒకేసారి పెద్ద సమస్య వచ్చింది"

"ఏమిటి డాక్టర్ మీరంటున్నది"

"మీ ఆవిడకు కిడ్నీ ప్రాబ్లం. కంపల్సరీ కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషన్ జరగాలి"

"డా...క్ట...ర్"

"నేను మిగతా డాక్టర్లను కూడా సంప్రదించాను. కిడ్నీ దాతలు ఎవరైనా వున్నారేమో చూడక తప్పదు"

ఒక్కక్షణం అతని మెదడు పనిచేయడం మానేసింది. తనేం వింటున్నాడో అర్థంకా లేదు. స్థాణువైపోయాడు.

★ ★ ★

పింకి కొద్దికొద్దిగా కోలుకుంటోంది. రాజేశ్వరి కంటికి రెప్పలా చూసుకుంటోంది. సత్యమూర్తి మనవరాలిని వదిలి వుండడం లేదు. వైదేహి దగ్గరుండి వాళ్లకు ధైర్యం చెబుతుంది.

"ఏమండీ... పింకి మనదగ్గరే వుందని పిల్లలకు తెలియజేయండి. లేకపోతే అబ్బాయి, కోడలుపిల్ల కంగారుపడతారు"

సత్యమూర్తి మౌనంగా వుండిపోయాడు.

"నేను చెబుతుంది వినిపించుకోరేమిటండీ"

"ఏం వినిపించుకోమంటావు రాజేశ్వరీ"

"అదే పింకి మన దగ్గర వున్న విషయం అబ్బాయికి, కోడలికి తెలియజేయండి"

"నాకెందుకో వాళ్లకు చెప్పకపోవడమే మంచిదనిపిస్తోంది"

"ఏమిటండీ మీరంటున్నది? " అయోమయంగా అడిగింది రాజేశ్వరి.

"అవును రాజేశ్వరి. వాళ్లకు బిడ్డ బాధ ఏమిటో తెలియాలి. మనం బిడ్డలకు దూరంగా వుండి ఎంత బాధ పడుతున్నామో వాళ్లకు అర్థంకావాలి"

"అందుకని... ఈ విషయం చెప్పకుండా ఉంచుదామంటారా? "

"కొన్నిరోజులు ఉంచుదాం... వాళ్లకు తెలిసివస్తుందని. అయినా పిల్లల్ని జాగ్రత్తగా చూసుకునే పద్ధతి యిదేనా? పాప కనిపించకుండా పోగానే మనకు తెలియజేయవలసిన అవసరం లేదా? "

మాట్లాడలేదు రాజేశ్వరి. ఏం మాట్లాడగలదు ఆమె.

"చెప్పవేం రాజేశ్వరి. పాప కనిపించడం లేదని వాళ్లు కంగారుపడి వుండవచ్చు. పాప కోసం వెతుకుతూ వుండొచ్చు.

పాపకోసం కంట తడి పెడుతూ వుండొచ్చు. అలాంటప్పుడు పాపకు నాన్నమ్మ, తాతయ్య వున్నారన్న విషయం వాళ్లకు గుర్తురాలేదంటే ఏమనుకోవాలి. పింకి మన దగ్గరికి వచ్చిందేమోనన్న ఆలోచన కూడా రాలేదు.

స్నేహితుల ఇళ్లు, బంధువుల ఇళ్లు వెతికే వాళ్లకు నాన్నమ్మ, తాతయ్యను కలవడానికి పాప వెళ్లిందేమోనన్న ఆలోచన ఎందుకు రాలేదు" అని ఆగి అతనే సమాధానం చెప్పాడు.

"ఎందుకు రాలేదంటే మనం వాళ్ల దృష్టిలో లెక్కలేదు కాబట్టి"

"పోనీయండి... పిల్లలు... వాళ్లకేం తెలుసు" సత్యమూర్తి విరక్తిగా నవ్వాడు. "పిచ్చిదాన. వాళ్లు పిల్లలని...వాళ్లకేం తెలియదని నువ్వనుకుంటున్నావు. కానీ వాళ్లు అలా అనుకోవడం లేదు. వాళ్లు బాగా ఎదిగిపోయారు. ఎంత గొప్పగా అంటే గొప్ప నాటకంతో తల్లిదండ్రులనే బయటకు పంపించేంత గొప్పగా అద్భుతమైన పాత్ర పోషణతో అత్తమామలను బయటకు పంపించేంత గొప్పగా" అతని గొంతు వణికింది.

"పోనీయండి...వాళ్ళే ఎప్పుడో ఒకప్పుడు తెలుసుకుంటారు"

"వాళ్లు తెలుసుకోరు. మహా అయితే వాళ్లకు మన అవసరం పడ్డప్పుడు మనల్ని గుర్తుంచుకుంటారు"

భర్త ఆవేశం వెనక వున్న ఆవేదన ఆమెకు అర్థమవుతూనే వుంటుంది. అతని మనసు ఎంత గాయపడకపోతే అంతలా విలవిలలాడిపోతుంది.

వాళ్ల మాటలను పింకి వింటూనే వుంది.

"నిజం నాన్నమ్మా... తాతయ్య చెప్పింది అక్షరాల కరెక్ట్... నేను మీ దగ్గరే వుంటాను. ఎక్కడికీ వెళ్లను" అంది పింకి.

"తప్పమ్మా... అలా అనకూడదు. పిల్లలు తల్లిదండ్రుల దగ్గర వుండడమే న్యాయం"

"మరి తల్లిదండ్రులు పిల్లల దగ్గర వుండకపోవడం అన్యాయం కాదా నాన్నమ్మా" అడిగింది ఆరిందలా పింకి.

ఒక్కక్షణం ఎవరో తన మనసు మెలిపెట్టిన ఫీలింగ్.

"నిజమే... మనవరాలి ప్రశ్నకు సమాధానం తన దగ్గర లేదే"

వైదేహి వాళ్ల సంభాషణ అంతా వింటూనేవుంది.

ఎదుటి వ్యక్తి సమస్యలలో తల దూర్చకూడదన్నది ఆమె సిద్ధాంతం. అందుకే మిన్నకుండిపోయింది.

సత్యమూర్తి వైదేహివైపు తిరిగి "నువ్వు చెప్పు చెల్లెమ్మా... నేను చెప్పింది తప్పా? నేను చేయాలని అనుకుంటున్నది తప్పా?"

"పరిస్థితులనుబట్టి తప్పొప్పులు మారుతూ వుంటాయి. అన్నయ్యా... ఇప్పుడు నీ పిల్లలు బాధతో వున్నారు. ఆందోళనతో వున్నారు. వాళ్లని చేసిన తప్పుకు శిక్షగా బాధపెట్టొచ్చుగానీ, ఆందోళనకు గురిచేయవద్దు" అంది వైదేహి.

తన తప్పును... తన ఈ అనాలోచనను చక్కగా విశ్లేషించినట్టు అనిపించింది సత్యమూర్తికి.

అతనోనిర్ణయానికి వచ్చాడు. అతను రాజేశ్వరి వైపు తిరిగి...

"రాజేశ్వరీ... పాపను వాళ్ల యింటిదగ్గర వదిలిపెట్టి వద్దాం" అన్నాడు.

రాజేశ్వరి అలాగే అన్నట్టు తలూపింది.

"వద్దు తాతయ్యా...మీరు నన్ను అక్కడ వదలిపెడితే వాళ్లు మళ్ళీ నన్ను మీ దగ్గరికి పంపించరు. ఈసారి ఏ హాస్టల్లోనో చేర్పిస్తారు" అంది పింకి.

"అలా ఏం చేయరమ్మా... నేను చెబుతానుగా" అంది రాజేశ్వరి అనునయంగా.

పింకి మౌనంగా వుండిపోయింది. సరిగ్గా అప్పుడే ఆశ్రమంలోకి ఇన్‌స్పెక్టర్ వచ్చాడు.

"అరె... మన సత్యవతమ్మ కొడుకులా వున్నాడే" రాజేశ్వరి అంది.

"సత్యవతమ్మ కొడుకులా కాదు, సత్యవతమ్మ కొడుకే" అన్నాడు సత్యమూర్తి.

బైక్ ఓ పక్కన పెట్టి లోపలికి వచ్చి వైదేహికి నమస్కారం చేశాడు.

"మీరా... ఎలా వున్నారు. బావున్నారా?" అడిగింది వైదేహి.

"బావున్నాను మేడమ్. మీరు ఎలా వున్నారు" అడిగాడు అతను.

వైదేహి చిన్న నవ్వు నవ్వి చెప్పింది.

"ఇక్కడున్న వాళ్లంతా బాగానే వుంటారు"

రాందాసు కళ్లు తల్లి కోసం వెతికాయి.

"మీ అమ్మగారు గదిలో వున్నట్టున్నారు. వెళ్ళి చూడండి" చెప్పింది వైదేహి.

రాందాసు తల్లి గదివైపు నడిచాడు.

★ ★ ★

సత్యవతమ్మ ట్రంకుపెట్టెలోనుంచి కొడుకు, కోడలు, మనవలు వున్న ఫొటో తీసి తదేకంగా చూస్తోంది. ఎందుకో ఆమెకు కొడుకును చూడాలని అనిపిస్తోంది. మెల్లగా ట్రంక్ పెట్టెలో నుంచి ఆల్బం తీసింది.

అది చిన్నప్పటి ఆల్బం. పాతబడి చిరగడానికి సిద్ధంగా వుంది.

ఆ ఆల్బం పదిలంగా తీసింది. ఒక్కో పేజీ తిప్పుతుంటే ఆమె మనసు వెనక్కి వెళ్తోంది.

కాలచక్రం వెనక్కి తిరిగినట్టు అనిపిస్తోంది.

అన్నీ బ్యాక్ అండ్ వైట్ ఫొటోలు. కొన్ని వెలిసిపోయి వున్నాయి. కొడుకు చిన్నప్పటి ఫొటోలు, తను, తన భర్త కలిసి దిగిన ఫొటోలు, చిన్నప్పుడు ఇన్‌స్పెక్టర్ యూనిఫామ్‌లో దిగిన ఫొటో.

ఆ ఫొటోని తీసి గుండెలకు హత్తుకుంది. ఆమె తల్లి మనసు కొట్టుకుంటోంది.

ఎలా వున్నావురా చిట్టికన్నా. చిన్నప్పుడు నీ చిట్టి అడుగులు ఈ గుండెల మీద ఆడుకున్నాయి. నీ చిట్టి చేతులు ఈ తల్లిని హత్తుకున్నాయి. ఎప్పుడూ నువ్వు చేసే మారాం ఈ తల్లికి యింకా గుర్తువుంది. నీకు అన్నం తినిపించే సంఘటన కళ్ల ముందే వుంది.

ఆమెకు ఎన్నో సంఘటనలు గుర్తుకువస్తున్నాయి. ఏవీ ఆ రోజులు. బిడ్డ అన్నప్రాసన, స్కూల్లో చేర్పించిన రోజు...తన వీపు మీద ఎక్కించుకొని ఆడించిన రోజులు. ఆమె కళ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి. గతం ఎంత నిర్దయురాలు. అది ఆనందాన్ని, విషాదాన్ని రెండింటినీ గుర్తుచేసి మరీ బాధ పెడుతుంది. ఒక్కోసారి కాలం వెనక్కి వెళ్లిపోయి తన కొడుకుని చిన్నపిల్లవాడిని చేస్తే బావుండు.

తను మళ్ళీ వాడిని ఆడించి లాలించేది. తన గుండెలమీద పడుకోబెట్టుకునేది. తన వీపుమీద ఎక్కించుకునేది. కానీ తన మనవడిలో కొడుకుని చూసుకుందామన్న ఆ అదృష్టం తనకు లేదు.

తల్లిని వెనకనుంచి గమనిస్తూనే వున్నాడు. తన చిన్నప్పటి ఫొటోలు చూస్తూ తల్లి కంటతడి పెట్టడం అతనికి తెలుస్తూనే వుంది. అందుకే అమ్మ ప్రేమ గొప్పది.

అతనికి చిన్నప్పుడు అమ్మ చెప్పిన కథ గుర్తొచ్చింది. ఓ రాజు ప్రియురాలి మోజులో పడతాడు. ఆ ప్రియురాలు అతని తల్లి గుండెను తీసుకురమ్మని కోరుతుంది. ప్రియురాలిమీద వ్యామోహంతో వెళ్ళి తల్లి గుండెను అడుగుతాడు. తల్లి ఆనందంగా తను ప్రాణాలు విడిచి తన గుండెని బిడ్డకు ఇస్తుంది.

ప్రియురాలి కోసం తల్లి గుండెను తీసుకొని పరుగెడుతూ... పరుగెడుతూ, ఓ రాయి తగిలి కిందపడి 'అమ్మా' అంటాడు బాధగా. వెంటనే ఆ తల్లి గుండె కదిలిపోయి "ఏమైందిరా చిట్టికన్నా... దెబ్బతగిలిందా... జాగ్రత్త నాయనా" అంటుంది. తల్లి ప్రేమకు ఇంతకన్నా ఉదాహరణ ఏముంటుంది?

అమ్మా... అతను పిలిచాడు. ఆ పిలుపులో ఆర్ద్రత వేనవేల గొంతుకలైంది.

సత్యవతమ్మ తల వెనక్కి తిప్పి కొడుకుని చూసింది.

ఆ క్షణం ఆమె మనసులో ఆనందాన్ని ఎంత డబ్బిచ్చినా కొనలేమన్నట్టు వుంది.

"వచ్చావా చిట్టికన్నా... రారా... ఎలా వున్నావురా... కూచో" అంది చీరకొంగుతో కుర్చీమీద వున్న దుమ్ము దులిపి.

అతను కుర్చీలో కూచోలేదు. తల్లిపక్కనే కూచోని, తల్లి ఒడిలో తల పెట్టుకుని పడుకున్నాడు. నేరస్థులకు సింహస్వప్నం... కరుకుదనంనిండిన వృత్తి నిర్వహణలో కరుడుగట్టిన పోలీసు అధికారి... చిన్న పిల్లాడిలా తల్లి ఒడిలో తలపెట్టాడు.

"ఏమైందిరా కన్నా... ఉండు, నీకోసం ఏం దాచానో చెప్పు" అంటూ ట్రంకు పెట్టె లోనుంచి ఓ డబ్బా తీసింది.

డబ్బా మూత తీసి, అందులోనుంచి ఓ సున్నివుండ కొడుక్కి ఇచ్చింది.

వైదేహిగారికి మాటల సందర్భంలో చెప్పాను నీకు సున్నివుండలు ఇష్టమని. వెంటనే చేయించింది. ఆవిడ దేవత... ఎవరికేది ఇష్టమో క్షణాల్లో తెలుసుకుంటుంది. ఇక్కడ కన్నబిడ్డలు లేరని బాధ తప్ప ఏబాధ వుండదు' అంది కొడుక్కి సున్ని వుండ తినిపిస్తూ.

రాందాసుకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తల్లి ప్రేమ అంటే ఇదేనేమో...

ఎందుకో ఒక్కక్షణం సత్యవతమ్మ అను మానంగా రాందాసు వంకచూసి "ఏంట్రా అలా వున్నావు? నా గురించి మళ్ళీ ఏమైనా కోడలితో గొడవ పడ్డావా... అలాంటిదేమీ వద్దు. నా కోడలి ముందు నన్ను తిట్టినా సంతోషమే, దానికి మాత్రం ఏం తెలుసు పిచ్చిపిల్ల... అన్నట్టు వెళ్ళేప్పుడు ఈ సున్ని వుండలు తీసుకువెళ్ళు... దానిక్కూడా ఇష్టం.

నేనిచ్చానని చెప్పకు. స్వగృహపుడ్స్‌లో కొనుక్కొచ్చానని చెప్పు. ఇక వెళ్ళరా... ఆల స్యమైతే తనకు అనుమానం వస్తుంది. పిచ్చి కన్నా... నా గురించి నువ్వు మధ్యలో నలి గిపోతున్నావు. వీలైనపుడే రా... కంగారేం లేదు. నువ్వొచ్చినా, రాకపోయినా నా బిడ్డ వేకదరా"

"అమ్మా" తల్లిని చుట్టుకుపోయాడు.

"అరె... ఏంట్రా... ఇది చిన్నపిల్లాడి లా...లే" అంది అనునయంగా.

ఆ దృశ్యం చూసిన వైదేహికి కళ్ళు తడి బారాయి.

ఒక్కక్షణం అక్కడ నిశ్శబ్దం.

కొడుకు చెప్పిన విషయం ఆమె జీర్ణించు కోలేకపోయింది.

"అయ్యో... ఎంత ఘోరం జరిగింది. ముసలిదాన్ని నాకు ఏదైనా అయినా బావుం డేది" అంది బాధగా. రాందాసు మౌనంగా వుండిపోయాడు.

"ఒరే కన్నా.. నా కిడ్నీ పనికి వస్తుందా? నాకే జబ్బులేదు. నిక్షేపంగా వున్నాను. నా కిడ్నీ కోడలు పిల్లకు ఇస్తానా"

ఒక్కక్షణం విభ్రాంతిగా చూస్తుండిపో యాడు రాందాసు.

ఎంత తేడా. ఇద్దరూ స్త్రీలే. ఒకరు తల్లి, మరొకరు భార్య. తన తల్లి కూడా తండ్రికి భార్యే కానీ ఎంత తేడా.

ఇంకేం ఆలోచించకురా. నేను నా కిడ్నీని కోడలు పిల్లకు ఇస్తున్నానంతే" స్థిరంగా అంది సత్యవతమ్మ.

"అది కాదమ్మా"

"ఏది కాదు. మనం రేపు హాస్పిటల్‌కు వెళ్తున్నాం అంతే. నువ్వెళ్ళి పిల్లల్ని తీసు కురా. ఇవాళ ఇక్కడే వుంటారు" అంది.

★ ★ ★

రాందాసు బయటకు వస్తూ సత్యమూర్తి దంపతులను వాళ్ల పక్కన వున్న పింకిని చూసాడు. అతనికి ఆ పాపను ఎక్కడో చూసినట్టు అనిపించింది.

మెల్లమెల్లగా ఆ పాపను ఎక్కడ చూశాడో గుర్తు చేసుకోసాగాడు.

అప్పుడు గుర్తొచ్చింది. ఆ పాప పేరు పింకీ. వెంటనే సత్యమూర్తి దంపతుల దగ్గ రకి వెళ్లి అమ్మా ఈ పాప అంటూ ఆగాడు.

"మా మనవరాలు పింకీ" అన్నాడు సత్య మూర్తి.

"అంటే మీరు"

"మీకు మా అబ్బాయి తెలుసా" అడిగాడు సత్యమూర్తి.

"తెలియకపోవడం ఏమిటి. నేను, మీ అబ్బాయి మంచి స్నేహితులం. మీతో ఎక్కువ పరిచయం లేదు" అన్నాడు రాందాసు.

సత్యమూర్తి జరిగింది చెప్పాడు. రాందాసు మనసు బరువెక్కింది. ఎన్ని కథలు... ఎన్నెన్ని వ్యధలు.

"చూడు బాబూ! నువ్వు మాకో సాయం చెయ్. మా మనవరాలిని వాళ్ల అమ్మనా న్నల దగ్గరికి చేర్చు వాళ్లు కంగారు పడుతూ వుంటారు" అంది రాజేశ్వరి.

ఆమెకు కొడుకుని చూడాలనే వుంది. కానీ మళ్లీ అక్కడ ఏ అవమానాలు ఎదు ర్కోవలసి వస్తుందాఅన్నది బాధ.

"తప్పకుండా. కానీ నాకు ఒక్కటే బాధగా వుంది. మీలాంటి గొప్ప వాళ్లను వాడు వదులుకోవడం..."

సత్యమూర్తి నవ్వాడు. ఆ నవ్వులో ఎన్నో

అర్థాలు.

రాందాసుకు అనిపించింది. తను మాత్రం తనూ తన తల్లిని వదులుకోలేదా.

★ ★ ★

ఆ ఇంట్లో రెండు రోజులుగా శ్మశాన నిశ్శబ్దం. తిండి తిప్పల్లేవు. ఎవరి మొహం లోనూ వెలుగులేదు. అన్నిదారులూ మూసుకుపోయినట్టు విషాదమొక్కటే తమ తోడు అన్నట్టు వున్నారు.

లైటు వేసుకోవాలన్న స్పృహ కూడా వాళ్లకు లేదు.

ఎవరు ఎవర్ని ఓదార్చాలో అర్థం కాలేదు. ఆ క్షణం అతనికి తన తల్లి గుర్తుకు వచ్చింది. తన తల్లిపట్ల తను ఎంత అమానుషంగా ప్రవర్తించాడో గుర్తుకు వచ్చింది. ఎన్నిసార్లు పింకీ నాన్నమ్మను తాతయ్యను చూస్తానని అన్లేదు. తన బాధను ఎవరితో చెప్పుకోవాలి? తన బాధను ఎవరితో పంచుకోవాలి?

అతను అలా ఆలోచిస్తూ వుండగానే ఇంటి ముందు బైక్ ఆగిన శబ్దం వినిపించింది. అయినా అతను శబ్దాన్ని పట్టించుకునే పరిస్థితిలో లేడు.

సరిగ్గా రెండు నిమిషాలు తర్వాత బూట్ల శబ్దం విని తలెత్తి షాకయ్యాడు ఆ షాక్ ఆనందం వల్ల కలిగింది.

ఎదురుగా ఇనస్పెక్టర్ రాందాసు. అతని పక్కని తన కూతురు పింకీ.

భార్య భుజం పట్టి ఉద్వేగంగా చెప్పాడు.

"అ.. టు అటు చూడు ఎవరొచ్చారో?"

భార్య అటువైపు చూసింది. ఎదురుగా పింకీ. తన పింకీ..

పరుగెత్తుకెళ్లి కూతుర్ని వాటేసుకుని ముద్దులతో ముంచెత్తింది. ఏడుపుతో ఆమె గుండెలు ఎగిరెగిరి పడుతున్నాయి. ఉద్వేగంతో కదిలిపోతోంది. "వచ్చావా నా చిట్టి తల్లీ ఎక్కడికి వెళ్లావమ్మా" అంటూ కూతురి ఒళ్లంతా తడిమింది. ఆమెకు దుఃఖం ఆగడంలేదు. కన్న ప్రేమ, మమకారం ఆమెలోని ఉద్వేగాన్ని ప్రోది చేసుకొని మరీ బయటకు వస్తుంది.

అతను రాందాసు రెండు చేతులు పట్టుకున్నాడు.

"థాంక్స్‌రా... నా బిడ్డను తిరిగి నాకు అప్పగించావు. నీ రుణం నీ రుణం ఎలా తీర్చుకోవాలో అర్థం కావడంలేదు"

రాందాసు చిన్న నవ్వు నవ్వాడు. స్నేహితుని భుజం తట్టి అన్నాడు,

"నువ్వు తీర్చుకోవాల్సింది నా రుణం కాదు. నీ తల్లిదండ్రుల రుణం. పింకి ఎక్కడికి వెళ్లిందనుకుంటున్నావు?"

"ఎక్కడికి వెళ్లింది?" అడిగాడు అతను.

"వాళ్ల తాతయ్య, నాన్నమ్మల దగ్గరికి" చెప్పాడు నిశ్శాబ్దాన్ని ఛేదిస్తూ రాందాసు.

ఒక్కక్షణం ఆ దంపతులిద్దరు ఉలిక్కిపడ్డారు. తల్లి కూతురి కళ్లలోకి చూస్తూ అవునా అని అడిగింది.

"అవును..." ఏమాత్రం తొణక్కుండా చెప్పింది పింకి. ఒక్క క్షణం షాకయింది. వెంటనే కూతురి చెంప చెళ్లుమనిపించింది. ఎర్రగా కందిన తన చెంపను చేత్తో తడుముకుంటూ తల్లి వైపు సూటిగా చూసి చెప్పింది.

"తాతయ్య నాన్నమ్మల దగ్గరకి ఎందుకు వెళ్లానో తెలుసా. నీకన్నా వాళ్లు ప్రేమగా చూస్తారని. నువ్వెప్పుడైనా ఒళ్లో కూచోబెట్టుకొని తాతయ్యలా కథలు చెప్పావా? నాన్నమ్మలా వెండిగిన్నెలో అన్నం కలిపి తినిపించావా? ఎవరితో ఎలా వుండాలో నేర్పించావా?"

కూతురి వైపు విస్మయంగా చూసింది. "ఎంత పెద్దపెద్ద మాటలు" కోపంగా అంది.

"నీ వయసుకు మించిన మాటలు మాట్లాడకు" రాందాసు వెంటనే కలుగజేసుకొని అన్నాడు.

"చాలా తప్పండి. మీ పాప మానసికంగా చాలా ఎదిగింది. మీరే సంకుచితంగా ఎది

గారు. మానసికంగా ఎదగడానికి సంకుచితంగా ఎదగడానికి చాలా తేడా వుంది.

ఈ వయసులో పిల్లలు పెద్దలతో ప్రేమను పొందాలనుకుంటారు. నాన్నమ్మ, బామ్మ, తాతయ్య వాళ్ల కబుర్లు కావాలనుకుంటారు.

మీరు అదృష్టవంతులు. మీ ఇంట్లో పెద్దలున్నారు. మీ పిల్లలకు నాన్నమ్మ, తాతయ్య వున్నారు. కానీ వాళ్ల ప్రేమను మీ బిడ్డకు అందించలేకపోయారు. మీరు అందించలేని ప్రేమను మీ బిడ్డ వెతుక్కుంటూ వెళ్లింది"

అతను షాకింగ్‌గా చూస్తుండిపోయాడు.

"మీరే ఆలోచించండి. మీ పెద్ద వాళ్లను దూరం చేసుకొని మీరు అనుభవిస్తోన్న సుఖం ఏమిటి? మీకు లభించే సుఖం మీకు ఎలాంటి అనుభూతిని కలిగిస్తుందో నాకు తెలియదు కానీ మీరు పొరపాటు చేస్తున్నారు. కోడల్ని రాచిరంపాన పెట్టే అత్తగార్లకన్నా మీ అత్తలు నయంకదా. అత్తలను సతాయించే కోడళ్లుగా లోకం దృష్టిలోనే కాదు, మీ పిల్లల దృష్టిలో మీకు చెడుగా వుండాలని అనుకోవడం శ్రేయస్కరం కాదు.

ఈ ప్రభావం మీ పిల్లల మీద ఎలా పడుతుందో మీకు తెలియడం లేదు. పింకి ఇల్లు వదిలి పారిపోవడం ఒక ఉదాహరణ మాత్రమే. పెద్దవాళ్లకు వృద్ధాప్యం ఒక శాపంకాదు. పిల్లల ప్రేమ ఒక వరం. అవకాశాన్ని మీరు శాపంగా మారుస్తున్నారంతే. నేనూ అందుకు మినహాయింపుకాదు. త్వరలో నా తప్పును నేను సరిదిద్దుకోవాలని అనుకుంటున్నాను. వస్తాను" అంటూ బయటకు నడిచాడు రాందాసు.

★ ★ ★

నీరసంగా కళ్లు తెరిచింది ప్రమీల. చుట్టూ చూసింది. అది హాస్పిటల్. ఆమె బెడ్ మీద వుంది. తన పక్కనే భర్త వున్నాడు. ఆమెకు దుఃఖం తన్నుకు వచ్చింది. ఒక విధంగా మృత్యువుతో పోరాడి మరీ జన్మ ఎత్తిన భావన కలిగింది.

భర్త తన తల దగ్గరే కూచోని తన తల మీద చేయివేశాడు. ఎంత భద్రతా భావం. ఆమెకు భర్తపట్ల తను ప్రవర్తించిన తీరు గుర్తుకు వచ్చింది. ఒకవేళ తను ఈ ఆపరేషన్ ఫెయిలై చనిపోతే...

బతుకు విలువ తెలుస్తోంది. బతకడంలో వున్న గొప్పతనం అర్థమవుతోంది. ఆ గొప్పతనాన్ని తను ఆస్వాదించాలి. ఇతరులను సాధించడం కన్నా ఇతరులకు ఆనందం కలిగించడంలో వున్న తృప్తిని ఎంజాయ్ చేయాలి.

"ప్రమీలా ఇప్పుడెలా వుంది" సౌమ్యంగా ప్రేమగా అడిగాడు రాందాసు.

"బావుందండీ" అంది నీళ్లు నిండిన కళ్లతో ప్రమీల. ఈలోగా డాక్టర్ వచ్చాడు. రాందాసు లేచి నిలబడ్డాడు. డాక్టర్ ఓసారి కేస్‌షీట్ చూసి సంతృప్తిగా నిట్టూర్చి చెప్పాడు.

"యూ ఆర్ ఆల్‌రైట్. చివరి క్షణాల్లో మృత్యువును జయించారు. రెండు కిడ్నీలు పనికి రావనుకున్న సమయంలో బతికారు. యూ ఆర్ లక్కీ" అన్నాడు డాక్టర్.

ప్రమీల రెండు చేతులూ జోడించి అంది "మీకు కృతజ్ఞతలు ఎలా చెప్పాలో తెలియడం లేదు. డాక్టర్‌గారూ! మృత్యుముఖంలో వున్న నన్ను బతికించారు. మళ్లీ పిల్లలను, నా భర్తను చూస్తానని అనుకోలేదు. ఏమిచ్చి మీ రుణం తీర్చుకోవాలి? "

"మీరు రుణం తీర్చుకోవాల్సింది నాకు కాదు. తన ప్రాణాలు లెక్కచేయకుండా తన కిడ్నీని మీకు డొనేట్ చేసిన వాళ్ల రుణం తీర్చుకోవాలి. తన చావుకు సైతం సిద్ధపడ్డ వాళ్ల రుణం తీర్చుకోవాలి" చెప్పాడు డాక్టర్.

"డాక్టర్‌గారు... నాకు ప్రాణం దానం చేసిన మహానుభావుడు ఎవరో చెప్పండి. వాళ్ల పాదాలకు నమస్కరించి వాళ్ల రుణం తీర్చుకుంటాను" అంది సిన్సియర్‌గా ప్రమీల.

"మీకు కిడ్నీ డొనేట్ చేసింది ఓ స్త్రీ" చెప్పాడు డాక్టర్.

"స్త్రీయా... ఎవరు డాక్టర్! నాకు ఆవిడను చూడాలని వుంది. నా కన్నీళ్లతో ఆవిడ పాదాలకు అభిషేకం చేయాలని వుంది" కదిలిపోతూ అంది ప్రమీల.

ఈ ప్రపంచంలో తను బతికితే చాలని అనుకునే వాళ్లే ఎక్కువ. కానీ ఓ వ్యక్తి ప్రాణాలు కాపాడ్డం కోసం తన ప్రాణాలు లెక్క చేయకుండా కిడ్నీ యిచ్చి తనను బతికించిన మహాదాత ఎవరు?

డాక్టర్ రాందాసు వంక చూసి "ఆ కిడ్నీ దాత ఎవర్లో మీ ఆవిడకు చూపించండి. అని ప్రమీల వైపు చూసి, ఆవిడ పక్క వార్డులోనే వున్నారు. వెళ్లి చూడండి" అన్నాడు.

ప్రమీల మెల్లగా భర్త సాయంతో లేచింది. పక్కవార్డు వైపు నడిచింది. ఆమెకు చాలా ఎక్సయిటింగ్‌గా వుంది.

రాందాసు మెల్లగా పక్కవార్డుకు తీసుకువెళ్లాడు. అక్కడ బెడ్‌మీద వున్న వ్యక్తిని చూసి స్థాణువైంది. ప్రమీల బెడ్‌మీద వున్నది తన అత్తగారు. తన భర్త తల్లి.

"ఏ...మం...డి నాకు కిడ్నీ డొనేట్ చేసింది..."

"మా అమ్మ... నీ అత్తగారే" నీళ్లు నిండిన కంఠంతో అన్నాడు.

"అవునా ఆవిడ ఎలా ఒప్పుకున్నారు"

"నువ్వు చావుబతుకులమధ్య వున్నావు. అమ్మకు నా పరిస్థితి చెప్పాను. తనే ప్రపోజ్ చేసింది. తన కిడ్నీ నీకు ఇస్తానంది. నేను ఎంత వారించినా విన్లేదు. డాక్టర్లు కూడా ఈ వయసులో రిస్క్ అన్నారు. అయినా సరే అంది"

ప్రమీల మంచం మీద కూచుండిపోయింది. అత్త కాళ్లమీద తన చేతులు వేసింది. ఆమె కళ్లు కన్నీటి వర్షాన్ని ఆ పాదాల మీదుగా వర్షిస్తున్నాయి.

"అ...త్త...య్యా..." మొదటిసారిగా మనస్ఫూర్తిగా పిలిచింది.

మెల్లగా కళ్లు తెరిచింది సత్యవతమ్మ. ఎదురుగా కోడలు. వెంటనే లేవబోయింది.

"మీరు లేవద్దత్తయ్యా" అంది ప్రమీల.

సత్యవతమ్మ తృప్తిగా నిట్టూర్చింది.

"నన్ను క్షమించమని అడగడానికి కూడా నోరు రావడంలేదు. అంత ఘోరంగా మీ పట్ల ప్రవర్తించాను. నేను ఎవరినైతే ప్రతి నిత్యం అవమానించానో నా జీవితంలో ఎవరినైతే ఎక్కువ కాలం బాధపెట్టానో ఆ వ్యక్తే నాకు జీవితాన్ని ఇచ్చింది. మీ రుణం తీర్చుకోలేను. తప్పులు సరిదిద్దుకునే అవకాశం ఇవ్వండి. జీవితాంతం మీకు సేవ చేసుకునే అవకాశం కలిపించండి. మనం ఇటునుంచి ఇటే ఇంటికి వెళ్దాం" అంది.

ఆ మాటలు చాలు ఆమెలో పశ్చాత్తాపం కలిగిందనడానికి.

సత్యవతమ్మ ఏదో చెప్పబోయింది. అప్పటికే లోపలికి అడుగు పెట్టిన వైదేహి అంది.

"మీరింక ఏమీ చెప్పొద్దు. ఏ మనిషికైనా ఆత్మ శోధన, పశ్చాత్తాపం, పరివర్తన జీవిత కాలం వుంటాయి. తప్పు చేయడం కన్నా ఆ తప్పును సరిదిద్దుకోవడం గొప్ప విషయం. మీరింక ఏమీ ఆలోచించొద్దు. మీ కోడలితో వెళ్లిపొండి. మీ ట్రంకు పెట్టె క్షేమంగా మీ ఇంటికి చేరుతుంది.

ఈసారి ఆశ్రమానికి వచ్చేప్పుడు మీరంతా కలిసి రావాలి. ఒంటరిగా వున్న వృద్ధులతో మీరు కాసేపు గడపాలి. అదే మీకు మేము వేసే శిక్ష" అంది చిర్నవ్వుతో వైదేహి.

★ ★ ★

పింకిలో చాలా మార్పు వచ్చింది.

ఎప్పుడూ ఒంటరిగా కూచుంటుంది. ఏదో ఆలోచిస్తూ వుంటుంది. ఎదురింటి పిల్లలు వాళ్ల బామ్మ ఒళ్లో కూచొని కథలు వింటుంటే తను కూడా అలా తన నాన్నమ్మ ఒళ్లో కూచొని కథలు వింటే బావుండనిపిస్తుంది.

తాతయ్యతో, కబుర్లు చెప్పుకోవాలని అని పిస్తుంది. తల్లి ఎప్పుడూ చదవమని, టీవీ చూస్తే చంపేస్తానని హోమ్‌వర్క్ చేయ మని అంటుంది. కానీ తన గురించి పట్టించుకోదు. తన మనసులో ఏముందో ఆలోచించదు.

చిన్నారి మనసులో ఎన్నో ఆలోచనలు, వాటిని ఎలా చెప్పాలో తెలియని వయసు. పిల్లల మనస్తత్వాన్ని ఎప్పుడూ ఆ పిల్లల వైపు నుంచి ఆలోచించని తల్లిదండ్రులకు ఇదో ప్రహేళిక.

"ఏంటోయ్ దిగులుగా వున్నావు?" అడిగాడు భర్త.

"పాపగురించి" అంది ఆవిడ.

"పాపకు ఏమైంది?"

"ఏమైందీ మీరు గమనించడంలేదు.



పాప దిగులుగా వుంటోంది. నిన్న మేడమ్ దారిలో కలిసి చెప్పారు. పాప చాలా డల్‌గా వుంటోందిట. ప్రోగ్రెస్ రిపోర్ట్‌లో అన్నీ తక్కువ మార్కులే. అంతకుముందు ఎప్పుడూ పాపే ఫస్ట్‌రాంక్‌లో ఉండేది. అలాంటిది ఫోర్టీన్త్‌కు వెళ్ళిపోయింది"

"మనం కేర్ తీసుకోవాలి. పోనీ ట్యూషన్ పెట్టిద్దామా?"

ఆమె పెదవులమీద బాధతో కూడిన నవ్వొకటి మెరిసింది.

"ట్యూషన్ పెట్టిస్తే మాత్రం... పాపకు ర్యాంకు వస్తుందన్న నమ్మకంలేదు"

"అదేంటి... అలా మాట్లాడుతున్నావు?" భార్య ప్రవర్తన అతనికి విచిత్రంగా కనిపిస్తోంది.

"అవునండీ... ఇంట్లో వంటపనికోసం వంటమనిషిని పెట్టాం. పాపకోసం పనిమనిషిని పెట్టాం. ఇవ్వాళ చదువుకోసం మాస్టారిని పెడతాం... అయినా పాప దిగులు తగ్గించలేమేమో"

"నువ్వేం మాట్లాడుతున్నావో నాకు అర్థం కావడంలేదు"

"ఇన్నాళ్ళూ మనం ఏ చేశామో నాకు మాత్రం ఇప్పుడు అర్థమవుతోందండీ'

"అంటే?"

"అవును. మనం తప్పు చేశాం. చాలా తప్పు చేశాం"

"తప్పా?"

"ముమ్మాటికీ తప్పే. వంటపని అత్తయ్య చూసేది. బయటపనులు మామయ్యగారు చూసుకునేవారు. పాపను స్కూల్‌కు తీసుకువెళ్ళేవారు, సాయంత్రం ఇంటికి రాగానే తనే ట్యూషన్ చెప్పేవారు. పాప హెల్దీగా ఉండేది. అలాంటిది ఇప్పుడు పాప ఒంటరిది అయింది. పనిమనిషి మొన్న పాప చెవి మెలేసిందిట. నేను నిలదీస్తే సరదాగా అలా చేశానని అంది పనిమనిషి.

"పాపకోసం మనం ఇచ్చే బిస్కట్లు కూడా ఆ పనిపిల్లే తినేస్తోందిట. పాప రెండు కిలోల బరువు తగ్గింది. హుషారు తగ్గింది.

"అత్తయ్యా మామయ్యా ఏ జీతం ఆశించకుండా చేశారు. పాపకు ఏది కావాలన్నా నిమిషాల్లో అమర్చేవాళ్ళు.

"వాళ్ళు ఉండగా మనకు ఏలోటూ తెలి

యలేదు. మనం పొరపాటు చేశామండీ. ఘోరమైన పొరపాటు చేశాం. సరిదిద్దుకో లేని పొరపాటు చేశాం.

"పాపను ఇలా వదిలేసి నేను ఉద్యోగం చేయను. మనం కష్టపడేది పాపకోసమేగా. అలాంటి పాపను కష్టపెడుతూ ఈ సంపా దన ఎందుకు చెప్పండి? "

అతనికేం మాట్లాడాలో తోచలేదు. ఓ నిజాన్ని కాదని మూర్ఖంగా వాదించగలడా?

"ఇప్పుడు... ఇప్పుడేం చేద్దామంటావు? "

"వెళ్ళి అత్తయ్యా, మామయ్యల కాళ్ళమీద పడదాం. చేసిన తప్పులు క్షమించమని అడుగుదాం"

"వాళ్ళు ఒప్పుకుంటారా? "

"ఖచ్చితంగా ఒప్పుకుంటారు. వాళ్ళ మన సులో క్షమ వుంది, ప్రేమ వుంది. అది మనం అర్థం చేసుకోలేదు. వెంటనే వెళ్దాం" అంది.

"నిజమా మమ్మీ...? " అంటూ ఆనం దంగా వచ్చింది పాప.

చాలా చిక్కిపోయింది పాప.

"నిజం పాపా. నాన్నమ్మ, తాతయ్యా వస్తారు. నువ్వు మళ్ళీ వాళ్ళతో ఆడుకో వచ్చు. స్కూల్‌కి వెళ్ళొచ్చు"

"హాయ్..." అంటూ హుషారుగా మారి పోయింది పాప.

"చూశారా.... నాన్నమ్మ, తాతయ్యల గురించి చెప్పగానే పాపలో ఎంత హుషారు వచ్చిందో. మనం కన్నవాళ్ళే మనల్ని కన్న వాళ్ళమీద అంత ప్రేమ చూపిస్తుంటే మనమే నిర్లక్ష్యం చేశాం.

పదండి వెళ్దాం. అత్తయ్యగారిని, మామ య్యగారిని తీసుకువద్దాం" అంది.

ఆవిడలో రియలైజేషన్, వాస్తవ పరిస్థితు లపట్ల అంచనా మొదలైంది.

ఎప్పుడైతే పరిస్థితులను పోల్చి చూసుకో వడం మొదలుపెడతారో... ఎప్పుడైతే విశ్లే షణ, ఆత్మపరిశీలన మొదలవుతుందో అప్పుడే వాళ్ళలోని సిన్సియార్టీ బయటకు వస్తుంది.

ఇన్నాళ్ళు ఆవిడ తన వెర్షన్‌లోనే ఆలోచిం చింది. ఇప్పుడు కూతురివైపు, వాస్తవ పరిస్థి తులవైపు ఆలోచించేసరికి ఆమెకు వాస్తవం అర్థమవుతూ వచ్చింది.

పశ్చాత్తాపంతో వచ్చిన మార్పు బలంగా నిలిచిపోతుంది.

★ ★ ★

నీలవేణి చిక్కి సగమైంది.

రాజారాం కూడా మానసికంగా కుంగిపో తున్నాడు.

కూతురి విషయంలో ఇన్నాళ్లు ఉన్న కోపం మాయమై, ప్రేమ పెరగసాగింది.

ఎక్కడ చూసినా కూతురి గురించి గొప్పగా చెప్పుకుంటున్నారు.

'అమితగారు మీ కూతురా? ' అని అడు గుతున్నారు.

ఎంత చక్కని కూతుర్ని కన్నావని ప్రశం సిస్తున్నారు. అది రాజారాంకు గిల్టీగా వుంది.

ఇదంతా అమిత ప్రతిభ. పట్టుదల. ఒక విధంగా చెప్పాలంటే తన తల్లి, తండ్రి పట్టు బట్టారు.

పిల్లలకు ఏమిష్టమో అదే మనం చేయని వ్వాలి. మన ఇష్టాలను పిల్లలపై రుద్దకూ డదు అన్న తండ్రి మాటలు అతని చెవుల్లో మార్మోగిపోతున్నాయి.

కూతురి గురించి నీలవేణి బెంగపెట్టు కుంది. రాజారాం కూడా మానసికంగా అలి సిపోయాడు. అతనికి ఇప్పుడు తల్లి గుర్తొ స్తోంది.

తన కూతురి గురించి తను ఇంతగా తల్ల డిల్లుతున్నాడు. మరి తన గురించి తన తల్లి.

★ ★ ★

"ఏమండీ మనకే ఆస్తులు వద్దు. ఏమీ వద్దు. అమితను తీసుకురండి. లేదంటే నేనే వెళ్ళి దాని కాళ్ళు పట్టుకొని అయినా తీసు

కువస్తాను.

"ఈ ఆస్తి ఎవరికోసం చెప్పండి. మనం వెళ్ళేప్పుడు కట్టుకుపోతామా? మనం ఉండటానికి ఇంత గుడిసె అయినా చాలు. వద్దండి. మనకీ ఆడంబరాలు, డబ్బు ఏమీ వద్దు. నాకు నా బిడ్డే కావాలి" ఏడుస్తోంది నీలవేణి.

రాజారాం ఓ నిర్ణయానికి వచ్చాడు.

తన తప్పు సరిదిద్దుకోవాలి.

తన చిన్నారి అమితను తను తెచ్చుకోవాలి. తప్పు తనది అయినప్పుడు తను ఎన్ని మెట్లు కిందికి దిగినా తప్పులేదు.

★ ★ ★

ఈ వేకువ మీ కోసం ఆశ్రమంలో కొత్త కళ. అక్కడి వాతావరణం ఉత్సాహభరితంగా వుంది. ఆరోజు ఉదయమే అందరూ మార్నింగ్‌వాక్‌కు బయల్దేరారు.

రోజూ సరదాగా మాట్లాడుకుంటూ నడుస్తూవుంటారు. రోజూ ఏదో ఓ విషయం వాళ్ళకు చెబుతుంది వైదేహి.

అది వాళ్ళకు ఉత్తేజాన్ని కలిగించే విషయమే అయివుంటుంది.

"ఫ్రెండ్స్ ఈరోజు నేనా ఆర్టికల్ చదివాను. ముంబయ్ నగర శివారులో మానవ సేవాసదన్ తాలూకు కేర్ సెంటర్ ఫర్ సీనియర్ సిటిజన్ (వృద్ధ పౌరుల సంరక్షణ కేంద్రం) ఉందిట. డెబ్బయ్యేళ్ళ వృద్ధాప్యంలో కూడా వాళ్ళు ఆ సంస్థలో ఉత్సాహంగా ఉంటారుట.

అనంతకులకర్ణి అనే అరవైఏడేళ్ల వ్యక్తి తనకు కొద్దిపాటి పక్షవాతం సోకేవరకూ అనాథబాలల ఆశ్రమంలోని పిల్లల చేత యోగాభ్యాసాలు చేయించేవాడట.

డెబ్బయ్యావపడిలో పడిన డాక్టర్ ఈశ్వర్ ప్రతాప్ చిన్నారులకు చిత్రలేఖన పటిమను సానపట్టించే ప్రయత్నం చేస్తున్నారు.

ఖాళీ సమయంలో రకరకాల వంటలు నేర్చుకుంటారు. కబుర్లు చెప్పుకుంటారు. కేరమ్స్ ఆడతారు.

మానసికమైన ఒత్తిళ్ళను, డిప్రెషన్లను వాళ్ళకు వాళ్ళే పారదోలుకుంటారు. వాళ్ళకు వాళ్ళే కౌన్సిలింగ్ ఇచ్చుకుంటారు.

వైదేహి చెప్పేది అందరూ మంత్రముగ్ధుల్లా వింటున్నారు.

ఒక్కో విషయాన్ని ఒక్కో కొత్త కోణంలో చెబుతోంది.

అందుకే వైదేహి అంటే అందరికీ అభిమానం. అమిత వాళ్ళ మార్నింగ్‌వాక్‌ను ఫొటో తీసింది.

"మంచుకురిసే వేళలో... ముదిమి వయసులో" అని క్యాప్షన్ పెట్టి మేగజైన్‌లో పబ్లిష్ చేసింది.

ఈ వేకువ మీ కోసం ఆశ్రమం గురించి రాసింది. ఆ ఆర్టికల్‌కు విపరీతమైన రెస్పాన్స్ వచ్చింది.

రోజూ వృద్ధులు మార్నింగ్‌వాక్ చేసే దృశ్యాన్ని చూడ్డానికి జనం కూడా రాసాగారు. చాలామంది యువకులు వాళ్ళని ప్రేరణగా తీసుకొని తమ బద్ధకాన్ని వదిలిపెట్టి జాగింగ్ మొదలెట్టారు.

ఒక చిన్న సంఘటన పెద్ద మార్పుకు కారణమవుతుందన్న విషయం రుజువు చేసింది వైదేహి.

ఇప్పుడు చాలామంది దృష్టిలో వైదేహి ఒక ఐడియల్ షీ.

పరిపూర్ణమైన ప్రేరణ ఇచ్చే గొప్ప స్త్రీమూర్తి. దట్సాల్

★ ★ ★

మొక్కలకు నీళ్ళు పోస్తున్నారు రాజేశ్వరి, సత్యమూర్తి దంపతులు.

మరికొందరు వృద్ధులు తోటపని చూస్తున్నారు. వైదేహి ఈ పనులను పర్యవేక్షిస్తోంది.

సరిగ్గా అప్పుడే ఆ ఆశ్రమం ముందు ఆటో ఆగింది.

అందులోనుంచి సత్యమూర్తి కోడలు, కొడుకు దిగారు.

ఆటో ఆగిన శబ్దం విని అందులో నుంచి దిగిన కొడుకు, కోడలు, మనవరాలుని చూసి అలానే నిలుచుండిపోయారు సత్య మూర్తి దంపతులు.

పాప తాతయ్య, బామ్మను చూడ్డంతో సంతోషంగా 'తాతయ్యా... బామ్మా' అంటూ పరుగెత్తుకొచ్చి వాళ్లను వాటేసు కుంది.

రాజేశ్వరి మనవరాలిని ఎత్తుకొని ముద్దా డింది. కోడలు వచ్చి అత్తయ్య కాళ్ళమీద పడిపోయింది. కొడుకు తండ్రి పాదాలమీద పడ్డాడు.

"మమ్మల్ని మీరు ఇద్దరూ క్షమించండి. మీ విలువ, మీ ప్రేమ తెలుసుకోలేక పోయాం. మీరు మాతో వచ్చేవరకు ఇక్కడే వుంటాం" అన్నారిద్దరు.

సత్యమూర్తి ఏమీ మాట్లాడలేదు.

"మీరు మమ్మల్ని క్షమించలేరా నాన్నా" బాధగా అన్నాడు కొడుకు.

"క్షమించలేను. క్షమించను. ఏ తండ్రి నీడలో పెరిగావో ఏ తల్లి గుండెలమీద ఆడుకున్నావో ఆ తల్లిదండ్రులే మీకు చేదయి, బరువయ్యారు. అలాంటి బిడ్డలను క్షమించడమా.

"ఎంతోమంది పిల్లలకు పాఠాలు చెప్పాను. తల్లిదండ్రులను పూజించుమూ అని చెప్పాను. కానీ నా బిడ్డలే ఆ పాఠాలు నాకు గుణపాఠంగా మార్చి చెప్పారు.

"మమ్మల్ని పూజించకపోయినా ఫర్లేదు. ద్వేషించి, మమ్మల్ని తరిమివేశారు. ఆ విషయం అవమానించిన మీరు మరిచిపో యినా, అవమానాలకు గురైన నేను ఎలా మరిచిపోగలను? " కోపంగా అన్నాడు సత్య మూర్తి.

దోషుల్లా తల వంచుకొని నిలబడ్డారు కొడుకు-కోడలు.

వైదేహి అక్కడకు వచ్చింది.

"అన్నయ్యా ఈ చెల్లెలి మాట వింటావా? "

సత్యమూర్తి తలెత్తి వైదేహివైపు తిరిగి "నిన్ను చెల్లెలని ఎవరమ్మా అన్నది. నువ్వు తల్లివమ్మా... నాలాంటి ఎందరో అనాథ వృద్ధులకు తల్లివి. నీ ధైర్యమూ, నీ తోడూ లేకుంటే ఈరోజు మేము ఏ రైలుపట్టాల మీదో తలపెట్టి చావవలసివచ్చేది.

"మాకేకాదు, ఈ ప్రపంచంలో చాలా మంది బాధాసర్పద్రష్టులకు నువ్వు చేయూ తవి. స్నేహ హస్తానివి" రెండు చేతులు జోడించి అన్నాడు సత్యమూర్తి.

"అన్నయ్యా పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం మరోటి లేదు. వాళ్ళు మారారు. ప్రతి మనిషీ తప్పు చేస్తాడు. కొందరు మాత్రమే ఆ తప్పులను సరిదిద్దు కుంటారు.

"తప్పులను సరిదిద్దుకునేవాళ్ళు జీవితంలో మరిక తప్పులు చేయరని నా ఉద్దేశం. వాళ్ళలో వచ్చిన మార్పుని హర్షించాలి. వాళ్ళ కోరికను మన్నించాలి. అది పెద్దవా ళ్ళుగా మన కర్తవ్యం."

"అంటే మిమ్మల్ని వదిలి వెళ్ళమం టావా? " సత్యమూర్తి బాధగా అన్నాడు.

"లేదన్నయ్యా. మీరు ఈ ఆశ్రమానికి ఎప్పుడూ వస్తూవెళ్తూ వుండొచ్చు ఈ ఆశ్రమం మనందరిదీ.

"పిల్లల ప్రేమ పొందనివాళ్ళు ఇక్కడ చాలామంది ఉన్నారు. ఆ ప్రేమ మీకు దక్కే అవకాశం వచ్చింది. అప్పుడప్పుడు వచ్చి మమ్మల్ని పరామర్శించండి"

"థాంక్యూ ఆంటీ" వైదేహి రెండు చేతులు పట్టుకొని అన్నాడు సత్యమూర్తి కొడుకు.

"అప్పుడప్పుడు మీరంతా కలిసి ఈ ఆశ్ర మానికి వస్తూ ఉండండి. మీ ప్రేమను కాస్త ఇక్కడ ఉన్న వృద్ధులకు కూడా పంచండి" అంది అతనితో వైదేహి.

"తప్పకుండా" అంటూ జేబులోనుంచి పదివేల రూపాయల చెక్కు వైదేహికి ఇచ్చాడు.

"ఇది ఈ ఆశ్రమానికి నేనిచ్చే చిరుకానుక

స్వీకరించండి" అన్నాడు.

వైదేహి ఆ చెక్కు అందుకుంది. సత్యమూర్తికి, రాజేశ్వరికి చాలా సంతోషంగా వుంది. కొడుకు, కోడలులో వచ్చిన ఈ మార్పు వాళ్ళకు చెప్పలేనంత సంతోషాన్ని కలిగించడంలో ఆశ్చర్యం ఏముంది?

కొడుకు, కోడలు మనవరాలితో కలిసి బయల్దేరారు సత్యమూర్తి దంపతులు.

ఇప్పుడా ఇల్లు కళకళలాడుతూ వుంటుంది. ఉండాలి కూడా.

**ఆ**ఫీసుకువచ్చి స్కూటీని పార్క్ చేసి గేటు దగ్గర నిలబడ్డ వ్యక్తులను చూసి షాకయింది అమిత. తన తల్లిదండ్రులు. తల్లి చిక్కిపోయింది. తండ్రి నీరసంగా వున్నాడు. గెడ్డం పెరిగివుంది.

"మమ్మీ డాడీ... మీరా"

అది రోడ్డని కూడా చూడకుండా రాజారామ్ ఏడ్చేశాడు. "నీకు దూరంగా ఉండలేకపోయానురా... వచ్చేయమ్మా. నాన్నమ్మని కూడా కాళ్ళు పట్టుకొని నా తప్పులను ప్రక్షాళన చేసుకుని తీసుకువస్తాను" అన్నాడు.

తల్లి. వెక్కివెక్కి ఏడుస్తోంది.

"అమ్మా... ఏమిటిది... ఊర్కో" అంటూ తల్లిని ఊరడించింది.

"నువ్వు మనింటికి వస్తే తప్ప... మేము ఇక్కడ్నుంచి వెళ్లం" అన్నారిద్దరూ.

అప్పుడే విష్ణుశర్మ అక్కడికి వచ్చాడు. పరిస్థితి అర్థమైంది.

"రండి... లోపలికిరండి" అంటూ వాళ్ళని ఆహ్వానించాడు.

★ ★ ★

"ఒక చిన్న రిక్వెస్ట్... ఈ కొద్దిరోజుల్లోనే అమిత మాతో కలిసిపోయింది. నా భార్య విడదీయలేని అటాచ్‌మెంట్ పెట్టుకుంది అమితతో. కనీసం అప్పుడప్పుడైనా అమితను పంపిస్తూ ఉండండి" అన్నాడు విష్ణుశర్మ.

అతని గొంతు వణుకుతోంది.

"ఎంతమాట... అమిత మీకు కూడా కూతురే... మీ ఇంట్లోనూ ఉంటుంది" అన్నాడు రాజారామ్ మనస్ఫూర్తిగా.

"నాన్నా... ఈ విషయం బామ్మకు తెలిస్తే ఎంత సంతోష పడుతుందో" అంది అమిత.

"ఈ విశ్వాసఘాతుకుడు అయిన కొడుకును క్షమిస్తుందా?" బేలగా అడిగాడు



రాజారామ్ కూతుర్ని.

"బామ్మకు నీ గురించి బాధే తప్ప కోపం లేదు నాన్నా" అంది అమిత.

అందరూ వైదేహి దగ్గరికి వెళ్ళారు.

★ ★ ★

తల్లి తమ పేరుమీద రాసిన డాక్యుమెంట్లను తల్లి పాదాల దగ్గర పెట్టాడు రాజారామ్.

అంతకుముందురోజే తమ్ముళ్లతో మాట్లాడాడు. తల్లి ఇల్లు మనకు వద్దు అని చెప్పాడు. కాదూ, కూడదూ అంటే ఆ ఇంటిలో వాళ్ళకు వచ్చే డబ్బు తను ఇస్తానన్నాడు.

వాళ్ళలో కూడా ఎక్కడో ఏ కార్నర్‌లోనో గిల్టీ ఫీలింగ్ ఉండడంవల్ల వెంటనే అందుకు ఒప్పుకున్నారు.

"అమ్మా.. నేను తప్పుచేశాను. నేనేకాదు, నీ కొడుకులు, కోడళ్ళు అందరూ తప్పు చేశారు. నువ్వు క్షమించినా, శపించినా నీ ఇష్టం. కానీ, నువ్వు క్షమించానని ఒక్క మాట చెప్పి ఇంటికివస్తే తప్ప పచ్చిమంచినీళ్లు కూడా ముట్టను" రాజారామ్ చెప్పాడు.

నీలవేణి క్షమించమని వేడుకుంది.

"మీ మీద నాకు కోపంలేదు. బాధ తప్ప, జాలి తప్ప... జీవితం క్షణకాల భంగురమే. దానికోసం ఈ తాపత్రయాలు, స్వార్థాలు ఎందుకు? "

"ఇక ఇంటికి రావడం గురించి అంటారా? ఇప్పుడు నేను రాలేని స్థితి. నామీద ఆధారపడ్డ వాళ్ళను వదిలి రాలేను.

అయినా నేను ఎక్కడ వున్నా, మనసు మీ చుట్టే తిరుగుతుంది. అప్పుడప్పుడు వస్తాను. మీరూ రండి.

ఏ ఆదివారంరోజో, పండుగరోజో అనాథలైన ఈ వృద్ధులతో గడపండి. నామీద పడిన ఈ కొత్త బాధ్యత నుంచి నేను రాలేను" తన నిర్ణయం స్పష్టంగా చెప్పింది వైదేహి.

తల్లి క్షమించడమే అతనికి మహదానం దాన్ని కలిగించింది.

"అలాగేమ్మా... ప్రతి ఆదివారం ఇక్కడికి వస్తాం. అందరం కలిసి గుడుపుదాం ఆ ఒక్కరోజు" చెప్పాడు మనస్ఫూర్తిగా రాజారాం.

"మరో విషయం, విభావర్ అని మంచి అబ్బాయి. అమిత అంటే అమితంగా ఇష్టపడుతున్నాడు. అమితకు ఇష్టమైతే వాళ్ళిద్దరికీ పెళ్ళిచేస్తే ఆ జంట చూడముచ్చటగా ఉంటుంది" అంది వైదేహి.

అమిత సిగ్గుల మొగ్గే అయింది.

★ ★ ★

విభావర్‌తో అమిత పెళ్ళి వైభవంగా జరిగింది. ఈ వేకువ మీకోసం ఆశ్రమమే కళ్యాణమండపం అయింది.

వైదేహి కొడుకులందరూ కోడళ్ళతో సహా వచ్చారు. వాళ్ళలో కొద్దిగా మార్పు వచ్చింది. ఆ మార్పు శాశ్వతమవ్వడానికి అట్టే సమయం పట్టదు.

సులోచన పండంటి మగబిడ్డను ప్రసవించింది. సులోచనను వెన్నంటి పండంటి బిడ్డ పుట్టేవరకు వుండి తన బాధ్యతను నిర్వర్తించింది వైదేహి.

ఆ తర్వాత ఆమె మజలీ మరో దగ్గర. ఎక్కడ ఓ తల్లి అవసరం, ఓ అత్తయ్య చేయూత... ఓ ప్రేమ స్పర్శ అవసరమో... అక్కడ వైదేహి ఉంటుంది.

ఈ వేకువ మీకోసం ఆశ్రమం సిద్ధంగా ఉంటుంది. ప్రేమ రాహిత్యంలో ఉండేవాళ్ళకు ఆ ఆశ్రమం వరప్రదాయిని అయింది.

అమిత విష్ణుశర్మ ఇంట్లో, రాజారామ్ ఇంట్లోనూ వుంటూ ఇద్దరి తల్లుల ముద్దుల కూతురయింది.

విభావర్ ఫ్యామిలీ, సులోచన ఫ్యామిలీ బాగా కలిసిపోయారు.

'ఈ వేకువ మీకోసం' ఆశ్రమం గురించి దేశం నలుమూలలా మంచి ప్రచారం జరిగింది. పాపులార్టీ పెరిగింది.

ప్రతిరోజు వేకువఝామున ఆ ఆశ్రమ ప్రాంగణం దగ్గర చాలామంది ఆసక్తిగా నిలబడి గమనిస్తూ ఉంటారు.

వృద్ధులంతా క్రమశిక్షణగల సైనికుల్లా వైదేహి ఆధ్వర్యంలో కష్టాలు మరిచిపోయి సరదాగా కబుర్లు చెప్పుకుంటూ ఆ మంచులో మార్నింగ్‌వాక్‌చేస్తూ కనిపిస్తారు.

వృద్ధులారా... 'ఈవేకువ. మీకోసం...' అని మంచు వాళ్ళని స్పృశిస్తూ చెబుతోన్న ఫీలింగ్ కలుగుతోందక్కడ.

నిజమే ఈ వేకువ వాళ్ళకోసమే.

# చతుర ప్రపంచం

## సెల్‌ఫోన్‌లలో జూదం

అమెరికాలో లాస్‌వేగాస్‌కి చెందిన కమెడియన్ మేక్ కింగ్ ఓ కొత్తరకం ఇండోర్ గేమ్‌ని కనిపెట్టాడు. ఇప్పుడది లాస్‌వేగాస్ లోనే కాక అమెరికా అంతటా చాలామంది ఆడుతున్నారు.

చివరలో మొదట చెప్పిన వాక్యం కరెక్ట్‌గా చివరి ఆటగాడుకూడా చెప్పగలిగితే ఆటలో పాల్గొన్నవారంతా గెలుపొందినట్లు. అయితే ఎప్పుడూ ఆ వాక్యం యథాతథంగా ఒకరినుంచి మరొకరికి వెళ్ళదు. అనేక మార్పులు, చేర్పులతో వెళుతుంది. ఎవరు ఆ వాక్యాన్ని మారిస్తే వారు ఆ ఆటలో ఓడిపోయినట్లే.




ఇందులో ఆడేవారందరికీ తప్పనిసరిగా సెల్ ఫోన్ వుండాలి. ఆటలో పాల్గొనేవారు ఒకరి సెల్ ఫోన్‌కి ఫోన్‌చేసి గుసగుసలాడుతున్నట్టుగా పదిపదాలు మించని ఒక వాక్యం చెప్పాలి. అదీ ఒక్కసారే. దాన్ని విన్నవాళ్ళు ఆ ఆటలో పాల్గొనే తర్వాతి అతని సెల్ ఫోన్‌కి ఫోన్‌చేసి తను విన్నది యథాతథంగా, సునాయాసంగా చెప్పాలి. ఇలా ప్రతి ఆటగాడు తన తర్వాతి అతనికి తను విన్నది గుసగుసగా చెప్పాలి. ఆట

ఉదాహరణకి మొదటి అతను 'మేక్ కింగ్ ఈజ్ ఎ కామెడీ జీనియస్' అని చెప్పాడనుకుందాం. దాన్ని సెల్‌ఫోన్‌లో విన్న రెండో అతను దాన్ని యథాతథంగా మూడో అతనికి చెప్పగలిగితే రెండో ఆటగాడు గెలుపొందినట్లు. అలాకాక ఏ ఒక్కపదం మార్చి చెప్పినా ఓడిపోయినట్లు. రెండో అతను మార్చి చెప్పినా ఆ చెప్పినదాన్ని కరెక్ట్‌గా

తర్వాతి ఆటగాడికి మూడో అతను చెపితే అతను గెలుపొందినట్లు. ఈ ఆటలో కనీసం పాతికమంది పాల్గొనాలి. అంతా విశాలమైన హాల్లో కూర్చుని సెల్‌ఫోన్‌లలో చెప్పాలి. ఎవరు ఏ నంబరుకి ఫోన్ చెయ్యాలో ఆట గాళ్ళకి ముందే ఆ నంబరుగల చీటీలు ఇస్తారు. ఫోన్ మోగేదాకా తన తర్వాతి ఆట గాడు ఎవరో ఎవరికీ తెలియదు.

ఈ మొత్తం ఫోన్ సంభాషణ టేప్‌లో రికార్డవుతుంది. తర్వాత ఆ టేప్‌ని అంపైర్ విని ఎవరు గెలిచారో, ఎవరు ఓడారో నిర్ణ యిస్తాడు.

నూట ఏభైమంది దాకా ఈ ఆటలో పాల్గొనవచ్చు. మొదట మేక్‌కింగ్ చెప్పిన వాక్యం 'మేక్‌కింగ్ ఈజ్ ఎ మాజిక్ జీనియస్' కాస్తా చివర్లో 'మై కింగ్ కంట్రోల్స్ మెనీ రీజియన్స్'గా మారిపోయింది. ఇంకో ఆటలో 'మైకిడ్ కెన్ నో ద ఫీచర్'గా మారింది.

ఈ ఆట క్రమంగా ఇప్పుడు జూదంగా కూడా పరిణమించింది. మొదట చెప్పిన వాక్యంలోని పదాలు చివరగా ఎన్ని పదాలుగా మారుతుంది అన్న అంశంమీద బెట్‌లు మొదలవుతున్నాయి. అలాగే మొదటి పది పదాల్లో ఎన్ని వుంటాయి, ఎన్ని వుండవు, చివరి వాక్యంలో ఖచ్చితంగా వుండే పదం ఏమిటి, మొదటగా ఎన్నో ఆట గాడు పదాల్ని మారుస్తాడు.... లాంటి ఎన్నో అంశాలమీద బెట్స్ మొదలయ్యాయి.

గుర్రపు పందాలు, పేకాటలులా ఈ 'వర్డ్ గేమ్' కూడా జూదరులని బాగా ఆకర్షిస్తోంది. లాస్‌వేగాస్‌లోని కొన్ని జూదగృహాల్లో సౌండ్ ప్రూఫ్ కాబిన్స్ నిర్మించి, అందులో ఆటగాళ్ళని సెల్‌ఫోన్స్‌తో వుంచి ఆడిస్తున్నారు. ఈ ఆటలో పాల్గొనేవాళ్ళు ఆ జూద గృహాలకి డబ్బుచెల్లించాలి. బెట్‌లో పాల్గొనేవాళ్ళకి ఆటకి కొన్ని నిమిషాల ముందు ఆ పదిపదాల వాక్యాన్నిస్తారు. దాని ఆధారంగా వాళ్ళు బెట్‌లని కడతారు.

---

## డిటెక్టివ్ కథలు

డిటెక్టివ్ కథలు చాలా మందిని ఆకర్షిస్తాయి. అపరాధ పరిశోధనకు చెందిన ఎలాంటి పజిల్‌కయినా పాఠకుల డిమాండ్ విశేషంగా వుంది. దీన్ని ఆధారంగా చేసుకుని ఇంటర్‌నెట్‌లో అనేక వెబ్‌సైట్లు వెలిశాయి. ఆ సైట్‌లోకి వెళితే నిత్యం లేదా వారానికోసారి ఓ హత్యని లేదా నేరాన్ని సాల్వ్ చెయ్యాలి. సాఫ్ట్‌వేర్ నిపుణుల పుణ్యమా అని కథనంతా బొమ్మల రూపంలో ఇస్తారక్కడ.

ఉదాహరణకి ఓ గదిలో శవం, శవానికి గుచ్చిన కత్తి, ఆ గదిలో ఇంకా అనేక వస్తువులు వుంటాయి. ఏ వస్తువుల మీద కర్సర్‌ని వుంచి క్లిక్ చేసినా ఆ వస్తువు హత్యకి ఎంత సమయం ముందు ఎలా వుపయోగించబడిందో కనపడుతుంది. ఉదాహరణకి ఆ గదిలోని ఓ కుర్చీని క్లిక్ చేస్తే అందులో ఎవరు ఏ సమయంలో కూర్చున్నారో కనిపిస్తుంది. ఇలాగే ఏష్‌ట్రే, మంచం, కిటికీ తలుపు, గది తలుపు ఇంకా ఆ గదిలోని టీవీ, ఫ్రిజ్‌లాంటి అన్ని ఇతర వస్తువుల మీదా క్లిక్ చేస్తే హత్యకి ముందు ఆ గదిలో ఏం జరిగిందో మొత్తం కంప్యూటర్ ముందు కూర్చున్న వాళ్లకి తెలుస్తుంది. అలా తెలిసిన వాటిల్లో క్లూలని పట్టుకుని హంతకుడెవరో నిర్ణయించాలి.

ఆ గదిలోంచి బయటకు కూడా వెళ్ళచ్చు. ఉదాహరణకి కుర్చీమీద క్లిక్ చేస్తే హత్యకి 7 నిమిషాల ముందు అందులో ఓ వ్యక్తి కూర్చున్న దృశ్యం ప్రత్యక్షం అవుతే ఆ వ్యక్తి మీద క్లిక్ చేస్తే ఆయనింటికి వెడతాం. అక్కడి వస్తువులను పరిశీలించవచ్చు లేదా ఆయన ఆఫీసులో వుంటే అక్కడికి

వెడతాం.

ఒక్కోసారి పోలీస్‌స్టేషన్ అన్న మాటల మీద క్లిక్ చేస్తే పోలీస్ స్టేషన్ స్క్రీన్‌మీద కనిపిస్తుంది. ఇన్‌స్పెక్టర్ జరిగింది మనకు వివరిస్తాడు.

ఈ ఆటలో పాల్గొనేవాళ్లు మౌస్‌తో క్లిక్ చేస్తూ ఒక చోట నుంచి ఇంకో చోటకి వెళుతూ క్లూలని సేకరించి నేరస్థుడిని కనిపెట్టాలి.

నంలోని ప్రయాణీకుల్లో ఎవరు హైజాకరో కనుక్కోవాల్సి వుండచ్చు పాత్రల మీద క్లిక్ చేస్తే అవి మాట్లాడతాయి కూడా. ఈ రకం డిటెక్షన్ వెబ్ సైట్లకి మంచి ఆదరణ వుంది. ప్రకటనదారుల ద్వారా వాటిని నడిపే వారికి ఆదాయం వస్తుంది.

మర్డర్ మిస్టరీ సైట్లు వందలకొద్దీ ఇంట ర్‌నెట్‌లో ఒక్క ఇంగ్లిషులోనే కాక అనేక యూరోపియన్ భాషల్లో కూడా వున్నాయి.




అందుకు ఎంత టైమ్ పడుతుందో ఆట మొదట్లో తెలియజేస్తారు. ఇరవై నిమిషాల నుంచి సగటున ఏభై నిమిషాల్లో నేరస్థుడిని పట్టాలి. మనవల్ల కాకపోతే ఆ సంగతి క్లిక్ చేస్తే జరిగింది మొత్తం మనకి కనిపి స్తుంది.

ఈ ఆటలో ప్రవేశించడానికి ముందు దేని మీద క్లిక్ చెయ్యాలో ముందుగా తెలియజే స్తారు. ఉదాహరణకి గడియారం మీద క్లిక్ చేయమని వుండచ్చు ఇది హత్యే కానవస రంలేదు. బ్యాంకు దొంగతనంలో బ్యాంకు ఉద్యోగస్థుల్లో ఎవరు దొంగలకి సహకరిం చారో కనుక్కోవాల్సి వుండచ్చు లేదా విమా

ఈ ఇంటర్‌నెట్ సౌకర్యంగల ఉద్యోగస్థులు సాధారణంగా ఈ ఆటని తమ లంచ్ అవ ర్‌లో లంచ్ తింటూ ఆఫీసుల్లో ఆడు కుంటూ వుంటారు. వీకెండ్స్‌లో వీటికి పెద్దగా డిమాండ్ వుండదు. కాబట్టి వర్కింగ్‌డేలో మొదటి రోజయిన సోమ వారం కొత్త గేమ్ మొదలవుతూ వుంటుంది.

విజయవంతంగా నేరస్థుణ్ణి కనిపెట్టిన వారి పేరు 'గేలరీ ఆఫ్ డిటెక్టివ్స్' అనే చోట

నమోదవుతుంది. స్కాన్ చేసిన ఫొటో పంపితే కొన్ని సైట్లలో విజేతల ఫొటోలు కూడా గేలరీలలో వుంచుతారు. వెనకాల మ్యూజిక్ కూడా ఈ ఆటలో వస్తుంటుంది. అది అవసరం లేని వారు దాన్ని ఆఫ్ చేయవచ్చును.

ఇంటర్‌నెట్ గురించిన పరిజ్ఞానం, అభిలాష వుంటే మనిషికి టైమే తెలియదు.

## ప్రార్థనకి టంచనుగా

పోర్చుగల్‌లోని లిస్బన్‌లో ప్రెతీ అనే శునకం వుంది. దానికి దైవభక్తి చాలా ఎక్కువ అని చెబితే ఆశ్చర్యం అనిపిస్తుంది. అది ప్రతి ఆదివారం చర్చికి వెళ్ళేవాళ్ళతో కలిసి తప్పనిసరిగా చర్చికి వెడుతూ వుంటుంది. ప్రెతీ నివశిస్తున్న గ్రామానికి, చర్చికి మధ్యదూరం ఇరవైఆరు మైళ్లు. అంత దూరం అది ఓపిగ్గా నడిచివెళ్లి, తిరిగి వెనక్కి నెమ్మదిగా నడుచుకుంటూ తన గ్రామానికి చేరుకుంటుంది. మూడు సంవత్సరాలనుంచి ఆ కుక్క తన యజమాని ఇల్లు వున్న సోబ్రాడో గ్రామం నుంచి తెల్లవారుఝామున 5 గంటలకు బయలుదేరి, అంతా చర్చికి చేరుకునే సమయానికి, తను కూడా చేరుతుంది. అప్పటికి సమయం 7-30 అవుతుంది.

చర్చిలో పూజచేసే భక్తులు తమ బెంచీల మీద నుంచి లేచి నిలబడినప్పుడు ప్రెతీ తాను కూడా నిలబడుతుంది. వారు కూర్చున్నప్పుడు తాను కూడా కూర్చుంటుంది.




అక్కడ ప్రార్థనలు పూర్తయ్యాక ఆ శునకం తిరిగి ఇంటిముఖం పడుతుంది. ఒక్కొక్కసారి అది తనకు బాగా తెలిసినవారి కార్లో ఎక్కి యజమాని ఇంటికి చేరుతుంది. తనకు పరిచయం లేనివారయితే ఎంత బతిమిలాడినా వారి కార్లో ఎక్కదు.

చర్చిలో ప్రార్థన కార్యక్రమం పూర్తవగానే భక్తుల్లో అనేకమంది ప్రెతీని చూడడానికి చర్చిలోంచి త్వరగా వెలుపలికి వస్తారు.

# పావని పై సమీక్షలు

ఏప్రిల్ 'చతుర'లో ప్రచురితమైన మునిపల్లె లక్ష్మీరమణకుమారి నవల 'పావని' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## మనోవైజ్ఞానికం

*(మొదటి బహుమతి రూ. 100/– పొందిన సమీక్ష)*

ప్రతి మనిషికీ 'వ్యక్తిత్వం' ఎంత అవసరమో స్పష్టంగా చెప్పిన మనోవైజ్ఞానిక నవల పావని. వ్యక్తిత్వం లేకుండా అవతలి వ్యక్తిని పిచ్చిగా ఆరాధించడం, ఆ వ్యక్తి కోసమే ఊపిరి పీల్చడం మాత్రమే ప్రేమ అనే భ్రమలో మునిగి ఉన్న నేటి యువతకు చక్కటి సందేశం ఈ నవల. సాధారణ స్థాయిలో ఉన్న పావని ఒక సంపూర్ణ మూర్తిమత్వం గల వ్యక్తిగా పరిణతి చెందడాన్ని అందంగా అందించారు రచయిత్రి మునిపల్లె లక్ష్మీరమణకుమారి.

'అర్థవంతమైన సృజనాత్మక జీవితాన్ని గడిపేందుకు మీరు నిర్ణయం తీసుకున్నరోజే మీ నిజమైన పుట్టినరోజు' అనే పెద్దల వచనాన్ని పావని సార్థకం చేయడం హర్షదాయకం. తన వెన్నుతట్టి తోడుగా నిలిచే అర్ధభాగంగా కాబోయే భార్యను మలచుకున్న హర్ష పాత్ర నేటి యువతకు స్ఫూర్తిదాయకం. ఉదాత్తమైన పాత్రలో ప్రియాంక మానసిక సౌందర్యం, రచయిత్రి వర్ణించిన ఆమె శారీరక సౌందర్యాన్ని అధిగమించింది.

మానసిక ఉద్వేగాలకు ఎక్కువగా లోనయ్యే కౌమారదశలో నిజమైన ఆప్తులు తల్లిదండ్రులు మాత్రమే. 'పిల్లకన్నా నాకు ఏదీ ముఖ్యం కాదు' అన్న శ్యామల తల్లి, ఎప్పటికప్పుడు కూతురును ఒక కంట జాగ్రత్తగా కనిపెట్టుకొంటూ వచ్చిన పావని తల్లిదండ్రులు నేటి పేరెంట్సు అందరికీ ఆదర్శం. పైకి మోడర్న్‌గా కనిపిస్తూ




లోపల మూఢనమ్మకాలకు అత్యంత ప్రాధాన్యతను ఇచ్చే సునంద వంటి వారికి నేటి సమాజంలో కొదవలేదు. షాపింగ్‌ను అలవాటుగా మార్చుకొన్న రుచిక పాత్ర సహజంగా ఉంది.

గ్లోబలైజేషన్ ప్రభావం వలన కళలు కూడా కమర్షియల్ అయిన వైనాన్ని సందర్భోచితంగా ప్రస్తావించారు రచయిత్రి. ఉన్నదాంతో అసంతృప్తి, లేని దేనికోసమే తపన... ఈ స్పీడు యుగంలో చాలామందికి ఇవే జీవిత సర్వస్వమైపోయాయి. జానకి కోలాహలం, డాక్టరు కూతురు పాత్రల ద్వారా ఇటువంటి వారిని ఈ నవల ఆలోచింపచేస్తుంది. వెంకటలక్ష్మి,

ఆనందరావుల వృత్తాంతం, సమాజంలో వేళ్ళూనిన లంచగొండితనాన్ని ఎండగట్టింది. దాదాపుగా విలన్ పాత్ర అనేది లేకుండా ఆద్యంతం నడవడం ఈ నవల మరొక ప్రత్యేకత. చక్కటి అర్థవంతమైన నవలను అందించినందుకు 'చతుర'కు మా కృతజ్ఞతలు.

**– తాటిపర్తి మైథిలి**
నార్తు మోపూరు

## సాధనమున పనులు...

***(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)***

"సాధనమున పనులు సమకూరు ధరలోన..." అనే వేమన మాట అక్షరసత్యమని నిరూపించిన నవల 'పావని'. ఏ రంగంలోనైనా ఒక స్థానాన్ని చేరుకోవాలంటే ఎంత కష్టపడాల్సివుంటుందో రచయిత్రి కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించారు. 'తాను పాడడానికి ప్రయత్నించాక అర్థం అవుతోంది, పాడటం ఎంత కష్టమో' అని పావని అనుకోవడం ఒక ప్రారంభం మాత్రమే. దిగితే కానీ లోతు తెలీదు. అంచెలంచెలుగా పావనితోపాటు పాఠకులను కూడా ఆ వాస్తవంవైపు నడిపించడమే ఈ నవల ప్రత్యేకత.

పేరు ప్రఖ్యాతులున్న సినిమా హీరోలు కూడా తమ స్థానాన్ని కాపాడుకొనేందుకు అనేక గంటలు కష్టపడి పనిచేయక తప్పదనే కఠోర వాస్తవం 'సూరి' పాత్ర ద్వారా ఆవిష్కరింపబడింది. అభిమాన హీరోలను అనుకరిస్తూ, తమ విలువైన కాలాన్ని వ్యర్థంగా గడిపేస్తున్న నేటి యువతకు ఇది కనువిప్పు. సంగీతం వంటి లలితకళలలో ఉన్నతస్థితికి చేరిన కళాకారుల వెనుక ఎంతటి పట్టుదల, కఠోరదీక్ష ఉంటాయో తబలా విద్వాంసుడి ఇంటర్వ్యూ నిరూపించింది. అప్పటికప్పుడు కళాకారులమై పోగలమనే భ్రమలో ఉన్న వారు దీనిని స్ఫూర్తిగా తీసుకోవాలి. 'సింహనాదం గురూజీ' వంటివారివలన సమాజానికి మంచా? చెరుపా? అనే సున్నితమైన చర్చను పాఠకులకు వదిలివేసి, 'కష్టపడకుండా ఏదీ రాదు' అనే సిద్ధాంతం ఆ రంగానికి కూడా ఎలా వర్తిస్తుందో చక్కగా తెలిపారు రచయిత్రి.

కేవలం సమస్యలను పాఠకుల ముందుంచడమే కాక, వాటిని సమగ్రంగా విశ్లేషించి, పరిష్కార మార్గాలు చూపడం ఈ నవల విశిష్టత. తనలో దాగివున్న బద్ధకాన్ని వైరాగ్యమనుకొనే మధురానంద్ పదోక్లాసు పరీక్షకు ప్రిపేర్ కావడం, యాక్టింగ్ అంటే ఆషామాషీ వ్యవహారం కాదని గ్రహించిన షఫాలీ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరడం ఇందుకు తార్కాణాలు.

ఆత్మవిశ్వాసం, కఠోర పరిశ్రమలే వ్యక్తి జీవన సౌధానికి పూనాదిరాళ్ళనే చేదునిజాన్ని తీయని ప్రేమ నేపథ్యంలో అందించిన రచయిత్రి అభినందనీయురాలు. రచయిత్రి సునిశిత పరిశీలనా దృష్టికి ఈ నవల ఒక దర్పణం. యువతకు సరైన దిశానిర్దేశనం చేసే మనోవికాస గ్రంథాల సరసన చేర్చగల నవల 'పావని'. ఇటువంటి ప్రయోజనాత్మక నవలను అందించిన 'చతుర'కు కృతజ్ఞతలు.

**– వి.వి. హేమప్రద**
నెల్లూరు

## టీనేజ్ భ్రమలు

***(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

ఈ నెల చతురలో ప్రచురితమైన పావని నవల మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. టీనేజ్‌లో ప్రేమించడం, ఆ ప్రేమ దక్కకపోతే ఆత్మహత్యలకు పాల్పడటం నేడు సహజమైపోయింది. ప్రతీ మనిషికి ఒక లక్ష్యం, గమ్యం ఉండాలని, దానికోసం

ఎంతో కృషి చేయాలని, ప్రేమ ఒక్కటే ముఖ్యంకాదని హర్ష కేరక్టర్ ద్వారా చెప్పించారు రచయిత్రి. నేడు మన సమాజంలో కొంతమంది ఎందుకు బతుకుతున్నామో కూడా తెలియకుండా ఒక గమ్యం అంటూ కూడా లేకుండాబతికేస్తున్నారు. అటువంటి వారు ఈ నవల చదివితే కొద్దిగానైనా మారే అవకాశం ఉంది. నేడు విద్యార్థులు టీనేజ్ అనేది ప్రేమించడానికి, అల్లరి చేయడానికి, సరదాగా గడపడానికే అనే భ్రమలో ఉన్నారు. అటువంటివారికి ఈ నవల ఒక మంచి స్ఫూర్తిదాయకమవుతుంది. తల్లీ, తండ్రీ చదువుకోమని, ఎంతో కష్టపడి ఫీజులు కట్టి కాలేజీకి పంపిస్తుంటే అది అర్థం చేసుకోకుండా ప్రేమా, దోమా అని వెర్రివేషాలు వేయడం, అదిగాని ఫెయిలైతే ఆత్మహత్యలకు పాల్పడటం నేడు చాలా సహజమైపోయింది. ప్రేమ ఫెయిలైతే చావు ఒక్కటే పరిష్కారం కాదు అని, పావని, శ్యామలల్లా ఆత్మవిశ్వాసాన్ని మెరుగుపరచుకుంటే మనలో ఉన్న టాలెంట్ ని గుర్తించవచ్చని చక్కని సందేశాన్ని అందించారు రచయిత్రి. ఒక్క ప్రేమ గురించేకాక లంచం మన సమాజంలో ఎంతగా ప్రబలిపోయిందో చక్కగా వివరించారు. సామాన్యులకు సైతం చక్కగా అర్థమయ్యేలా ఉందీ రచన. కాకపోతే ప్రేమించడంవల్లే మనిషి పాడయిపోతున్నాడని, తన లక్ష్యాన్ని సాధించలేకపోతున్నాడని ప్రేమించడమే నేరమన్నట్లు శివరాజ్ అనడం ఏమీ బాగాలేదు. రోషిణి కేరక్టర్ ఏమయిపోయిందో అర్థంకాదు. నవలలో ఎక్కువ పాత్రలు వచ్చిపోతుండటంతో కొద్దిగా గజిబిజిగా అనిపించినా చివరివరకు ఆసక్తిదాయకంగా చదివించింది ఈ నవల. రుచిక, ప్రియాంక, శ్యామల కేరక్టర్లు నిజమైన స్నేహానికి నిదర్శనాలుగా చెప్పవచ్చు పావని ఎంతగా బాధపడ్డా చివరకు ప్రేమించిన హర్షనే పొందటం చాలా ఆనందం కలిగించింది. పిల్లలు, పెద్దలు కూడా చదవాల్సిన నవల ఇది. ఇంత మంచి నవలను అందించిన రచయిత్రికి, చతురకు మా ధన్యవాదాలు.

– ఆర్.కె. శ్రీదేవి
తుని

## ఓ యువతా... మేలుకో

*(నాల్గవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

మొదట ఏదో తమాషాగా, కాలక్షేపంగా కాలేజి అల్లర్లతో మొదలయిన నవల ఒక చక్కని సందేశాన్ని అందించింది. ప్రేమా అనే రెండక్షరాలకి ఎంత చరిత్ర వుందో. అది ప్రేమికుల జీవితాల్ని నందనవనం చేయగలదు, ఎడారిగానూ మార్చగలదు. ఈ తరం పిల్లలు ఇల్లు వదిలి బయటకు వెళ్ళినాక ఎలా వుంటారో అసలు తల్లిదండ్రులకు కూడా తెలియదు ఒక్కోసారి. ఆ వయసులో వున్న ఆకర్షణని ప్రేమ అనుకుని ఎంతోమంది సమయాన్ని, జీవితాన్ని వృథా చేసుకుంటున్నారు. అంతేకాదు ఇంట్లోవాళ్లు ఒప్పుకోరని ఆత్మహత్యలు ఒకటి. అనాలోచితంగా తొందరపడి చేసే ఈ పనివల్ల కన్నవాళ్ళ గుండెల్లో ఆరని మంటలు నింపుతారు. నిజంగా ఒకరంటే ఒకరికి ఇష్టం వుంటే కలిసి జీవించాలనుకోవటంలో తప్పులేదు. చదువు పూర్తి కాకుండా ఆర్థిక స్వాతంత్ర్యం లేకుండా ఎలా బతుకుతారో తెలియదు. విచక్షణ అంతకంటే లేదు. క్షణికావేశం, ఆపై ఆత్మహత్యలు ఇదేనా ప్రేమంటే? మానసిక పరిపక్వత లేని ప్రేమ నిలబడదు.

జనాభా పెరిగి ఉద్యోగావకాశాలు తగ్గి యువత అంతా విదేశాలకి ఎగబడుతున్నారు. ఎక్కడ వున్నా ఈ రోజుల్లో వున్న పోటీని తట్టుకోవాలంటే ఎంతో శ్రమపడి చదవాలి. ఏదైనా తిరిగి పొందగలం కానీ

సమయం మాత్రం మన గుప్పిట్లో నిల వదు. వ్యర్థమైన ఆలోచనలతో కాలాన్ని వృథా చేయకూడదు. ఇది గుర్తుపెట్టుకుని యువత తాము ఎంచుకున్న మార్గంలో విజయులైతే ఆనందంగా వుంటుంది.

పావని పిచ్చి ఆలోచనల్ని బాధ్యతారహిత మైన ప్రవర్తనని ఒకదారిలో పెట్టి పైకి ఎది గేట్లుగా చేశారు హర్ష, ప్రియాంకలు. వాళ్ళు నిజమైన, స్వచ్ఛమైన స్నేహితులు. అందాల రాణి ప్రియాంకకి అంతకంటే అందమైన మనసుందని, తాము ఎన్నుకున్న మార్గమే భవిష్యత్తులో తమ జీవితానికి మార్గదర్శకం అవుతుందని రచయిత్రి యువతకు చక్కని సందేశాన్నిచ్చారు. ఆత్మవిశ్వాసం, సరైన భవిష్య ప్రణాళిక, క్రమశిక్షణ వుంటే ఇక యువతకు తిరుగులేదు. ఎదురులేదు.

– *యన్. ఇందిర*
సికింద్రాబాద్

## వ్యాపారం కోసం

***(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

ప్రేమించుకొని పెళ్ళి చేసుకోవటానికి పెద్దలు ఒప్పుకోవట్లేదనే కారణంగా ఆత్మహ త్యలు చేసుకొంటున్న జంటల గురించి తరచూ పేపర్లో చదువుతుంటాం. అంతే గాక తను ప్రేమించినా ఎదుటివాళ్ళు ప్రేమించట్లేదని ఎదుటివారిని బెదిరించటం. అయినా సఫలీకృతులు కాలేకపోతే అమ్మా యిలు ఆత్మహత్యలు. అబ్బాయిలయితే హత్యలు చెయ్యటంలాంటి వార్తలు పేపరు వాళ్ళు అదో పెద్ద సమాచారంలాగా ఇంకొం తమందిని ప్రేరేపించటానికి ప్రచురించటం. ఇంత బాధాకరమైన వస్తువును తీసుకొని మునిపల్లె లక్ష్మీరమణకుమారి రచించిన 'పావని' నవల ఆలోచింపచేసేదిగా ఉంది.

కాలేజీల్లో అడుగుపెట్టిన దగ్గరనుంచి చదువుకోవటమనేదాన్ని పక్కకు నెట్టి ప్రేమించడమే ధ్యేయంగా ఉండే పావనిలాం టివాళ్ళు నేడు ఎక్కువవుతున్నారు. ప్రేమిం చటం, పెళ్ళి చేసుకోవటం తప్పు కాకపో వచ్చు కాని అది ఎప్పుడు? జీవితంలో స్థిర పడ్డాక జీవితంలో స్థిరపడాలంటే ఆర్థికంగా నిలదొక్కుకోవాలి. అందుకోసం బాగా చద వాలి. ఒక లక్ష్యం ఏర్పరుచుకొని పట్టుద లతో దాన్ని సాధించాలి. పదిమందిలో పేరు సంపాదించుకోవాలి. ప్రత్యేకతను పొందాలి. రచయిత్రి హర్ష, ప్రియాంకలను అలా ఆదర్శనీయులుగా చిత్రించారు. చివర్లో వాళ్ళు చెప్పిన మాటలు యువతీ యువకులందరూ ఆలోచించదగ్గవే.

'నేటి సినిమాల్లోని ప్రేమే నిజమనుకొని పిల్లలు దారితప్పవద్దు. పెద్ద నిర్మాతలొకరు చెప్పినట్లు వాళ్ల వ్యాపారం కోసం అలాంటి సినిమాలు తీస్తారు. అట్లాగే చెయ్యాలనుకొని మన జీవితాలు నాశనం చేసుకోకూడదు. తల్లిదండ్రుల హృదయాల్లో ఆరనిచిచ్చు పెట్ట కూడదు.

రచయిత్రికి అభినందనలు.

– *పిడపాటి లక్ష్మీప్రసన్న*
హైదరాబాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.
Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; .Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044-2314980; Bangalore: 080- 3503498

